శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# వేదవైభవం-4



**లక్ష్మీ హయగ్రీవ స్వామి**



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# వేదం

మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్ జగద్గురు
ప్రతివాది భయంకరమ్ గాధి అనంతాచార్య స్వామి

ప్రత్యక్షం అనుమానం శబ్దం అని ప్రమాణాలు మూడు విధాలు. వాటిలో శబ్దం అనేది లౌకికం అని వైదికం అని రెండు విధాలుగా ఉంటుంది. కొత్త కొత్తగా మానవులు మొదలైనవారిచే చెప్పబడే శబ్దాలు లౌకిక శబ్దాలను అనబడతాయి. వైదిక శబ్దాలే వేదం అని పిలువబడుతున్నాయి.

వేదం అనేది ఎల్లప్పుడూ ఒకే విధంగా, ఒకదానితో ఇంకొకటి సంబంధాన్ని కలిగినదై ఉచ్చరింపబడే శబ్ద రాశి. ఈ వేదం సృష్టి ఆరంభంలో భగవంతునిచే చతుర్ముఖునకు ఉపదేశింపబడి, అతని చేత అతని శిష్యులకు ఉపదేశింపబడి, ఈ విధంగా శిష్యప్రశిష్యపరంపరగా మన వరకు అందుతున్నది.

వేదం అనే శబ్దానికి "విదంతి అనేన ఇతి వేదః "అని, "వేదయతీతి వేదః" అని రెండు విధాలుగా వ్యుత్పత్తి చెప్పబడుతున్నది. ఈ వేద శబ్దం "విద—జ్ఞానే" అనే ధాతువు నుండి పుట్టినది. "వేదయతి" అనే పదానికి "తెలుపుతున్నది" అనే అర్థం కనుక, వేదః అనే పదానికి తెలిపేది, అంటే, ప్రత్యక్షం, అనుమానం అనే ప్రమాణాల చేత తెలియడానికి సాధ్యం కానివానిని తెలుపుతున్నది —అని అర్థం. ప్రత్యక్షం అనుమానం అనే వీటి చేత తెలియడానికి సాధ్యం కాని వారిని తెలియజేసేది అనే తాత్పర్యం అందుచేత తనకంటే మిగిలిన ప్రమాణాలచే తెలియడానికి సాధ్యం కానిది ఇది తెలియజేస్తున్నది— అనేది సారంగా ఇక్కడ ఏర్పడిన తాత్పర్యం.

"విందంతి అనేన" అనే వ్యుత్పత్తి చేత ప్రత్యక్షం, అనుమానం అనే వీటిచే తెలియడానికి వీలు లేనివానిని దేని ద్వారా తెలిసికొంటున్నారో, అది వేదం అనే అర్థం

ఏర్పడుతున్నది. వ్యుత్పత్తి ఏది అయినప్పటికీ, అన్య ప్రమాణాలచే తెలియడానికి సాధ్యం కాని విషయాలను తెలియడానికి సాధనమై ఉండేది వేదం అనేదే ఇక్కడ తేలిన అర్థం. ఈ అర్థాన్ని "ప్రత్యక్షేణనుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే, యస్తం విందంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా" అని పెద్దలు తెలియజేశారు. ప్రత్యక్షం చేత. అనుమానం చేత తెలియలేని ఉపాయాన్ని తెలియజేసేది వేదం–– అనేది ఈ సూక్తికి అర్థం.

వేదం అపౌరుషేయం

ఆపౌరుషేయం అనే పదానికి ఏ పురుషుని చేత నిర్మింపబడినది అని అర్థం. శబ్దం అంటే ధ్వని. కంఠం, నాలుక, దంతాలు, దవుడలు మొదలైన ముఖంలో ఉండే భాగాల నుండి వెలువడే ధ్వనియే శబ్దం అని అనబడుతున్నది. ప్రతిశబ్దం పురుషునిచే ఉచ్చరింపబడేదై వెలువడుతున్నది. ఇటువంటి శబ్దాల కూటమే వేదం అనబడుతుంది. వేదం అనే శబ్దం కూడా పురుషునిచే నిర్మింపబడి వ్యక్తమవుతున్నందున, అది కూడా పౌరుషేయంగా కదా భావింపబడాలి. వాస్తవం ఈ విధంగా ఉండగా, వేదం ఎవరి చేతను నిర్మింపబడినది కాదు, అపౌరుషేయం అని అనడం ఏ విధంగా? అనే ప్రశ్న సహజంగా కలుగుతుంది.

దీనికి సమాధానం చెప్పడానికి ముందు పౌరుషేయం, అపౌరుషేయం అయిన రెండు దృష్టాంతాలను పురస్కరించుకొని గమనించి చూడాలి. కాళిదాసుచే రచింపబడిన. రఘువంశం అనే కావ్యాన్ని చూద్దాం. ఆ విధంగానే, యజుర్వేదంలో " ఇషేత్వో ర్జేత్వా" అనే మంత్రాన్ని చూద్దాం. ఈ రెండిటికి మధ్య ఏమి తేడా అనే విషయాన్ని గమనిద్దాం. రఘువంశ మహాకావ్యం లోని "వాగర్థావివ సంపృక్తౌ" అనే మొదటి శ్లోకంలో "వాక్, అర్థ ఇవ సంపృక్తౌ "అనే పదాలు వరుసగా చేర్చబడి ఉన్నాయి. ఆ పదాలు కాళిదాసుచే కొత్తగా నిర్మింపబడినవి కావు అనే విషయం మనకు బాగా తెలుసు. అయితే మరి కాళిదాసు ఏమి చేశాడు?అంటే, తాను ఉద్దేశించిన అర్థాలను వ్యక్తం చేయడం కోసం

కావలసిన రీతిలో పదాలను ముందు వెనుకలలో చేర్చి ప్రయోగించడమే కాళిదాసు చేసిన పని. దీనిని పురస్కరించుకునే మనం రఘువంశం అనే కావ్యాన్ని కాళిదాసు రచించాడు అని అంటున్నాము. ఆ విధంగా తెలుసుకుంటున్నాము. అయితే మరి, ఇదే విధంగా పైన ప్రస్తావించిన యజుర్వేద మంత్రంలో ఉండే"ఇషే త్వా ఊర్జే త్వా" అనే శబ్దాలను ఇప్పుడు కనిపించే వరుసక్రమంలో పెట్టినది ఎవరు? ఆ విధంగా వాటిని చేర్చి కూర్చిన వారు ఎవరైనా ఉన్నట్లయితే, వారే వేదాలను రచించారు –అని చెప్పవచ్చు. అయితే, అటువంటివారు ఎవరు లేరు–అనేది చెప్పవలసి ఉన్నది కదా. ఎందుకంటే, వేదాన్ని రచించినవారు ఎవరైనా ఉన్నట్లయితే, మహాభారతం, శ్రీరామాయణం మొదలైన గ్రంథాలను చేసిన వ్యాసవాల్మీకి మహర్షుల పేర్లను ఏ విధంగా చెప్పుకుంటున్నామో, ఆ విధంగానే, వేదాలను రచించినవారి నామాలను కూడా పరంపరగా చెప్పి ఉండాలి. కానీ, ఆ విధంగా ఎవరి పేరు వినడం లేదు, కనబడడం లేదు. చిన్న చిన్న గ్రంథాలను రచించినవారి పేర్లను కూడా మనం పరంపరగా చెప్పుకుంటూ తెలుసుకుంటున్నప్పుడు, చాలా పెద్దది, ముఖ్యమైనది అయిన వేదమనే గ్రంథాన్ని రచించినవారి పేరును మనం వినడం కూడా లేదు కదా. అందుచేత వాస్తవానికి వేదకర్త అనే వ్యక్తి ఎవరూ లేరు అని మనం దృఢంగా నిశ్చయించుకోవలసి ఉన్నది. ఇదే కాళిదాసు రచించిన గ్రంథానికి, వేదానికి మధ్య ఉండే తేడా.

కాళిదాసు "వాగర్థావివ సంపృక్తౌ" అని ప్రారంభమవుతున్న శ్లోకాలలో ఉండే పదాలను వరుసగా కూర్చి, అమర్చి మొట్టమొదటగా చెప్పాడు. తరువాత, దానిని అనుసరించి అదే వరుసక్రమంలో తరువాతివారు కూడా చెబుతూ వస్తున్నారు. అయితే, మొదట ఆ పదాలను వరుసక్రమంలో అమర్చినవాడు కాళిదాసు కనుక, అతడే రఘువంశానికి కర్త అని చెప్పబడుతున్నాడు. వేదాన్ని మనం అందరం అధ్యయనం చేస్తున్నప్పటికీ, కాళిదాసును రఘువంశం అనే కావ్యానికి కర్త అని చెబుతూ ఉన్నట్టుగా, వేదంలో ఉండే పదాల వరుసక్రమాన్ని అమర్చినవారు ఎవరూ లేరు అనే కారణంచేత వేదకర్త ఎవరూ లేరు అని చెప్పవలసి ఉన్నది.

ఒక్కొక్కసారి రఘు వంశాన్ని పఠించేటప్పుడు మనం ధ్వని వెలువరిస్తున్నాం. అయితే, మనం రఘువంశకర్తలుగా చెప్పడానికి వీలు ఉన్నదా? లేదు కదా. అదే విధంగా, వేదాన్ని పఠించేటప్పుడు మనం ధ్వనిని వ్యక్తం చేస్తున్నప్పటికీ, వేదంలో అంతర్భవించి ఉండే పదాల వరుసను క్రమంలో పెట్టినవారం మనం కాదు అనే కారణం చేత మనం వేదకర్తలం కాము. అందుచేత, వేదం అపౌరుషేయం అని అనడంలో ఏ విధమైన తప్పు లేదు.

వేదం నిత్యమైనది

స్వరూప నిత్యం అని, ప్రవాహ నిత్యం అని నిత్య వస్తువులు రెండు విధాలుగా ఉంటాయి. ఏ వస్తువులు మూడు కాలాలలోనూ ఒకే విధంగా ఉన్న వై, ఎల్లప్పుడూ నాశనం లేకుండా ఉన్నాయో, అవి స్వరూప నిత్యాలు అనబడతాయి. మూల ప్రకృతి, జీవాత్మలు, పరమాత్మ స్వరూప నిత్యాలు అనబడతాయి. ఈ విధంగా ఉండే మూడు విధాలైన వస్తువుల స్వరూపాలు ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉన్నవై, ఏనాడు నాశం లేకుండా ఉంటాయి భగవంతుడు ఏ అవతారాన్ని ఎత్తినప్పటికీ, అతని స్వరూపంలో, స్వభావంలో ఏ విధమైన మార్పు కలుగదు. జీవాత్మలు కర్మానుగుణంగా శరీరాలను లను పొందినా, వారికి స్వరూపంలో విధమైన మార్పు కలుగడం లేదు. స్వరూపాన్ని సంబంధించినది, స్వభావానికి సంబంధించింది అని మార్పు, అంటే, వికారం రెండు విధాలుగా ఉంటుంది. భగవంతునకు ఈ రెండు విధాలైన వికారాలు లేవు. జీవాత్మలకు స్వరూపంలో వికారం లేకపోయినా, కర్మ సంబంధం చేత స్వభావంలో, అంటే, ధర్మభూత జ్ఞానంలో వికారం కలుగుతుంది. మూల ప్రకృతి స్వరూపం ఎల్లప్పుడూ వికారాన్ని పొందేదిగానే ఉన్నప్పటికీ, అది ఎల్లప్పుడూ నశించని నిత్య వస్తువు అని శ్రుతి స్మృతులలో చెప్పబడినందున, అది కూడా స్వరూప నిత్యమే. అందుచేత ఈ మూడు విధాలైన వస్తువులు స్వరూప నిత్యాలు అనబడతాయి.

కుండ, వస్త్రం మొదలైన వస్తువులు ప్రవాహనిత్యాలు. ఇవి నశించని వస్తువులు కాదు అనేది వాస్తవమే అయినప్పటికీ, ఒక కుండ పగిలి పోయినప్పటికీ దాని వంటి ఇంకొక కుండ లోకంలో ఉండనే ఉంటుంది. ఏ సమయంలోనూ లేదు అనే స్థితి ఘటజాతికి లేదు వస్త్రం విషయం కూడా ఆ విధంగానే ఉంటుంది. లోకం ఉన్నంతవరకు ఏ జాతికి సంబంధించిన వస్తువులలో ఒకటి నశించినా, ఇంకొకటి ఉంటుందో, ఆ జాతి వస్తువులు ప్రవాహానిత్యాలు అనబడతాయి. వేదం కూడా ఈ ప్రవాహ నిత్య వర్గంలో చేరినది. ఆయా కోటి కోటి బ్రహ్మాండాలలో ఏదో ఒక బ్రహ్మాండంలో ఏదో ఒక మూల అయినా, ఒకడు వేదాన్ని అధ్యయనం చేస్తూనే ఉంటాడు. వేదధ్వని లేకుండా ఉండే కాలం అనేది లేదు. అందరూ ఒకే క్రమంలోనే వేగాన్ని ఉచ్చరిస్తున్నారు. అందుచేత వేదం ప్రవాహ నిత్యం అని అనబడుతున్నది.

## వేదం ఏ దోషం లేనిది

వేదం అనేది శబ్దరూపమైనది అనే విషయాన్ని ఇంతకుముందే తెలిసి కొన్నాము. శబ్దానికి దోషం అంటే ఏమి? తప్పు అయిన అర్థాన్ని తెలియజేయడమే శబ్దానికి దోషం. ఏ శబ్దం కూడా సహజంగా తప్పయిన అర్థాన్ని తెలియజేయదు. పలు పదాలు చేర్చి ప్రయోగించిన వాక్యం తప్పైనా అర్థాన్ని తెలియజేయవచ్చు. ఉదాహరణకు, "ఇది, వెండి" అనే రెండు పదాలు వేరువేరుగా ఏ విధమైన తప్పయిన అర్థాన్ని తెలియజేయవు. అయితే, ఈ రెండు పదాలను ఒకటిగా చేర్చి, ఇనుమును ఉద్దేశించి, " ఇది వెండి" అని చెప్పినట్లయితే, వెండి కాని దానిని వెండి అని చెప్పడం చేత ఈ వాక్యం దోషాన్ని కలిగినది అని చెప్పబడుతున్నది. ఈ వాక్యం ఈ విధంగా తప్పైనా అర్థాన్ని బోధించడానికి ఏమి కారణం? రెండు పదాలు ఉండే ఈ వాక్యంలో ఉండే దోషం ఏమి? ప్రత్యేకంగా ప్రత్యేకంగా ప్రయోగింపబడినప్పుడు ఏ విధంగా అవి ఉన్నాయో ఆ విధంగానే కదా ప్రయోగింపబడినపుడు ఉన్నాయి. శబ్దంలో ఏ విధమైన దోషం కనిపించడం లేదు. ఆ విధంగా అయినప్పుడు, ఈ వాక్యం తప్పయిన అర్థాన్ని ఎందుకు బోధిస్తున్నది?అంటే, దీనిని ప్రయోగించిన వ్యక్తి ఈ పదాలను సరిగా

ఉపయోగించకుండా, తగని క్రమంలో ఉపయోగించడమే ఈ పదాలు తప్పైన అర్థాన్ని తెలియజేయడానికి కారణం అయినది.

భ్రమ, ప్రమాదం, విపర్యాసం అని ఈ విధంగా కొన్ని దోషాలు మానవులకు ఉంటాయి. భ్రమ అనేది రెండు విధాలు. ఒక వస్తువును ఇంకొక వస్తువుగా తెలుసుకోవడం ఒక విధమైన భ్రమ. ఒక వస్తువును తెలిసికొనేటప్పుడు, దాని స్వభావమైన గుణాలను మార్చుగా, వేరు విధమైన గుణాలతో కూడినదిగా తెలుసుకోవడం ఇంకొకటి. వీటిలో మొదటి దానికి విపరీత జ్ఞానమని, రెండవ దానికి అన్యథా జ్ఞానమని పేరు. ముత్యపు చిప్పను చూచి "ఇది వెండి" అని భ్రమించడం విపరీత జ్ఞానం అవుతుంది. శంఖం పచ్చనివి అని భ్రమించడం అన్యథా జ్ఞానం అవుతుంది. ఈ రెండు విధాలయిన భ్రమలు మానవులకు ఉండే దోషాలు. మానవుడు ఒక వస్తువును యథాతథంగా తెలిసిపోకుండా పోవడమే భ్రమించడం. ఇక, ప్రమాదం, అంటే, పొరపాటు పడడం. విప్రలిప్స, అంటే, ఇతరులను మోసం చేయాలి అనే అభిప్రాయం. మానవులలో ఉండే ఇటువంటి దోషాలు అతడు ప్రయోగించే శబ్దాలను దోషాలు కలిగినవిగా చేస్తున్నాయి. ఒకడు దారాన్ని చూసి దానిని పాము అని భమిస్తున్నాడు. అతడు అంత దూరంలో ఉంది "ఇదిగో పాము" అని దారాన్ని చూపిస్తున్నాడు. ఇక్కడ ఇతనిచే ప్రయోగింపబడిన పదాలచేత ఇతరులకు కలిగే జ్ఞానం యథార్థజ్ఞానం కాకుండా, ఆ శబ్దం దోషాలు కలిగినవిగా గ్రహింపబడి, అప్రమాణమని భావింపబడుతున్నది. ఇక్కడ ఆ ప్రయోగించిన వ్యక్తి భ్రమయే అతడు ప్రయోగించిన శబ్దాలు అప్రమాణాలు కావడానికి కారణమవుతున్నది.

ఒకడు దారాన్ని చూసి దారమని తెలిసికొన్నా, తొందరగచేత, మాట తప్పి పాము అని పొరబాటుగా చెబుతున్నాడు. అతడు ఆ విధంగా చెప్పే పదాలు తప్పైనా అర్థాన్ని చెబుతున్నాయి. దానికి కారణం ఆ వ్యక్తి ప్రమాదమే. ఒకడు దారాన్ని దారం అని తెలుసుకుంటున్నాడు. అయినప్పటికీ, పరిహాసం కోసమో, లేక, చెడ్డ బుద్ధితోనో ఇంకొకనిని భయపెట్టాలని అనుకొని, " ఇదిగో పాము" అని అంటున్నాడు. ఇక్కడ కూడా

శబ్దం అనేది తప్పయిన అర్థాన్ని తెలియజేస్తున్నది. ఆ మానవుని భ్రమ, విపర్యాసం, ప్రమాదం అనే దోషాలే ఆ శబ్దాలు అప్రమాణాలు రావడానికి కారణం తప్ప, వాస్తవంలో శబ్దంలో సహజంగా ఏ దోషం లేదు– అని ఏర్పడుతున్నది ఈ విధంగా వ్యక్తుల దోషాలచేత అప్రమాణాలు అవుతున్న శబ్దాలు ఏవి? అంటే, ఆ పురుషుడు ఒక అర్థాన్ని తెలపడం కోసం పలు పదాలను తాను కోరిన రీతిలో చేర్చి వాక్యంగా ప్రయోగించే శబ్దాలే అవుతున్నాయి. వేదం అనే శబ్దరాశి ఏ మానవుని చేత తన ఇష్టప్రకారం పూర్వం లేని, ముందు వెనుకలుగా ఉండే క్రమంలో కూర్పబడినది కాదు, కనుక, అది నిత్యమని ఇంతకుముందే చెప్పబడినందున, పురుషుల దోషాల చేత దుష్టం అయ్యే స్థితి వేదాలకు లేదు అని వ్యక్తమవుతున్నది. అందుచేత వేదాలు నిర్దోషాలు అని అనడంలో ఏ దోషం లేదు.

**ఈశ్వరుడు వేదకర్త కాదా?**

సృష్టి ఆరంభంలో భగవంతుడు చతుర్ముఖునకు వేదాన్ని ఉపదేశం చేసినట్లు చెప్పబడుతున్నది కదా. సృష్టికి ముందు వేదం ఉండే అవకాశం లేదు కదా. అందుచేత ఈశ్వరుడే వేదాన్ని మొదట సృష్టి ఆరంభంలో నిర్మించి ఉండాలి అని ఏర్పడుతున్నది. ఈ విధంగా అయినప్పుడు, వేదం అపౌరుషేయం అనేది ఏ విధంగా కుదురుతుంది? అనే ప్రశ్న ఏర్పడవచ్చు. వాస్తవం ఏమి? అంటే, వేదానికి మనం ఏ విధంగా కర్త కాదో, ఆ విధంగానే భగవంతుడు కూడా కర్త కాదు. లోకంలో సృష్టి అనేది ఒక దానికి తరువాత ఇంకొకటి అనాదికాలంగా జరుగుతూ వస్తున్నది. ఒక్కొక్క కల్పంలోనూ ఆరంభంలో ఉండే ఈశ్వరుడు చతుర్ముకునకు వేదాన్ని ఉపదేశిస్తున్నాడు, అయితే, ముందు కల్పంలో వేదం ఏ విధంగా, ఎటువంటి క్రమాన్ని కలిగినదై ఉన్నదో, అదేవిధంగా, అటువంటి క్రమంలోనే అనంతర కల్పం ప్రారంభంలో వేదాన్ని ఉపదేశిస్తున్నాడు. ఏ విధమైన మార్పు అతడు చేయడం లేదు. అనాదికాలంగా ఈ విధంగానే భగవంతుడు చేస్తూ వస్తున్నాడు. అంత మాత్రమే, అంటే, ముందు ఉండే క్రమంలోనే వేదాలను

ఉపదేశించడం తప్ప వేదాలను ఈశ్వరుడు మళ్లీ కొత్తగా నిర్మించడం లేదు. ఏ విధమైన మార్పు చేయడం లేదు. అందుచేత ఈశ్వరుడు కూడా వేదాలకు కర్త కాడు.

వేదం అవిచ్ఛిన్న పరంపరాగతం

స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, ఇంకా పలు విధాలైన శాస్త్ర గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. అయితే, వేదం ఏ విధంగా అనాదికాలంగా శిష్యప్రశిష్య పరంపరాక్రమంలో అధ్యయనం చేయబడి వస్తున్నదో, ఆ విధంగా మిగిలిన శాస్త్రాలు అధ్యయనం చేయబడడం లేదు. బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు అనే ఈ మూడు వర్ణావారు తప్పకుండా వేదాన్ని అధ్యయనం చేయాలి అని, అది కూడా ఆచార్యుని ద్వారానే చేయాలి అని నియమాలు ఏర్పడినవి. వీటిని అతిక్రమిస్తే ప్రాయశ్చితాలు కూడా చేయాలని విధింపబడినవి. కనుక అనాదికాలం నుండి ఒకే విధంగా వేదం అధ్యయనం చేయబడడంతోపాటు, ఏ విధమైన సందేహాలకు తావు లేకుండా ఉన్నది.

ఈ విధంగా వేదం అపౌరుషేయమై, నిత్యమై, నిర్దోషమై, అవిచ్ఛిన్న పరంపరాగతమై ఉన్నందున, ఇది ఆర్యులైన మనకు పరమ ప్రమాణం అవుతున్నది.

# వేదం పవిత్రమైనది

హరిః ఓమ్.
యావతీ ర్వై దేవతాః తా స్సర్వా వేదవిది బ్రాహ్మణే వసంతి.
తస్మాత్ బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్య దివే దివే నమస్కుర్యాత్.
హరిః ఓమ్
వేదం పవిత్రమైనది అనే విషయాన్ని గురించి ఒక వైదికమైన వృత్తాంతం ఈ వ్యాసంలో విన్నవింపబడుతున్నది.

వేదం చాలా పవిత్రమైనదిపుణ్యమైనది. తాను పవిత్రం కావడమే కాదు, తనతో సంబంధం కలిగినవారిని అందరిని పవిత్రులను చేయగలిగిన శక్తిని కలిగినది. మన దోషాలను అన్నిటినీ పోగొట్టగలిగినది అనేది ఒక విషయం. మనం వేదమంత్రాలను అధ్యయనం చేసి, అనుసంధించినట్లయితే, మనకు ఉండే ఎన్నో దోషాలు తొలగిపోతాయి దీనిని గురించి ఒక కథ ఉన్నది.

"అగ్నిం వై జాతం పాపం జగ్రాహ" అనేది ఒక వేదవాక్యం. అగ్నిదేవతను సృష్టించినప్పుడు ఆ అగ్నిదేవతకు పుట్టిన సమయాలోనే దోషం కలిగింది. పాపం ఏర్పడింది ఈ విధంగా అంటే, అగ్నిలో మనం ఎన్నో దోషాలను చేరుస్తున్నాము. అపరిశుద్ధాలైన వస్తువులను వేస్తున్నాము. ఏ ఏ పదార్థాలను మనం అపవిత్రాలని భావిస్తున్నామో, అపవిత్రాలు అని తలుస్తున్నామో, వాటిని అన్నిటిని అగ్నిలో వేస్తున్నాము. ఈ విధంగా పలు అపవిత్రాలేన వస్తువులతో సంబంధాన్ని పొంది అగ్నికి తనను ఒక పవిత్రమైన దేవతగా భావించడం అర్థం కాదని తోచింది. తనలో దోషం ఏర్పడింది అని అతనికి మనసులో ఒక భావన కలిగింది.

అగ్నికి ఏర్పడిన ఈ దోషాన్ని తీర్చాలని ఇంద్రాది దేవతలు భావించారు. ఎందుకంటే దేవతలకు అధ్యయము అగ్ని చాలా ముఖ్యమైనవాడు. వారికి ముఖంలాంటివాడు. "అగ్ని ముఖా వై దేవతాః "అని వేదం తెలుపుతున్నది. మనం ఏ హోమం చేసినా, ఆ ఆ హోమంలో ఏ దేవతను ఉద్దేశించి హవిస్సును సమర్పించినా, దానిని అగ్నిలోనే కదా సమర్పిస్తాము. "ఇంద్రాయ స్వాహా "అని హవిస్సును సమర్పిస్తే, దానిని నేరుగా ఇంద్రునకు సమర్పించలేము కదా, దానిని అగ్నిలో కదా సమర్పించాలి ఆ విధంగా తనలో సమర్పింపబడిన ఆ ద్రవ్యాన్ని అగ్ని తీసుకుని పోయి, ఆయా దేవతలకు అందజేస్తాడు. "ఓం విష్ణవే స్వాహా" అని అగ్ని లో సమర్పించిన ద్రవ్యాన్ని అగ్ని దానిని తీసుకొని పోయి, విష్ణువునకు అందజేస్తాడు. ఈ విధంగా అగ్నితో దేవతలందరికి సంబంధం ఉన్నందున, అగ్నికి అపవిత్రత కలిగితే, దేవతలకు కూడా అపవిత్రత కలుగుతుంది. అందువల్ల అగ్నికి కలిగిన అపవిత్రతను పోగొట్టి, అతనిని పవిత్రుని చేయాలని దేవతలంతా సంకల్పించారు. అందుకోసం వారు ఆహుతిని ఏర్పాటు చేశారు. ఆహుతి అంటే —హోమం. కనిపించిన అపవిత్రమైన వస్తువులన్నీ అగ్నిలో వేయడం వల్ల అతనికి అపవిత్రత కలిగింది ఆ అపవిత్రతను తీర్చడానికి హోమం చేయాలని వారు తలచారి ఆ విధంగా ఆహుతి వల్ల అగ్ని పరిశుద్ధమైనది. కానీ, అగ్నిలో అంతకు ముందు ఉన్న దోషం, అంటే, పాపం ఆహుతికి అంటుకున్నది.

అప్పుడు దేవతలు ఆహుతికి కలిగిన దోషాన్ని పోగొట్టాలని భావించారు. అందుకోసం యజ్ఞాన్ని ఏర్పాటు చేశారు. ఆహుతులను ఇష్టం వచ్చినట్లుగా అగ్నిలో చేయడానికి వీలులేదు. యజ్ఞం చేసి, అందులో అంగంగా ఆహుతులను అగ్నిలో సమర్పించాలి. ఈ విధంగా హోమం అనబడే ఆహుతిలో ఉండే దోషాన్ని పోగొట్టడం కోసం దేవతలు యజ్ఞాన్ని నిర్వహించారు. దానివల్ల ఆహుతిలో ఉండే దోషం పోయింది, కానీ, ఆదోషం యజ్ఞానికి అంటుకున్నది.

ఇప్పుడు దేవతలకు యజ్ఞానికి ఏర్పడిన దోషం పోగొట్టవలసిన అక్కర ఏర్పడింది. అందుకోసం వారు దక్షిణను ఏర్పాటు చేశారు. ఈ దక్షిణ వల్ల యజ్ఞానికి కలిగిన దోషం పోతుందని వారు భావించారు. యాగంలో చివర యథోచితంగా దక్షిణను సమర్పిస్తారు. దానివల్ల యాగంలో ఏర్పడిన దోషాలు అన్ని తీరిపోతాయి. దక్షిణను సమర్పించడం వల్ల యాగంలో ఉండే దోషాలు తీరిపోతాయి– అని వేదంలో పలుసార్లు తెలుపబడింది.

ఈ విధంగా దక్షిణను సమర్పించడం వల్ల యజ్ఞంలో ఉండే దోషాలు తీరిపోయాయి కానీ, ఆదోషాలు దక్షిణకు అంటుకున్నాయి. దక్షిణకు ఏర్పడిన ఆ దోషాలు వాటిని స్వీకరించిన బ్రాహ్మణులకు చేరిపోయాయి. "అహుతీనాం యజ్ఞేన యజ్ఞస్య దక్షిణాభిః దక్షిణానాం బ్రాహ్మణేన" అనే విధంగా ఆ దక్షిణకు కలిగిన దోషాలు ఆ దక్షిణను స్వీకరించిన బ్రాహ్మణులకు అంటుకున్నాయి.

బ్రాహ్మణులకు ఏర్పడిన ఈ దోషాలు ఏ విధంగా పోతాయి? అని దేవతలు ఆలోచించారు. గాయత్రి, త్రిష్టుప్, అనుష్టుప్ మొదలైన ఛందస్సులు బ్రాహ్మణుల దగ్గర ఉన్నాయి. ఇవి వేదమంత్రాలలోని ప్రకారాలు. ఇవి బ్రాహ్మణుల దగ్గర ఉన్నాయి. బ్రాహ్మణులకు కలిగిన పాపాన్ని చందస్సుల ద్వారా పోగొట్టుకోవాలని దేవతలు ఏర్పాటు చేశారు. ఈ విధంగా బ్రాహ్మణులకు కలిగిన పాపం ఛందస్సుల వల్ల పోయింది. కానీ, ఆ పాపం ఛందస్సులకు కలిగింది.

ఇప్పుడు చందస్సులకు కలిగిన పాపం ఏ విధంగా పోవాలి ?అని ఆలోచించి, ఆ పాపం స్వాధ్యాయం వల్ల, అంటే, వేదాధ్యయనం వల్ల పోవాలనే క్రమాన్ని ఏర్పరచారు. ఈ విధంగా ఛందస్సులకు ఏర్పడిన పాపం స్వాధ్యాయం వల్ల తీరిపోయినప్పటికీ ఆ పాపం వేదానికి కలిగింది.

ఈ విధంగా మొదట అగ్నికి కలిగిన పాపం పోగొట్టాలని ప్రారంభించిన ప్రయత్నపరంపరలో ఆ పాపం చివరకు వేదానికి ఏర్పడింది. ఈ విధంగా పాపం నిరంతరంగా ఏర్పడుతుందా?అనే సందేహం కలుగవచ్చు. దీనికి ఒక లౌకికదృష్టాంతాన్ని చూద్దాం. పొయ్యి మీద ఒక పాత్రను పెట్టి వంట చేశాము అనుకోండి. ఆ పాత్రకు మసి పడుతుంది. ఆ పాత్రను చేతితో తోమితే, పాత్రకు ఉన్న మసి పోతుంది కానీ, చేతికి ఆ మలినం అంటుకుంటుంది. చేతిని ఒక తెల్లటి గుడ్డతో తుడుచుకుంటే, చేతికి ఉండే మలినం పోతుంది కానీ, అది గుడ్డకు అంటుకుంటుంది, నా గుడ్డను నీటిలో తడిపి ఉతికితే, గుడ్డకు ఉండే మలినం పోతుంది కానీ నీటికి ఆ మసి అంటుకుంటుంది. ఈ విధంగానే, ఇక్కడ అగ్నికి ఉండే పాపం ఆహుతికి, ఆహుతికి ఉండే పాపం యజ్ఞానికి, యజ్ఞానికి ఉండే పాపం దక్షిణకు, దక్షిణకు ఉండే పాపం ఛందస్సుకు, ఛందస్సుకు ఉండే పాపం స్వాధ్యాయమనవడే వేదానికి చేరింది. అయితే, ఈ పాపం వేదానికి అంటుకుంటుందా ? ఆ పాపాన్ని పోగొట్టవలసిన అవసరం ఉన్నదా ?అని అంటే, దానికి అవశ్యకత లేనేలేదు. ఎందుకంటే, వేదం చాలా పవిత్రమైనది కదా. తాను పవిత్రంగా ఉండడమే కాక, తనతో సంబంధం కలిగినవాని దోషాలను కూడా పోగొట్టగలిగినది. " అసహతపాప్మా స్వాధ్యాయః, దేవపవిత్రం వా ఏతత్". అని స్వాధ్యాయం కీర్తింపబడుతున్నది. దేవపవిత్రం అంటే– దేవతలను కూడా శుద్ధి చేయగలిగినది. అపహతపాప్మా అంటే– పాపం ఏ మాత్రం అంటదు –అని అర్థం. అపహత పాప్మా –అని భగవంతుడు కీర్తింపబడుతున్నాడు. అతడు ఏ కర్మ చేసినప్పటికీ, అతనికి దానివల్ల ఏ విధమైన కర్మ సంబంధం కలుగదు కనుక అతడు ఆ విధంగా చెప్పబడుతున్నాడు. వేదం కూడా అటువంటిదే. దానికి ఏ విధంగాను ఎటువంటి పాపం అంటదు. వేదంతో సంబంధం కలిగినందువల్లనే యగానికి ఏ విధమైన దోషం కలుగలేదు. వేదమంత్రాలు ఉన్నందువల్లనే హోమానికి ఏ విధమైన దోషం కలుగలేదు. వేదమంతాలతో సంబంధం కలిగి ఉన్నందువల్లనే దక్షిణకు ఏ విధమైన దోషం లేదు. వేదమంత్రాలతో సంబంధం కలిగి ఉన్నందుననే దక్షిణను స్వీకరించే బ్రాహ్మణులకు కూడా ఏవిధమైన దోషం కలుగదు. పలు సందర్భాలలో మనం దక్షిణను స్వీకరించినందువలన మనకు దోషాలు కలుగవచ్చు.

వేరే కారణాల వల్ల కూడా పాపం ఏర్పడవచ్చు. కానీ, ఈ దోషాలు, పాపాలు అన్ని పోగొట్టుకోవడానికి ఒకే దారి ఉన్నది. మనం వేదాన్ని సంపాదించుకోవాలి. వేదాన్ని అధ్యయనం చేసి, దానిని అనుసంధించినట్లయితే మనకు కల పాపాలు అన్ని తీరిపోతాయి. మనం ఎంతగా వేదమంత్రాలను భక్తి పూర్వకంగా అనుసంధిస్తామో, అంతగా మన పాపాలు తీరిపోతున్నాయి. వేదం ఆ విధంగా మనలను పవిత్రులను చేస్తుంది అందువల్ల మనం వేదాన్ని తప్పకుండా పూర్తిగా అధ్యయనం చేయాలి. ఒకవేళ పూర్తిగా అధ్యయనం చేయలేక పోయినా, దానిలో ముఖ్యంగా ఉండే కొన్ని భాగాలనైనా అధ్యయనం చేయాలి. అది కూడా సాధ్యం కాకపోయినా, పంచసూక్తాలు, ఉపనిషత్తులు వంటి మూలభాగాలను అయినా నేర్చి, అనుసంధించాలి. దాని వల్ల మనకు తప్పక శుద్ధి కలుగుతుంది. వేద సంబంధం వల్లనే కదా, అగ్ని మొదలైనవారికి కలిగిన పాపం అంతా తీరిపోయింది. ఈ విషయం స్వాధ్యాయ బ్రాహ్మణంలో తెలుపబడింది.

హరిః ఓమ్, బ్రహ్మ ప్రావాదిష్మ, తన్నో మాహాసీత్. హరిః ఓమ్.

మేము వేదాన్ని అధ్యయనం చేస్తున్నాము, ఆ వేదం మమ్మలను రక్షించుగాక.

# వేదతాత్పర్యనిర్ణయమ్

మన దేశంలో అనాది కాలంగా ప్రచారంలో ఉండే మతానికి వైదిక మతం అని పేరు. వేదాలను మూల ప్రమాణంగా కలిగిన మతం –అని దీనికి అర్థం. చాలా ప్రాచీనమైన ద్రావిడ లక్ష్య సాహిత్యమైన, సంఘ కాలానికి సంబంధించిన గ్రంథాలలో వేద వైభవం చాలా గొప్పగా కీర్తింపబడింది. సంఘ కాలానికి సంబంధించిన పండితులు అందరూ శ్రియఃపతినే వేదవేద్యునిగా, అందరి కంటే పరుడైన దైవంగా కీర్తించారు– అనేది ఆ గ్రంథాల వల్ల స్పష్టం అవుతున్నది.

సంస్కృత భాషలో వేదానికి వేదం అని, ఛందస్ అని, ఆమ్నాయం అని, శ్రుతి అని నాలుగు పేర్లు ఉన్నాయి. ఈ నాలుగు పేర్లలో వేదం అనే పేరే సంఘసాహిత్యంలో యథాతథంగా ప్రయోగింపబడింది. ఈ నాలుగు పేర్లు క్రమంగా పులమ్, మఱై, వాయ్ మొழி, కేళ్వి అనే అందమైన ద్రావిడ పదాలతో వ్యవహరింపబడతాయి. ఈ పేర్లలో ఒక్కొక్క పేరుతోనూ వేదాన్ని నిర్దేశించి, అందులో సర్వకారణభూతుడుగా ఘోషింపబడేవాడు లక్ష్మీనాథుడే– అని ఆ సాహిత్యంలో పలుచోట్ల చూపబడింది.

"వేదయతీతి వేదః "అనే వ్యుత్పత్తి చేత "ఇతరులకు జ్ఞానాన్ని ఇచ్చేది "అనే అర్థం కలిగినదిగా వేద శబ్దం అవుతున్నది. "ఛాదయతీతి ఛందః "అనే వ్యుత్పత్తిని బట్టి, ఇతరులకు తెలియని రీతిలో జ్ఞానాన్ని దాచి ఉంచడం వల్ల వేదం ఛందస్ అనబడుతున్నది. పై పైన చూసినప్పుడు ఈ రెండు పేర్లకు మధ్య అర్థవిరోధం ఉన్నట్లు తోచినప్పటికీ, వాస్తవంలో విరోధం లేదు అనేది మనం తెలియవచ్చు. ఏ విధంగా అంటే, పుణ్యం చేసిన మంచివారికి వేదం తన యథార్థ స్వరూపాన్ని తెలుపడంద్వారా జ్ఞానాన్ని కలిగిస్తున్నది. పాపం చేసిన దుర్మార్గులకు తన యథార్థమైన అర్థాన్ని తెలియనీయకుండా దాచి పెట్టడం చేత, వేదం ఛందస్సు అని సంస్కృతంలో, మఱై అని ద్రావిడ భాషలో వ్యవహరింపబడుతున్నది. ఒక నాణానికి రెండు వైపులా ఉన్నట్లు,

వేదానికి ఈ రెండు స్వభావాలు ఉన్నాయి. ఈ కారణం చేతనే వేదానికి తాత్పర్య నిర్ణయం చేయడంలో శ్రమ కూడా ఉన్నది.

వేదం రాయబడి ప్రచారం చేయబడడం కాకుండా, ఆచార్యునిచే అనాధికాలంగా మౌఖిక పరంపరగానే అధ్యయనం చేయబడి, అ ప్రచారం చేయబడుతున్నందున ఆమ్నాయం అని సంస్కృతంలో, వాయ్ మొழி అని ద్రావిడ భాషలో అనబడుతున్నది. "ఆచార్యుడు నోటితో ఉచ్చరించడం చేత వ్యాపిస్తున్నది" అనే అర్థంలో "ఆమ్నాయతే ఇతి ఆమ్నాయః" అనే వ్యుత్పత్తి ద్వారా ఇది తెలియబడుతున్నది. వేదం శ్రుతి అని సంస్కృతంలో, కేళ్వి అని ద్రావిడ భాషలో వ్యవహరింపబడుతున్నది. " శ్రూయతే ఇతి శ్రుతిః" – (శిష్యునిచేత వినబడుతున్నది కనుక, శ్రుతి అనబడుతున్నది) అనే వ్యుత్పత్తి ద్వారా శిష్యుని కర్ణపరంపరవలన వేదం వ్యాపిస్తున్నది– అని తెలుస్తున్నది.

పూర్వకాలంలో సాంఖ్యులు మొదలైన తత్వవేత్తలు పలువురు ఉండేవారు. వీరు పురుషుడు అనబడే జీవునితో కూడిన మూల ప్రకృతియే జగత్కారణం అని, పరబ్రహ్మం అనే తత్వం ఏదీ లేదు –అని వాదించారు. కర్మలను గూర్చి చెప్పే కర్మకాండం అనబడే వేదంలోని పూర్వ భాగానికి అర్థాన్ని చెప్పడంలో కూడా అభిప్రాయ భేదం ఉండేది.

జైమిని మహర్షి కర్మకాండ వాక్యాలకు తాత్పర్య నిర్ణయం చేసే విధానాన్ని తాము రచించిన పూర్వ మీమాంసా శాస్త్రంలో వివరించారు. శ్రీ వేదవ్యాసులు అని ప్రసిద్ధి చెందిన బాదరాయణులు బ్రహ్మసూత్ర ప్రబంధాన్ని రచించి, అందులో సాంఖ్యులు మొదలైనవారి సిద్ధాంతాలను ఖండించి, బ్రహ్మమే జగత్కారణం అనే పరమ వైదిక సిద్ధాంతాన్ని స్థాపించారు. అయినా, పలు వేదాంత వాక్యాలకు అర్థాన్ని చెప్పడంలో అభిప్రాయ భేదం ఈనాటికీ కొనసాగుతూనే ఉన్నది

ఆది శంకరులు, వారి శిష్యపరంపరకు చెందినవారు పలు ఉపనిషత్ వాక్యాలకు ఒక విధంగా అర్థాన్ని చెప్పి, అద్వైత సిద్ధాంతం ప్రచారం చేశారు. శ్రీ మధ్వులు మొదలైన కొందరు వైష్ణవాచార్యులు అనేక వేద వాక్యాలకు యుక్తులు, మీమాంసా న్యాయాలు మొదలైన వానినితో వేరు విధంగా అర్థాన్ని చెప్పారు. వేద తాత్పర్య నిర్ణయంలో అనాది అయినది, పరమ వైదికమైనది అయిన విశిష్టాద్వైత సిద్ధాంతమే చక్కని దర్శనాలకు, వేదాంత విచార మార్గాలకు, విజ్ఞానధారలకు చాలా పొసగినదై భాసిస్తున్నది.

ఉపనిషత్ వాక్యాలు భేద శ్రుతులు అని, అభేద శ్రుతులు అని రెండు విధాలైన రీతులలో ఉంటాయి అనేది ప్రసిద్ధం. జగత్తు, బ్రహ్మం అనే రెండు భిన్నమైనవి అని తెలిపేవి భేదశ్రుతులు. అవి రెండు ఒకటే అని తెలిపేవి అభేద శ్రుతులు. అభేదశ్రుతులు భేదశ్రుతులను నిరసిస్తున్నందున జీవబ్రహ్మల ఐక్యమే యథార్థం అని అద్వైతులు అంటారు. " సర్వం ఖల్విదం బ్రహ్మ " –(ఇది అంతా బ్రహ్మమే) మొదలైన అభేదశ్రుతులు చేతనాలు, అచేతనాలు అని రెండు విధాలుగా ఉండే వస్తువులను బ్రహ్మంతో ఐక్యం చేసి తెలియజేస్తున్నాయి– అని వారు వాదిస్తున్నారు. చేతనులు మాత్రం బ్రహ్మతో ఒకటిగా అవుతున్నాయి అని, అచేతన వస్తువులు– దారం పాముగా తోచినట్లు, ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు తోచినట్లు, అసత్యాలే– అని వీరు అంటున్నారు. ఈ విధంగా "సర్వమ్"అనే పదాన్ని అర్థం ద్వారా చేతనం, అచేతనం –అని రెండుగా విభజించి, రెండిటికీ అర్థ నిర్ణయం చేయడంలో రెండు వేరు వేరు క్రమాలను వీరు నిర్వహిస్తున్నారు.

విశిష్టాద్వైతులైన మన ఆచార్యులు ఘటక శ్రుతులు చూపే శరీర శరీరి భావాన్ని గాని, లేక, స్వతంత్ర పరతంత్ర భావాన్ని గాని పురస్కరించుకొని భేదశ్రుతులకు, అభేదశ్రుతులకు మధ్య పై పైన తోచే అర్థవిరోధాన్ని తీర్చవచ్చు– అని చూపడం ద్వారా ఒకే దారిని నిర్వహిస్తున్నారు. అద్వైతుల క్రమం కంటే, మన ఆచార్యులు చూపే ఈ మార్గం తర్కరీతిలో చూస్తే చాలా యుక్తమైనది అని స్పష్టమవుతుంది.

ఇంకా చాలా ఉదాహరణలను చూడవచ్చు. సగుణ వాక్యాలు అనబడే వేదవాక్యాలు పరతత్వం కళ్యాణ గుణాలను కలిగినది అని తెలియజేస్తున్నవి. నిర్గుణ వాక్యాలు అనబడే వేద వాక్యాలు పరతత్వం గుణాలు లేనిది అని తెలియజేస్తున్నాయి. నిర్గుణ వాక్యాలతో నిరసింపబడడం చేత సగుణ వాక్యాలు అర్థం లేనివి— అని అద్వైతులు పలుకుతున్నారు. మన ఆచార్యులు అయితే, పూర్వ మీమాంసాన్యాయాలను పురస్కరించుకుని సగుణ నిర్గుణ వాక్యాల మధ్య విరోధాన్ని తీరుస్తున్నారు.

పూర్వమీమాంసాశాస్త్రంలో ఉత్సర్గాపవాద న్యాయం అనే ఒక న్యాయం ఉన్నది. ఏ విధికి అయినా కొన్ని అపవాదాలు ఉంటాయి అనే విషయం మనకు తెలుసు. ఇది ఉత్సర్గాపవాద న్యాయం. "న హింస్యాత్ సర్వాభూతాని"— ఏ ప్రాణి హింసించకూడదు —అని ఒక విధి వాక్యం. " అగ్నిషోమీయం పశుమాలభేత" అనే ఒక వేదవాక్యం యాగంలో ఒక ప్రాణిని వధించాలి— అని తెలుపుతున్నది. పూర్వ మీమాంసకులు మొదటి వాక్యంలో కనిపించే విధికి రెండవ వాక్యం అపవాదాన్ని తెలుపుతున్నది —అని నిర్ణయం చేశారు. ఇదే ఉత్సర్గాపవాదన్యాయం అనబడుతుంది.

ఈ మీమాంసా న్యాయంతో మన పూర్వాచార్యులు నిర్గుణ వాక్యాలచేత తెలుపబడే గుణరాహిత్యం అనే సామాన్య విధికి సగుణ వాక్యాల చేత విధింపబడే గుణ సాహిత్యం అపవాదం తెలుపుతున్నది— అని నిర్ణయించి తెలియజేశారు. ఇంతే కాక, వేద శాస్త్రాలలో గుణం అనే పదం మూలప్రకృతి గుణాలైన సత్వం, రజస్సు, తమస్సులనే గుణాలను పలుచోట్ల తెలియజేయడాన్ని మనం గమనిస్తాము. అందుచేత నిర్గుణ వాక్యాలు ప్రకృతి గుణాలైన సత్వం, రజస్సు, తమస్సు అనేవి పరమాత్మలో లేవు —అనే విషయాన్ని తెలియజేస్తున్నాయి— అని, సగుణ వాక్యాలు అప్రాకృతమైన కళ్యాణ గుణాలు ఆ పరమాత్మలో ఉన్నాయి అనే విషయాన్ని తెలియజేస్తున్నాయి— అని

భావించి, ఈ రెండు విధాలైన శ్రుతివాక్యాలకు మధ్య పై పైన తోచే అర్థవిరోధాన్ని పరిహరించవచ్చు అనే సంగతిని చూపించారు.

ఛాగ పశున్యాయం, లేక, సామాన్య విశేష న్యాయం అని వ్యవహరింపబడే ఇంకొక పూర్వ మీమాంసా న్యాయం ఉన్నది. ఒక వేదవాక్యం యాగంలో పశువును ఉపయోగించాలి—అని తెలుపుతున్నది. పశు శబ్దం సాధారణంగా నాలుగు కాళ్లను కలిగిన పశువును నిర్దేశించే పదం. అయితే, ఈ వేదవాక్యంలో ప్రయోగింపబడిన పశు శబ్దం నాలుగు కాళ్ళను కలిగిన ఏ పశువును నిర్దేశిస్తున్నది? అనే విషయం స్పష్టం కావడం లేదు. కాని, ఇంకొక వేదవాక్యం ఆ యాగంలో ఛాగం అనబడే తెల్లని రంగును కల మేకను ఉపయోగించాలి —అని విధిస్తున్నది. అందుచేత మొదటి వాక్యంలో కనిపించే పశు అనే సామాన్య శబ్దం రెండవ వాక్యంలో కనిపించే ఛాగం అనే విశేష పదం యొక్క అర్థాన్ని కలిగినది — అని పూర్వ మీమాంసకులు నిర్ణయించారు. ఇది ఛాగ పశున్యాయం, లేక, సామాన్య విశేష న్యాయం అని అనబడుతున్నది.

మన పూర్వాచార్యులు ఈ న్యాయాన్ని పురస్కరించుకుని నిర్గుణ వాక్యాలలో ఉండే గుణం అనే సామాన్య శబ్దం "అపహత పాప్మా విజరో విమృత్యుః" అని మొదలైన వేద వాక్యంలో పరమాత్మలో లేనివిగా చెప్పబడే గుణ విశేషాలైన హేయగుణాలనే తెలుపుతున్నది—అని నిర్ణయించారు. హేయ గుణాలను నిషేధించే ఈ వాక్యమే తరువాత" సత్య కామః, సత్య సంకల్పః "అని పరమాత్మ కళ్యాణ గుణాలు అన్నిటికీ ఆకరంగా ఉండడాన్ని ఘోషిస్తున్నదని మనం చూడవచ్చు. ఆ విధంగానే, ఏ వేదవాక్యం కూడా భగవంతునకు కళ్యాణ గుణాలు లేవు —అని ఎక్కడా చెప్పలేదు— అనే విషయాన్ని కూడా మనం గమనించాలి. ఈ విధంగా ఈ సగుణ నిర్గుణ వాక్య విచారంలో కూడా తర్కరీతిలోను, వేదాంత విచార క్రమంలోనూ, విజ్ఞానధారలోనూ విచారిస్తే, పలు వేద వాక్యాలను అర్థం లేనివి అని గెంటివేసే అద్వైత మతం కంటే, సగుణ నిర్గుణ వాక్యాలకు విషయ విభాగం చేసి, సదర్థనిర్ణయాన్ని చేసే విశిష్టాద్వైత సిద్ధాంతమే

గొప్పది అనే విషయం చాలా స్పష్టంగా ప్రకాశిస్తున్నది. శ్రీ పరాశర మహర్షి కూడా ఈవిష్ణు పురాణంలో "సమస్త కళ్యాణ గుణాత్మకః" అని పరమాత్మను వర్ణించారు.

"యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరమ్" అని మొదలైన వేదవాక్యాలు "పరమాత్మకు అన్ని లోకాలు శరీరం" అని ఘోషిస్తున్నాయి. " ఆదిత్య వర్ణమ్", " నీలతోయదమధ్యస్థా", " అంతరాదిత్యే హిరణ్మయః పురుషః యథా కప్యాసం పుండరీకమ్ ఏవ మక్షిణీ" అని మొదలైన వేద వాక్యాలు పరమాత్మకు అప్రాకృతమైన, చాలా అందమైన దివ్య మంగళ రూపం ఉన్నది అని ఘోషిస్తున్నాయి. పరమాత్మకు శరీరం లేదు అని చెప్పే "అశరీరం శరీరేషు" అనే వాక్యం పైన తెలిపిన అన్ని వాక్యాలను నిరసించి, వానిని అర్థరహితంగా చేస్తున్నది –అని అద్వైతులు అంటారు.

మన పూర్వాచార్యులు తర్కాన్ని, యుక్తులను, విచారణను ఆధారంగా చేసికొని, పైన తెలిపిన పూర్వ మీమాంసాన్యాయాలను పురస్కరించుకొని, "అశరీరమ్" అనే వాక్యం పరమాత్మకు మనవలె కర్మచేత ఏర్పడిన అప్రాకృతమైన శరీరం కాదు అని తెలుపుతున్నది అని నిర్ణయించడం ద్వారా, లోకాలు అన్నీ అతనికి శరీరం అని, అతడు తన సంకల్పంతో పరిగ్రహించే అప్రాకృతమైన దివ్య మంగళ రూపం ఉన్నది అని చెప్పే వందలాది వేదవ్యాలను రక్షించినవారయ్యారు. ఇదే వేదాంత సిద్ధాంతం అనే అభిప్రాయంతో శ్రీపరాశరమహర్షి శ్రీవిష్ణుపురాణంలో "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"– తన సంకల్పంతో, ఇచ్ఛతో పరిగ్రహించిన, చాలా అందమైన రూపాన్ని కలవాడు –అని అన్నారు. ఈ విషయంలో కూడా తర్కరీతిలోనూ, విచారణ క్రమంలోనూ అద్వైత సిద్ధాంతం కంటే, మనం ఆదరించే విశిష్టాద్వైత సిద్ధాంతమే గొప్పది అనేది స్పష్టం.

"నేహ నానాస్తి కించన" అనే వేదవాక్యం లోకం అంతటిని అసత్యం అని తెలుపుతున్నదని అద్వైతులు వివరిస్తున్నారు.

" ద్వా సుపర్ణానా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి",

"జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ",
" పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా",
" భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా",
" నిత్యో నిత్యానాం చేతనః చేతనానాం
ఏకో బహూనాం యో విదధాతి కామాన్"

అన్ని మొదలైన ఎన్నో వేదవాక్యాలు లోకం అంతా పరమాత్మ వలెనే సత్యమైనవి అని ఘోషించడానికి, అద్వైతులు " లోకం అంతా అసత్యం" అని చెప్పే మాటకు విరుద్ధమవుతున్నది. మన పూర్వాచార్యులు అయితే, " న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్" అనే గీతా వాక్యాన్ని, పూర్వం ప్రస్తావించిన ఉత్సర్గాపవాద న్యాయాన్ని, సామాన్య విశేష న్యాయాన్ని పురస్కరించుకొని, "నేహ నానాస్తి కించన" అనే వాక్యం స్వతంత్రమైన లోకాన్నే అసత్యం అని తెలుపుతున్నది అని, మిగిలిన వేద వాక్యాలు పరతంత్రమైన లోకం అనేది పరమాత్మ వలెనే సత్యమైనది అని తెలుపుతున్నాయి— అని నిర్ణయిస్తున్నారు. వేదాంత విచార క్రమంలోనూ, విజ్ఞాన ధారలోనూ ఈ విషయంలో కూడా మన విశిష్టాద్వైత సిద్ధాంతమే విలక్షణంగా వెలుగుతున్నది.

ఇక శివ విష్ణు విచారాన్ని గమనిద్దాం. " నారాయణాత్. బ్రహ్మా జాయతే, నారాయణాత్ రుద్రో జాయతే, నారాయణాత్ ఇంద్రో జాయతే "అనే వేదవాక్యం బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు, మిగిలిన అన్ని వస్తువులు నారాయణుని వల్లనే

పుడుతున్నాయి అని ఘోషిస్తున్నది. " ఏకో హవై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః" అనే వేదవాక్యం సృష్టికి ముందు నారాయణుడు మాత్రమే ఉన్నాడు అని, బ్రహ్మా, శివుడు మొదలైన ఎవరూ లేరు అని స్పష్టం చేస్తున్నది. నారాయణుడు ఒక దైవం నుండి జన్మించాడు– అని కానీ, లేక, ఏ దైవం చేత సంహరింపబడ్డాడు– అని కానీ ఏ వేద వాక్యం చెప్పడం లేదు.

పరమాత్మ లెక్కలేనన్ని పేర్లను కలిగినవాడై ఉండడం అనేది వాస్తవమే. తన చేత సృష్టింపబడ్డ చేతనాలకు అచేతనాలకు తన కొన్ని నామాలని భగవంతుడు ఇచ్చాడు. అన్నీ అతని నామాలు అయినందువల్లనే, సత్, అసత్, బ్రహ్మా, ఆత్మా, ఇంద్ర, వాయు, ఆకాశ, ప్రజాపతి, హిరణ్య గర్భ, శివ, ఈశాన, శంభు, హరి, అచ్యుత, అనంత, పురుష, ఉత్తమ పురుష, విష్ణు, వాసుదేవ, నారాయణాది నామాలతో పలు వేదవ్యాలలో అనేక విధాలుగా అతడు నిర్దేశింపబడ్డాడు.

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమం చ దైవతమ్" అనే వేదవాక్యం అతనిని "దేవతలకు అందరికీ దేవుడు" అని ఘోషిస్తున్నది. చాలా వేదవాక్యాలు అతడు ఒక్కడే అని, రెండవది లేనివాడు –అని తెలుపుతున్నాయి. అందుచేత వేదంలో చెప్పబడిన పలువురు దేవతలలో ఈ దేవుడు పరతత్త్వమై ఉన్నాడు– అని నిర్ణయించవలసిన బాధ్యత వైదికులమైన మనకు ఉన్నది. మన ఆచార్యులు ఛాశగ పశున్యాయం అనే సామాన్య విశేష న్యాయాన్ని ఉపయోగించి, " స ఆత్మా, అంగాన్యన్యా దేవతాః" అని మొదలైన వేదవాక్యాలలో సర్వత్మగా ఘోషింపబడే పరతత్త్వం నారాయణుడే అని, మిగిలిన దైవాలు అతనికి అంగభూతులై, అతనికి వశులై ఉండేవారు అని నిశ్చయించి పలికారు. " పూర్వపదాత్ సంజ్ఞాయామ్" అనే పాణిని సూత్రాన్ని అనుసరించి, టవర్గంలోని చివరి అక్షరమైన ణకారాన్ని చివరి అక్షరంగా కలిగిన నారాయణ పదం ఆ పేరుతో ప్రసిద్ధి చెందిన ఒకనిని మాత్రమే నిర్దేశిస్తుంది. నారాయణ అనే నామం చేత ప్రసిద్ధి పొందినవాడు విష్ణువే– అనే విషయం

ఎవరిచేత కాదనడానికి వీలులేనిది. అందుచేత, అసత్, బ్రహ్మ, ఇంద్ర, వాయు, ఆకాశ, ప్రజాపతి, హిరణ్యగర్భ, శివ, ఈశాన, శంభు, హరి, అచ్యుత, అనంత, పురుష, ఉత్తమ పురుషాది మిగిలిన అన్ని పేర్లు పశుశబ్దంవలె, ఆ శబ్దాల చేత చూపబడే స్వభావాన్ని కలిగిన ఎవరిని అయినా నిర్దేశించే సామాన్య శబ్దాలు అని, టవర్గంలోని ణకారాన్ని చివరి అక్షరంగా కలిగిన నారాయణ శబ్దం, ఛాగపదం వలె, ఆ పేరుతో ప్రసిద్ధి పొందిన ఒక్కని మాత్రమే నిర్దేశిస్తుంది అని స్పష్టమవు తున్న ది. నారాయణ అనే పదం ఎవరిని అయినా నిర్దేశించాలి అంటే, అది తవర్గ నకారాన్ని చివరి అక్షరంగా కలిగినదై, నారాయన అని ఉండాలి. అయితే, వేదంలో ఎక్కడా ఈ విధంగా ప్రయోగింపబడలేదు. వేద వాక్యాలు పరసత్వాన్ని ఈ పేరుతో నిర్దేశించే సందర్భాలు అన్నిటిలోనూ నారాయణ అని నిర్దేశిస్తున్నాయే తప్ప, ఎక్కడా కూడా నారాయన అని నిర్దేశించడం లేదు. దీనివల్ల, నారాయణుడు ఒక్కడే పరమాత్మ –అని, మిగిలిన దైవాలు అన్ని మనవలెనే జీవాత్మలే– అని స్పష్టమవుతున్నది.

# విశిష్టాద్వైతమ్

(వాగమృతవర్షి, ఉ. వే. వేళుక్కుడి వరదాచార్య స్వామివారి ఉపన్యాసం ఆధారంగా)
తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే,
యః శ్రుతిస్మృతి సూత్రాణా మంతర్జ్వర మశీశమత్.

ఏ మహనీయులు శ్రుతిస్మృతి సూత్రాలలో పై పైన తోచే వైరుధ్యమనే జ్వరాన్ని పోగొట్టారో, అటువంటి పరమ యోగి అయిన భగవద్రామానుజులను నమస్కరిస్తున్నాను.

ఈ శ్లోకంతో పెద్దలు అందరూ కీర్తించే వైభవాన్ని కలిగినవారు, మన స్వామి భగవద్రామానుజులు. వారు వృద్ధి చేసిన సిద్ధాంతమే విశిష్టాద్వైత సిద్ధాంతం అని అనబడుతున్నది. విశిష్టాద్వైతం అంటే ఏమి ? అనే విషయాన్ని గూర్చి, ఈ విశిష్టాద్వైత సిద్ధాంతమూలంగా శ్రీ రామానుజులు సాంప్రదాయకాలైన పలు అర్థాలను ఏ విధంగా వ్యక్తం చేశారు? అనే విషయాన్ని గూర్చి ఈ వ్యాసంలో కొంచెం విన్నపింపబడుతున్నది.

చోళ సింహపురం దొడ్డయాచార్య స్వామి అనే మహా చార్యులు బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమైన పారాశర్య విజయం అనే అత్యద్భుతమైన ఒక గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథం ఆరంభంలో వారు ఒక వర్ణన చేశారు. అది ఏమంటే,

వేదాపహారిణం ధైత్యం మీనరూపీ నిరాకరోత్,
తదర్థాపహారిణః సర్వాన్ వ్యాసరూపీ మహేశ్వరః.

అనేది ఆ శ్లోకం. ఇందులోని భావం ఏమంటే– మత్స్యావతారాన్ని ఎత్తిన భగవంతుడే వ్యాసావతారాన్ని కూడా ఎత్తాడు. అతని ఒక అవతారం మీనావతారం.

అతని ఇంకొక అవతారం వ్యాసావతారం. వేదాలను అపహరించిన సోమకుడు అనే అసురుని నశింపజేసి, పరమ ప్రమాణమైన వేదాన్ని తిరిగి సంపాదించడం కోసం సంభవించినది మత్స్యావతారం. వేదార్థాలను మార్చి విపరీతంగా పలికే వేదబాహ్యులు, కుదృష్టులు అనే వారి మతాలను సప్రమాణంగా ఖండించి, "ఇదే వేదాంతార్థం, ఇదే వైదికమైన మతం, ఇదే సద్వాదం" అని యథార్థమైన వేదాంతార్థాలను సిద్ధాంతీకరించడం కోసం భగవంతుడు పరిగ్రహించిన అవతారం వ్యాసావతారం.ఈ వాస్తవాన్ని, అంటే, భగవంతుని అవతారమే వ్యాసావతారం –అనే విషయాన్ని వారి తండ్రి అయిన పరాశర భగవానులే వర్ణించారు.

కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్,
కో హ్యన్యో భువి మైత్రేయ! మహాభారత కృద్భవేత్.
(శ్రీ విష్ణు పురాణమ్– 3–4–5)

(మైత్రేయా! కృష్ణ ద్వైపాయనులు అనబడే వ్యాసులను పరమాత్మ అయిన నారాయణుడు అని తెలుసుకో.. వేరెవ్వరు ఈ లోకంలో మహాభారతాన్ని రచించగలరు?) అనే శ్లోకాన్ని గమనించవచ్చు.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన శ్రీ వేదవ్యాసులు అనుగ్రహించిన బ్రహ్మమీమాంసా శాస్త్రం అనే బ్రహ్మ సూత్రాలకు మన స్వామి భగవద్రామానుజులు శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలతో వ్యాఖ్యానం చేశారు.వీటినే కాక, తిరుమలలో శ్రీ వేంకటేశ్వర స్వామి సమక్షంలో వారు అనుగ్రహించిన ఉపన్యాసం గ్రంథస్థం చేయబడి, వేదార్థ సంగ్రహం అనే పేరుతో ప్రసిద్ధి చెందిన గ్రంథంగా ప్రకాశిస్తున్నది. వీటి వల్ల విశిష్టద్వైతం అంటే ఏమి? అనే విషయాన్ని గూర్చి మనం చాలా స్పష్టంగా తెలియవచ్చు. సంగ్రహంగా, వేదార్థ సంగ్రహంలో విశిష్టద్వైతం అనే దానిని గూర్చి చాలా ఆశ్చర్యకరంగా వారు వర్ణించారు. విశిష్టాద్వైతం అంటే ఏమి? ఇందులో, తత్వభాగం అంటే ఏది? హిత భాగమంటే ఏది? పురుషార్థ భాగం అంటే ఏది? వేదాంతసిద్ధమైన

తత్త్వ హిత పురుషార్థాలను మన పెద్దలు ఏ విధంగా నిర్వహించారు? అనే విషయాన్ని మనం ఇప్పుడు వివరంగా అనుభవంలోకి తెచ్చుకుందాం.

మహాచార్యులు అనబడే చోళ సింహపురం దొడ్డయాచార్యస్వామివారు పారాశర్య విజయం అనే గ్రంథం ఆరంభంలో ఒక విషయాన్ని తెలియజేశారు. వేదాంతులు అందరూ విచారించేది రెండు విషయాలను గూర్చియే. అవి ఏమి? అంటే,అద్వైతం వేదార్థమా? లేక, ద్వైతం వేదార్థమా? అనేవే ఆ రెండు విషయాలు. వేదాంతులు విషయ విచారం చేస్తారు. సకలవైదిక సంమతం శ్రీవైష్ణవ మతమై ఉన్నందున, శైవం వేదార్థమా? లేక, వైష్ణవం వేదార్థమా? అని విచారించే వైదికులు అనేవారు లేరు., అద్వైత మతాచార్యులు కూడా వైష్ణవులే. విశిష్టాద్వైతుల మతం కూడా శ్రీవైష్ణవ మతమే. ద్వైతమతస్థుల మతం కూడా వైష్ణవమే. విష్ణుపారమ్యం చెప్పని అవైష్ణవ మతం అనేది వేదాంతంలో చేరినది కాదు. అద్వైత మతాచార్యులు కానీ,విశిష్టద్వైత మతాచార్యులు కానీ, ద్వైత మతాచార్యులు గానీ, అందరూ కూడా వేదాంతలుగా ఉన్నందున, నారాయణుని అంగీకరించని వైదికులే లేరు. ఆ విధంగా, ఒకవేళ విషయ విచారం ఒకడు చేసేవాడే అయితే, అతడు అవైదికుడుగా ఉంటాడే తప్ప అతడు ఏ విధంగాను వైదికుడు అయ్యే అవకాశం లేనే లేదు.

ఈ అర్థాన్ని పరమాచార్యులైన శ్రీయామునులు కూడా సిద్ధాంతీకరించారు. “భగవన్! నీ సర్వేశ్వరత్వాన్ని ఒప్పుకొనని వైదికుడు ఎవడు ఉన్నాడు?” అని భగవంతుని చూచి వారు స్తోత్ర రత్నంలో ప్రశ్నించారు—, “వైదిక కః” అని అంటూ. పెరియ వాచ్చాన్ పిళ్లై అనే శ్రీకృష్ణ సూరి అవైదిక శబ్దానికి “అబ్రాహ్మణ ఇత్యర్థః “అనే అభిప్రాయాన్ని తెలియజేశారు. పురుష సూక్తాన్ని అయినా అధ్యయనం చేస్తేనే బ్రాహ్మణ్యం సిద్ధిస్తుంది. దాని నుండి ఆరంభించి సకల వేద వేదంతాలలో సకల ఇతిహాస పురాణాలలో సర్వశాస్త్రాలలో సమ్మతమైనది నారాయణ పరత్వం. ఈ నారాయణపరత్వంలో వైదికులలో ఎవ్వరికి అభిప్రాయ భేదం అనేది లేనే లేదు,

అందుచేత,వైదికులు అందరూ విషయ విచారణ చేయడం వేదాంతార్థం ద్వైతమా?, అంటే,భేదమా? లేక, అద్వైతమా? అంటే, అభేదమా ?అనే విషయాన్ని గూర్చియే. మన పెద్దలు అందరూ ఈ విషయాన్నే విచారం చేసినవారుగానే ఉన్నారు.

మన పూర్వాచార్యులలో శ్రీ రామానుజులకు తిరుక్కచ్చినంబి మూలంగా వరదరాజస్వామి అనుగ్రహించిన ఆరు వార్తలలో, రెండవ వార్త " దర్శనం భేద ఏవ చ" అనేది. శ్రీ వరదరాజస్వామి శ్రీరామానుజులకు అనుగ్రహించిన ఆరు వార్తలలో చాలా ముఖ్యమైన అర్థం ఇదే.మన దర్శనం భేద దర్శనమే అయినప్పటికీ, దీనిని విశిష్టాద్వైత శబ్దంతో వర్ణిస్తున్నారు మన పెద్దలు. మన స్వామి శ్రీరామానుజులు తమ గ్రంథాలలో విశిష్టాద్వైతం అనే శబ్దాన్ని ఎక్కడా ప్రయోగించలేదు. అయినప్పటికీ, కాలక్షేపాన్ని అనుగ్రహించే సమయంలో వారు ఈ శబ్దాన్ని ప్రయోగించి ఉండాలి. వారి శిష్యులలో ప్రముఖులైన వడుగనండబి రచించిన శ్రీ రామానుజాష్టోత్తర శతనామ స్తోత్రంలో ఈ శబ్ద ప్రయోగాన్ని మనం గమనించవచ్చు. శ్రీరామానుజుల దివ్య సూక్తులకు వ్యాఖ్యానం అనుగ్రహించిన శ్రుతప్రకాశికాచార్యులవారు "మన దర్శనం విశిష్టాద్వైతం" అని అనుగ్రహించడాన్ని మనం చూస్తున్నాము. శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులవారు శ్రీ పరాశర భట్టర్ సంతతిలో అవతరించినవారు. వీరే శ్రీవేదవ్యాస సుదర్శన భట్టారకులు. వీరి సూక్తియే–

తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే,
యః శ్రుతి స్మృతి సూత్రాణా మంతర్జ్వర మశీశమత్.

(ఏ మహనీయులు శ్రుతి స్మృతి సూత్రాలలో పై పైన తోచే వైరుధ్యమనే జ్వరాన్ని పోగొట్టారో, అటువంటి పరమ యోగి అయిన భగవద్రామానుజులను నమస్కరిస్తున్నాను.) అనే ఆశ్చర్యకరమైన ఒక శ్లోకం. ఇంతకుమించి కూడా ఆశ్చర్యకరంగా ఇంకొక విషయాన్ని శ్రుత ప్రకాశికాచార్య స్వామి వారు అనుగ్రహిస్తున్నారు.

" ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" (బృహదారణ్యకం– 6–5 –6) (వినదగినది, భావించదగినది అయిన ఈ ఆత్మ, ధ్యానించదగినది, దర్శించదగినది) అనే వేదాంత వాక్యంలో "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అని మొదట ఉన్న ప్పటికీ, మన పూర్వాచార్యులు ఆ క్రమాన్ని మార్చి అర్థం చెప్పారు పాఠక్రమం ఈ విధంగా ఉన్నప్పటికీ కూడా, మన పెద్దలు అర్థ క్రమాన్ని అనుసరించి పాఠ క్రమాన్ని మార్చి వేశా రు. అది పూర్వ మీమాంసా న్యాయ సిద్ధమైన విషయం "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో ద్రష్టవ్యః" అని శ్రవణ, మనన, జ్ఞాన,దర్శనాలు –అనే క్రమంలో చెప్పేటట్లు ఈ బృహదారణ్యక వాక్యంలోని పద క్రమాన్ని వారు మార్చారు.. ఈ వచనార్థాన్ని మనసులో పెట్టుకొని శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులవారు–

" శ్రుత్యంతేషు శ్రుతం భాష్యే మతం ధ్యాతం హృదంబుజే,
లక్ష్మీ ధరం ప్రపద్యే తం దృష్టం శ్రీరంగ ధామని. "

అని అంటూ చాలా ఆశ్చర్యకరమైన శ్లోకాన్ని అనుగ్రహించారు. దీని భావం ఏమంటే– లక్ష్మీ ధరుడైన భగవంతుని దేనిలో మనం వింటున్నాము? అని అంటే, వేదాంతాలలో, దేనిలోమననం చేస్తున్నాము? అని అంటే, శ్రీభాష్యంలో, దేనిలో ధ్యానం చేస్తున్నాము? అని అంటే, హృదయ పద్మంలో, చివరిగా, ఎక్కడ చూస్తున్నాము? అని అంటే శ్రీరంగంలో –అని. శ్రీరంగంలో దర్శనమా? లేక, పరమపదంలో దర్శనమా? అని అంటే, పరమపదంలో కాదు, శ్రీరంగంలోనే దర్శనం. "అచ్చువై పెరినుమ్ వేండేన్" అనే తొండరడి ప్పొడి ఆళ్వారుల దారిని అనుసరించేవారు, మన పూర్వాచార్యులు. పరమపదంలో భగవంతం సేవించడం అనేది నిత్యమైన పురుషార్థం. అయితే, ఈ భూమండలంలో శ్రీరంగంలోని దర్శనాన్ని కోరారు, మన పెద్దలు, ఈ మనోభిప్రాయాన్ని అనుసరించి శ్రుత ప్రకాశికాచార్యులవారు ఈ ఆశ్చర్యకరమైన అభిప్రాయాన్ని తెలియజేశారు.

## విశిష్టాద్వైతమ్

ఉపనిషత్తులు అన్నిటిలోను ఛాందోగ్యోపనిషత్తుకు చాలా వైలక్షణ్యం ఉన్నది. వేదాలలో గొప్పది సామవేదం. సామవేదంలో అంతరంగమైనది ఛాందోగ్యోపనిషత్తు. అందులోనూ, ఆరవ ప్రపాఠకం అయిన సద్విద్యా ప్రకరణం ముఖ్యమైనది. (ఉపక్రమ, ఉపసంహారాలు(ప్రారంభం చివర ఒకే విధంగా ఉండడం), అభ్యాసం (మాటిమాటికి పఠించడం), అపూర్వత (కొత్తగా చెప్పడం), ఫలం (ప్రయోజనాన్ని కలిగినదిగా ఉండడం), అర్థవాదం (పొగడడం), ఉపపత్తి (పొందికను కలిగినదిగా ఉండడం) అనే ఆరు విధాలైన తాత్పర్య లింగాలలతో ఛాందోగ్యోపనిషత్తులో ఉండే సద్విద్యాప్రకరణానికి కల తాత్పర్యం ఏమి? అనే విషయాన్ని విచారించి, ఈ ప్రకరణానికి అద్వైతమే విషయం– అని అద్వైతులు అంటున్నారు. ఈ ప్రకరణంలో చెప్పబడిన విషయం నిర్విశేషాద్వైతం– అనేది ఆదిశంకరుల అభిప్రాయం.

నిర్విశేషాద్వైతపరంగా కాదు, విశిష్టాద్వైత పరంగానే ఈ ప్రకరణాన్ని గ్రహించాలి– అని నిర్వహించారు, మన స్వామి భగవద్రామానుజులు.వారు అనుగ్రహించిన. వేదార్థ సంగ్రహానికి వ్యాఖ్యానం అయిన తాత్పర్య దీపికలో "ఆరు విధాలైన తాత్పర్య లింగాలలతో చూచిప్పుడు ఈ ప్రకరణానికి విషయం అద్వైతం " అనే విషయాన్ని, మనం కూడా ఒప్పుకుంటున్నాము –అని శ్రుతప్రకాశికాచార్యులవారు అన్నారు. ఆరు విధాలైన తాత్పర్య లింగాలలతో అద్వైత మతమే ఈ ప్రకరణానికి సారార్థం– అనే విషయాన్ని పెద్దలు నిశ్చయించి పలికారు. " తత్ అభ్యుపగతమ్"– " దానిని మేము ఒప్పుకుంటున్నాము "అని అన్నారు శ్రుతప్రకాశికాచార్యులవారు. అయితే, దానికి తరువాత, " ఆ అద్వైతమనేది ఎటువంటిది ?అని అంటే, దానిని మేము శుద్ధాద్వైతంగా గ్రహించడం లేదు, విశిష్టాద్వైతంగానే గ్రహిస్తున్నాము" అని అంటున్నారు. అందుచేత, అద్వైతం అనే శబ్దంలో మనకు అభిప్రాయ భేదం లేదు, శుద్ధాద్వైతమా? లేక, విశిష్టమైన అద్వైతమా? అనే విషయంలోనే అభిప్రాయ భేదం ఉన్నది– అని వర్ణించారు. శ్రుతప్రకాశికాచార్యులవారు. విశిష్టాద్వైతం అనే పదాన్ని వారు ఈ సందర్భంగా ప్రయోగించారు. అందుచేత ఈ శబ్దంలో చెప్పబడిన అర్థమనేది స్వామి

భగవద్రామానుజులచే శ్రీ భాష్యాది గ్రంథాలలో విస్తృతంగా నిరూపింపబడిన విషయమే— అనే సంగతిని మనం గ్రహించవచ్చు.

అద్వైతమే వేదాంతం —అని అద్వైత మతాచార్యులు చెప్పలేదు, వేదాంతమే చెబుతున్నది. బృహదారణ్యక గతమైన కఠోపనిషత్తులో

"మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి"

అనే ఒక వాక్యం కనబడుతున్నది. దీనితో —భేదాన్ని చూసేవానికి ఇంకా ఇంకా సంసారమే లభిస్తుంది తప్ప, ఏ సమయంలోను సంసారం నుండి విడుదల లభించదు. అతనికి మోక్ష సామ్రాజ్యం లభించదు— అనే విషయాన్ని వేదాంతం యొక్క పరమమైన అభిప్రాయంగా తెలియవచ్చు.. అద్వైతాన్ని దర్శించేవానికి మోక్షం లభిస్తుంది, ద్వైతం చూచేవానికి మోక్షం లభించదు —అనే విషయాన్ని వేదాంతం స్పష్టంగా చెబుతున్నది. దీనిని వైదికులందరూ చెప్పవలసినవారే, ఈ వేదాంత వాక్యాన్ని ప్రమాణంగా గ్రహించినవారు ఎవరైనా ఈ వాక్యానికి అర్థం చెప్పవలసినవారై ఉన్నారు. వేదాంతంలో చెప్పబడిన అద్వైతం ఇటువంటిది అని ఒకరు, అటువంటిది అని ఇంకొకరు చెబుతున్నారు— అనేదే వాస్తవం తప్ప, అద్వైతం వేదాంతార్థమే కాదు —అని ఏవైదికుడు కూడా చెప్పడం లేదు. ఆ విధంగా చెప్పడం సాధ్యం కూడా కాదు.

అందుచేత వేదాంతంలో చెప్పబడిన అద్వైతం ఎటువంటిది? అనే విషయంలోనే అభిప్రాయ భేదం. అది నిర్విశేషమైన అద్వైతమా? లేక, సవిశేషమైన ? అంటే, విశిష్టాద్వైతమా? అనే విషయ విచారాన్నే మన పూర్వాచార్యులు చేశారు— అనే విషయాన్ని మనం గ్రహించవచ్చు. " దర్శనం భేద ఏవ చ" అనే విషయాన్ని సిద్ధాంతంగా తిరుక్కచ్చి నంబిమూలంగా శ్రీ వరదరాజస్వామి అనుగ్రహించగా, దానిని

మన స్వామి భగవద్రామానుజులు విశిష్టాద్వైతపరంగా నిర్వహణ చేయడం అత్యంతం ఆశ్చర్యకరమైన విషయం.

శ్రీ భాష్యంలోని లఘు సిద్ధాంత ప్రకరణంలో ఇంకొక అభిప్రాయాన్నికూడా మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించారు. ప్రసంగ వశం చేత దానిని కూడా ఇక్కడ ప్రస్తావిస్తాను. " తత్వ జ్ఞానాత్ మోక్షలాభః" – తత్వ జ్ఞానం వల్ల మోక్షం లభిస్తుంది అనే విషయాన్ని వైదికులు అందరూ చెబుతున్నారు.

తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి"

(పురుష సూక్తం)

(ఈ భగవంతుని ఈ విధంగా తెలిసికొన్న జ్ఞాని ఈ లోకంలో ముక్తునకు సమంగా అవుతున్నాడు) అని,

"తమేవ విధిత్వా అతిమృత్యుమేతి"

శ్వేతాశ్వతరోపనిషత్తు–3–8)

(ఆ పరమ పురుషుని తెలిసికొనే సంసారంనుండి దాటుతున్నాడు)

అనే వాక్యాలతో –" భగవంతుని గూర్చి మనం తెలుసుకోవాలి, భగవద్విషయ జ్ఞానాన్ని మనం పొందాలి, ఆ జ్ఞానంలోనే మోక్షం లభిస్తుంది,అమృత ప్రాప్తిహేతువు బ్రహ్మజ్ఞానమే" అని వేదాంతమే చెబుతున్నది. అనిష్ట నివృత్తి, ఇష్ట ప్రాప్తి– అనే రెండిటికి తప్పని ఉపాయం బ్రహ్మజ్ఞానం.

భగవద్రామానుజులు ఆదిశంకరుల వ్యాఖ్యానాన్ని శ్రీభాష్యంలో విచారించారు. "యదుక్తం అవిద్యానివృత్తిరేవ మోక్షం, సా చ బ్రహ్మవిజ్ఞానాదేవ ఇతి, తత్ అభ్యపగమ్యతే" – "అవిద్యానివృత్తియే మోక్షం, అది కూడా బ్రహ్మజ్ఞానం వల్లనే కలుగుతున్నది–అని మేము కూడా ఒప్పుకుంటాం." అని శ్రీరామానుజుల వారు అన్నారు.. అవిద్య తొలగిపోవడమే మోక్షం– అనేది వేదాంత తాత్పర్యంగా

అంటున్నారు, ఆదిశంకరులు. దానిని స్వామి రామానుజులు ఒప్పుకుంటున్నారు, అయితే, ఆ తత్వజ్ఞానం ఎటువంటిది? బ్రహ్మజ్ఞానం ఉపాయం అని చెప్పబడుతున్నదే! ఆ బ్రహ్మజ్ఞానం,అంటే, సాధకం జ్ఞానం, ఎటువంటిది? అనే ప్రశ్నకు, ఆది శంకరుల పక్షం ఏమంటే, వాక్య జన్య వాక్యార్థజ్ఞానం —అని. కాని,ఉపాసనాత్మకమైన జ్ఞానం— అని అంటున్నారు, మన స్వామి రామానుజులు.

నిర్విశేషాద్వైతవాదులు వాక్యార్థజ్ఞానం ఉపాయం అని అంటున్నారు. అది ఉపాయం కాదు, ఉపాసనాత్మకమైన జ్ఞానమే ఉపాయం అని అంటున్నారు, విశిష్టాద్వైతులు. కొంచెం విశిష్టంగా చెబితే, ప్రపత్తి— అని అంటున్నారు. ఇంకా కొంచెం విశిష్టంగా చెబితే, ఆచార్యాభిమానం —అని అంటున్నారు. ఏవిధంగా చెప్పినా,అది ఒకే జ్ఞానం.. ఆ జ్ఞానాన్ని విశేషంగా వర్ణించేటప్పుడు, ఉపాసనాత్మకమైన జ్ఞానం, ప్రపత్తి రూప జ్ఞానం, శరణాగతి రూప జ్ఞానం, ఆచార్యాభిమాన రూప జ్ఞానం— అని దానిని వివరిస్తున్నారు. ఈ విధంగానే తత్వవిచారాన్ని చేసేటప్పుడు అద్వైతం అనే అర్థాన్ని మనం లేదు— అని చెప్పే వారం కాదు. అయితే, విశిష్ట బ్రహ్మమే వేదాంత తాత్పర్యం నిర్విశేష బ్రహ్మం కాదు— అనే సిద్ధాంత స్థాపనం చేస్తున్నారు, మన స్వామి భగవద్రామానుజులు.

“మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి” అనే శ్రుతివాక్యం “ఎవడు నానాత్వాన్ని దర్శిస్తున్నాడో, అతడు భేదాన్ని చూస్తున్నాడు. అతనికి మృత్యువే లభిస్తుంది. సంసారమే లభిస్తుంది”— అని స్పష్టంగా చెబుతున్నది. ఈ శ్రుతి వాక్యానికి తాత్పర్యాన్ని అనుగ్రహించబోయే మన స్వామి రామానుజులు శ్రీభాష్యంలో—

“ జగత్ బ్రహ్మకార్యతయా తదంతర్యామికతయా చ తదాత్మకత్వేన ఐక్యాత్ ——— తత్ ప్రత్యనీకనానాత్వం ప్రతిషిధ్యతే” అని అన్నారు. శ్రీ భాష్య శ్రీ సూక్తులలో ఈ వాక్యానికి ఉండే వైలక్షణ్యం మిగిలిన ఏ వాక్యానికి లేదు— అని మహా విద్వాంసులైన

పెద్దలు అందరూ పొగడుతున్నారు. ఈ వాక్యం మన విశిష్టాద్వైత సిద్ధాంతానికి నిర్ధారణమైన నిర్ణాయక వాక్యం. దీనికి కల అర్థం ఏమి?

ద్వైతాన్ని ఖండించే ఈ వేదవాక్యం ఎటువంటి ద్వైతాన్ని ఖండిస్తున్నది అనేదానికి మన స్వామి రెండు విషయాలను అనుగ్రహిస్తున్నారు. అవి ఏమి అంటే

1) "జగత్ బ్రహ్మకార్యతయా,
2) తదంతర్యామికతయా చ తదాత్మకత్వేన

అనేవి ఆ రెండు విషయాలు. దీనికి శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారు చాలా అద్భుతంగా అర్థాన్ని అనుగ్రహించారు. అది ఏమి అంటే, "తదాత్మకత్వేన చ" అని శ్రీ రామానుజులు చకారాన్ని ప్రయోగించకుండా, "తదంతర్యామికతయా చ తదాత్మకత్వేన" అని చకారాన్ని ప్రయోగించడానికి అభిప్రాయం ఏమంటే, రెండు కారణాలు ఉన్నాయి. ఆ రెండు విధాలైన కారణాలతో మనం తెలుసుకోవలసినది ఏమి? జగత్తు బ్రహ్మాత్మకం –అని అద్వైతులు వ్యాఖ్యానిస్తున్నారు. రామానుజులు కూడా జగత్తు బ్రహ్మాత్మకం అని వ్యాఖ్యానిస్తున్నారు. బ్రహ్మాత్మకం అనే చెప్పేటప్పుడు, బ్రహ్మను, జగత్తును ఒకటిగా చేసి, బ్రహ్మాత్మకం అని చెప్పడమా? లేక, జగత్తు, బ్రహ్మం– అని రెండుగా గ్రహించి, బ్రహ్మాత్మకం అని చెప్పడమా? అనే విచారణ చేయవలసి ఉన్నది. రెండుగా గ్రహించి బ్రహ్మాత్మకం అని చెప్పవచ్చు,ఒకటిగా గ్రహించి బ్రహ్మాత్మకం అని చెప్పవచ్చు –అని రెండు విధాలైన అభిప్రాయాలను పురస్కరించుకొని, వీటిలో వేదాంతంలోని పరమార్థం ఏమి? అనే విషయాన్ని మన స్వామి రామానుజులు "జగత్ బ్రహ్మకార్యతయా,తదంతర్యామికతయా చ తదాత్మకత్వేన " అని వాక్యంద్వారా వివరిస్తున్నారు.

జగత్తు బ్రహ్మాత్మకమే. ఆ బ్రహ్మాన్ని విడిచి, జగత్తు ప్రత్యేకంగా ఉండదు— అనే అభిప్రాయంతో " జగత్తు బ్రహ్మాత్మకం" అని అద్వైతులు చెబుతున్నారు. ఇది మన సంప్రదాయం కాదు. జగత్తుకు, బ్రహ్మకు మధ్య కార్యకారణభావం, జగత్తుకు, బ్రహ్మకు మధ్య ప్రకార ప్రకారి భావం —అని రెండు విధాలైన కారణాలను పురస్కరించుకొని, "జగత్తు బ్రహ్మాత్మకం" అని విశిష్టాద్వైతులమైన మనం చెబుతున్నాం. ఈ విషయాన్ని మన పూర్వాచార్యులు ఏ విధంగా తెలియజేశారో కొంచెం వివరిస్తాను.

వేదాంతాలలో చెప్పబడే అద్వైతం శంకరుల భాష్యంలో చెప్పబడినట్లుగా శుద్ధాద్వైతం కాదు. వేదాంతాలలో చెప్పబడినది విశిష్టాద్వైతమే. ఈ శుద్ధాద్వైతం అనేదానికి విరుద్ధమైన శబ్దం విశిష్టాద్వైతం. శంకరుల మతానుగుణంగా నిర్విశేష బ్రహ్మాద్వైతం. వీరి మతానుగుణంగా సవిశేషబ్రహ్మాద్వైతం. అద్వైతులు చెప్పేది నిర్విశేష బ్రహ్మాద్వైతం. విశిష్టాద్వైతులు చెప్పేది సవిశేష బ్రహ్మాద్వైతం. వారు నిర్విశేష బ్రహ్మాద్వైతాన్ని చెబుతున్నారు. వీరు సవిశేష బ్రహ్మాద్వైతాన్ని చెబుతున్నారు. ఇద్దరూ అద్వైతాన్నే చెప్పినప్పటికీ, అద్వైతులు చెప్పే అద్వైతం, దానికి విరుద్ధమైన ద్వైతం అనేది వేరు, విశిష్టాద్వైతులు చెప్పే విశిష్టాద్వైతం, దానికి విరుద్ధమైన ద్వైతం అనేది వేరు. బ్రహ్మ కంటే రెండవది లేదు —అని వేదాంతం చెప్పినందున, వేదాంతంలో అద్వైతం చెప్పబడినందున, రెండు మతాలవారు అద్వైతాన్ని ఒప్పుకుంటున్నారు. వేదాంతంలో అద్వైతం చెప్పబడినందున, " ద్వైతాన్ని చూడకు, భేదం చూడకు" అని స్పష్టంగా వేదాంతం చెప్పినందున, ఈ వేదాంతాన్ని నిర్ణయం చేసే వైదికులు "ద్వైతాన్ని చూడకూడదు, అద్వైతాన్నే చూడాలి" అని అన్నందున,"అద్వైతాన్నే చూడాలి" అని చెప్పడంలో ఇద్దరికీ అభిప్రాయభేదం అనేది లేదు. అయితే, ఈ విధంగా వేదాంతంలో చెప్పబడిన అద్వైతం ఎటువంటి అద్వైతం? అని వివరించే సమయంలో ఆదిశంకరులు చెప్పే అర్థం వేరు, మన స్వామి శ్రీరామానుజులు చెప్పే అర్థం వేరు.

" సదేవ, ఏకమేవ, అద్వితీయమ్"

ఈ చర్చలు అన్నిటికీ మూల కారణంగా ఒక శ్రుతివాక్యం ఉన్నది. ఆ వాక్యానికి అర్థం నిర్ణయం చేసే రీతిలోనే ఈ మత భేదాలు ఏర్పడ్డాయి. తండ్రి అయిన ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఉపదేశం చేసే ప్రకరణమే ఛాందోగ్యోపనిషత్తులోని సద్విద్యా ప్రకరణం. ఛాందోగ్యోపనిషత్తులో ఆరవ ప్రపాఠకంలో సద్విద్యా ప్రకరణంలో —జగత్తుకు అంతటికి కారణమైన బ్రహ్మను గూర్చి నిరూపణం చేస్తున్నారు— తండ్రి అయిన ఉద్దాలకుడు. ఇందులో ఉండే ఒక వాక్యమే "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ ఏకమేవ అద్వితీయమ్" అనే వాక్యం.

"ఇదమ్"— కంటికి కనిపించే ఈ వస్తువులు అన్నీ —అని అర్థం. అంటే, ఇప్పుడు అనేక విధాలుగా, అనేకంగా, దేవ మనుష్య తిర్యక్ స్థావరాలుగా ఉండే పదార్థాలకు ఆశ్రయంగా ఉండే ఈ జగత్తు, అగ్రే— ఆ కాలంలో, అంటే, సృష్టికి ముందు ఉన్న ప్రళయ కాలంలో, సదేవ —సత్తుగానే ఉన్నది. అంటే, ఉండే వస్తువుగానే ఉన్నది. ఏకమేవ ఆసీత్— అది ఒకటిగానే ఉన్నది. ఇప్పుడు అనేక పదార్థాలుగా నామరూపాలతో కనిపించే ఈ ప్రపంచం అనేది నామరూప విభాగం లేకుండా ఒకటిగానే ఉన్నది. ఏకత్వం అనేది నామ రూప విభాగాలు లేకుండా ఒకటై ఉండడాన్ని తెలుపుతుంది, అద్వితీయమ్ ఆసీత్—రెండవది లేనిదిగా ఉన్నది— అని అర్థం.

అందుచేత," సదేవ" అనే చోట ఒక ఏవకారం, " ఏకమేవ "అనే చోట ఇంకొక ఏవకారం —అని ఏవకారద్వయం ఉన్నది. ఈ ఏవకార ద్వయంతో కూడినది అద్వితీయ శ్రుతి.అద్వితీయం,—రెండవది లేనిది—అని చెప్పబడుతున్నది. అందుచేత, అద్వితీయ శ్రుతి అని చెప్పబడుతున్నది. ఒకటే— అని చెబుతున్నది, రెండవది లేనిది— అని కూడా చెబుతున్నది. దీనినే శ్రుతప్రకాశికాచార్యులవారు " ఏవకారద్వయం అవధారణ ద్వయ సచివాద్వితీయశ్రుతి" అని అన్నారు.

"అవధారణద్వయ సచివ అద్వితీయ శ్రుతి"– రెండు అవధారణలు కలిగిన అద్వితీయశ్రుతి– అని అర్థం. అవధారణం అంటే– ఏవకారమే. అవధారణం–
1) సత్తుగానే ఉన్నది, ఆ విధంగా అంటే ఏమి? 2) ఒకటిగానే ఉన్నది. ఆ విధంగా అంటే ఏమి? రెండవది లేనిదై ఉన్నది. ఆ విధంగా అంటే ఏమి ? "ఏకమేవ" అని అన్నందువల్లనే రెండవది లేదు, ఒకటే– అని తెలిసినట్లయినది. తరువాత, అద్వితీయం–, "ఒక్కటే ఉన్నది రెండవది లేదు" అని చెప్పినట్లయిది.

ఇదేకాక, అద్వైతాన్ని ఏ విధంగా గ్రహించవచ్చు? వేదాంతం చెప్పేది అద్వైతాన్నే– అని అంటున్నారు, శంకరులు. ఈ వాక్యానికి శంకరులు చెప్పే అర్థం ఏమంటే– "సదేవ ఆసీత్"– సత్ అనేది బ్రహ్మను నిర్దేశిస్తున్నది. సత్తుకు విజాతీయమైన, అంటే, భిన్నమైన పదార్థాలు ఏమీ లేవు. ఏకమేవ ఆసీత్– సత్తుకు సజాతీయమైన వస్తువులు ఏమీ లేవు. అద్వితీయం ఆసీత్– సత్తుకు స్వగత భేదం లేదు. లోకంలో మనం ఏ వస్తువును చూచినప్పటికీ విజాతీయభేదం, సజాతీయ వేదం స్వగత భేదం –అనే వాటిని మనం చూడగలము. అయితే, సత్ అని చెప్పబడే పరబ్రహ్మకు ఇటువంటి భేదాలు ఏమి లేవు –అని అంటారు, అద్వైతులు.

ఈ విధంగా సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన చిన్మాత్రం బ్రహ్మ ఒక్కటే పరమార్థం– అనేది అద్వైతుల పక్షం. సత్ అనేది ఒక్కటే పరమాత్మ తత్వం. అంతకంటే వేరైన, సకల పదార్థాలు, అంటే, జగత్తు అంతా మిథ్యాపదార్థాలు. బ్రహ్మ సత్యం, జగత్తు మిథ్య అనేది వేదాంత డిండిమం. వేదాంతం బ్రహ్మను సత్యం అని మాత్రం చెప్పలేదు, జగత్తు మిథ్య అని కూడా చెబుతున్నది. "బ్రహ్మ సత్యత్వం ప్రపంచ మిథ్యాత్వం" అని బ్రహ్మకు సత్యత్వం చెప్పాలి. బ్రహ్మకంటే రెండవది లేదు.

సజాతీయ భేద విజాతీయ భేద స్వగతభేదరూప విశేష విశిష్టమని అంటే బ్రహ్మం సవిశేషం అవుతుంది. అయితే, బ్రహ్మం ఈ విధంగా సవిశేషం కాదు.. దానికి

సమానమైనది ఇంకొకటి లేదు, అంటే, బ్రహ్మకు సజాతీయమైన జీవుడు లేడు, బ్రహ్మకు విజాతీయమైన ప్రపంచం కూడా లేదు. బ్రహ్మకు స్వగతమైన కళ్యాణ గుణాలు లేవు. అందుచేత సదేవ, ఏకమేవ, అద్వితీయం. సజాతీయ భేదం లేకుండా, విజాతీయ భేదం లేకుండా, స్వగతభేదం లేకుండా, ఏ విధమైన బేధం లేకుండా, నిర్మిశేష చిన్మాత్రమే బ్రహ్మం. అది జ్ఞాన మాత్ర స్వరూపంగానే ఉంటుంది. ఆనంద జ్ఞాన మాత్ర స్వరూపంగా ఉంటుంది. బ్రహ్మకు ఇంకొక జ్ఞానమాత్ర స్వరూపమై ఉండే సజాతీయం లేదు. అజ్ఞాన స్వరూపమైనది ఇంకొకటి లేదు. ఆ జ్ఞానానికి కూడా జ్ఞానం లేదు. ఇదే ఆదిశంకరుల మతం.

అద్వైతులు చెప్పే ఈ అభిప్రాయం ఏ వేదవాక్యానికి పొసగేది కాదు. ఆ వేదవాక్యంలో నిర్విశేష అద్వైతం చెప్పబడలేదు.విశిష్టాద్వైతమే చెప్పబడింది. సవిశేష బ్రహ్మమే చెప్పబడింది. ఈ వాక్యం అద్వైతుల సిద్ధాంతానికి బాధకం, విశిష్టాద్వైత సిద్ధాంతానికి సాధకం– అనే విషయాన్ని శ్రీ రామానుజులు శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలలో విశదంగా నిరూపించారు. ఈ వేదాంత వాక్యం యొక్క అర్థాన్ని మనం అనుభవంలో తెచ్చుకున్న వారమే అయితే, విశిష్టాద్వైతం అంటే ఏమిటి? అనే సంగతిని మనం ఒక విధంగా తెలుసుకోవడానికి వీలవుతుంది.

మొదట, ఈ శ్రుతి వాక్యానికి ఆదిశంకరులు చూపిన అర్థం పూర్తిగా పొసగదు. అది ప్రత్యక్ష ప్రమాణ విరుద్ధం. శ్రుతి ప్రమాణ విరుద్ధం –అని అంటున్నారు, శ్రీరామానుజులు. సత్ అనబడే బ్రహ్మకంటే వేరైన విజాతీయ వస్తువులు లేవు –అని అంటే, ప్రత్యక్షంలో గోచరించే వస్తువులను ఏ విధంగా నిర్వహించాలి? విజాతీయమైన అచిత్ వస్తువులు ప్రత్యక్ష సిద్ధంగానే ఉన్నాయి కదా. అందుచేత, శంకరుల పక్షంలో ప్రత్యక్షానికి విరోధం వస్తున్నది.ఇంతేకాక,,సత్తు అనబడే బ్రహ్మకు విజాతీయమైన మహత్తు, అహంకారం వంటి తత్వాలను గూర్చి శ్రుతి స్పష్టంగానే చెప్పినందున, శ్రుతి విరోధమూ వస్తుంది. పరమాత్మ జ్ఞానస్వరూపుడుగాను జ్ఞానగుణకుడుగాను ఉండేవాడు. కనుక, బ్రహ్మకు

సజాతీయమైన భేదం ఉన్నది. సత్తుకు స్వగత భేదం లేదు –అని అంటే, అద్వైతులే "బ్రహ్మం ఏకం, బ్రహ్మం నిత్యం, బ్రహ్మం స్వయం ప్రకాశం "అని అంటున్నారు. ఈ గుణాలు బ్రహ్మకు లేవు– అని అంటే,అది ఘటపటాదివస్తువుల వలె అవుతుంది. బ్రహ్మకు కల ఏకత్వం, దానికి జాతి భేదం లేదు–అని అనేది కూడా ఒక గుణం అవుతున్నది. బ్రహ్మకు అద్వైతులచే అంగీకరింపబడిన నిత్యత్వం కూడా ఒక గుణం అవుతున్నది. అందుచేత, బ్రహ్మకు స్వగత భేదమనేది దానికి అద్వైతులు ఒప్పుకునే స్వభావాల చేతనే సిద్ధిస్తున్నది. శ్రుతులు, స్మృతులు పరమాత్మ యొక్క కళ్యాణ గుణాలను అపారంగా వర్ణిస్తున్నాయి. ఈ విధంగా విజాతీయ సజాతీయ స్వగత భేదాలు బ్రహ్మకు ఉన్నాయి– అనేది ప్రత్యక్ష సిద్ధమై ఉన్నందున, ఈ శ్రుతి వాక్యానికి అద్వైతులు చెప్పే అర్థం అనుపపన్నం, పొసగదు –అని భగవద్రామానుజులు నిరూపించారు.

ఇదం –అని అంటే నానాత్వం, ఏకం అంటే– నానాత్వానికి విరుద్ధమైన సూక్ష్మదశ– అని అంటున్నారు, మన పూర్వాచార్యులు. ఈనాడు చూస్తే మనకు వేయి కుండలు, వేయి ప్రమిదలు, వేయి మూకుడులు కనిపిస్తున్నాయి. నిన్న ఏమి ఉన్నది? అని అంటే, అంతా ఒకే మట్టి ముద్దగా ఉన్నది. ఆ విధంగానే, ఈనాడు చూస్తే దేవ తిర్యక్ మనుష్య స్థావరాలుగా ఎంతగానో విచిత్రమైన ఆకారాలలో ఈ జగత్తు ఉన్నది. అయితే, నిన్న ఏ విధంగా ఉన్నది? అని అంటే, (ప్రళయ కాలంలో ఏ విధంగా ఉన్నది? అని అంటే,) ఒకే అవస్థను ఆ ప్రకృతి పొందినదిగా ఉన్నది. ఆ ప్రకృతి " తమః పరే దేవ ఏకీభవతి" అని చెప్పిన విధంగా పరమాత్మలో ఏకమై ఉన్నది. దానిని పరమాచార్యులైన నమ్మాళ్వారులు కూడా "ఒన్రుమ్ తేవుమ్" అనే పాశురంలో తెలియజేశారు. అంటే, పరమాత్మలో ఏకమై ఉండే ఆ ప్రకృతిని ప్రాకృతంగా కావాలని భగవంతుడు సంకల్పించి, జగదాకారంగా పరిణమింపజేశాడు –అని పైన పాశురంలోని విషయం. అదే ఇక్కడ చెప్పబడుతున్నది– " సదేవ సౌమ్య" అని అంటూ. సూక్ష్మావస్థగా ఉండే జగత్తు, ఏకమేవ –నామరూప విభాగానర్హంగా ఉన్నది. నామరూప

విభాగానర్హంగా అని అంటే ఏమి? అన్నిటికీ రూపం ఉన్నది. ఈ నామరూపాలు అన్నీ సృష్టి కాలంలో ఉన్నాయి.ప్రళయ కాలంలో ఇవి నామరూపాలను కోల్పోయి, సర్వస్థంగా ఉన్నవి. ఈ విషయం, అంటే, నామరూపాలను కోల్పోయి సర్వస్థంగా ఉన్నాయి– అనే విషయం ఈడు వ్యాఖ్యానంలో పలు చోట్ల సూచింపబడడాన్ని గమనించవచ్చు. ఆళ్వార్లు భగవంతుని కారణత్వాన్ని ఎంత విశిష్టంగా పలుచోట్ల ప్రస్తావించారో, అక్కడ అంతా నంబిళ్ళై తమ ఈడు వ్యాఖ్యానంలో ప్రలయకాలంలో ప్రకృతి అనేది నామరూప విభాగాలను కోల్పోయి, సర్వస్థమై ఉండే విషయం చెప్పబడడానికి మనం గమనించవచ్చు. "ఏకమేవ"– ఈ విధంగా ప్రళయ కాలంలో ఏకత్వం, సృష్టి కాలంలో నానాత్వం. ఏకత్వం అంటే ఏమి? నానాత్వం అంటే ఏమి? ఏకత్వం అని అన్నా, ఈ జగత్తే. నానాత్వం అన్నా, ఈ జగత్తే. ఈ జగత్తే ప్రలయకాలంలో ఏకంగానూ, సృష్టి కాలంలో అనేకంగా ఉన్నది, ఇందుచేత, సృష్టి కాలంలోనూ జగత్తు ఉన్నది, ప్రలయ కాలంలోనూ జగత్తు ఉన్నది. అయితే, ప్రళయకాలల జగత్తు ఒకటిగానే ఉన్నది. ప్రకృతి అని చెప్పేటట్లుగా ఉన్నది తప్ప, విచిత్రమైన ఆకారం దానికి అప్పుడు లేదు. సృష్టి కాలంలో అయితే ఈ జగత్తు నానాకార విశిష్టమై ఉన్నది. అందుచేత, విచిత్రమైన ఆకారం ఉన్నందున, నానాత్వం ఏర్పడింది. ఇది ప్రళయకాలంలో లేకుండా ఉన్నందున ఏకత్వం ఉన్నది. అందుచేత, " ఏకత్వే సతి నానాత్వం, నానాత్వేసతి చైకథా" అనే వచనాన్ని ఉదాహరించి, ఈ వేదాంతవాక్యానికి ఈ విధంగానే అర్థం గ్రహించాలి –అని మన స్వామి భగవద్రామానుజులు అత్యద్భుతంగా అనుగ్రహించారు. వేదార్థ సంగ్రహంలో– కారణమై ఉన్నది బ్రహ్మమే, కార్యమై ఉన్నది బ్రహ్మమే. కారణము బ్రహ్మమే, కార్యమూ బ్రహ్మమే. కారణ బ్రహ్మం కూడా విశిష్ట బ్రహ్మమే, కార్య బ్రహ్మ కూడా విశిష్ట బ్రహ్మమే. ఈ రెండు విశిష్ట బ్రహ్మలకు అద్వైతం చెప్పే సంప్రదాయంగా ఉన్నందున, "విశిష్టయోః అద్వైతం విశిష్టాద్వైతం" అని అన్నారు, శ్రుతప్రకాశికాచార్యులవారు. ఇది చాలా ముఖ్యంగా తెలియవలసిన విషయం.

ఈ ఉపనిషత్ వాక్యం మొదట "ఏకమేవ" అని, తరువాత "అద్వితీయం" అని తెలుపుతున్నది.. దీనికి ఏమి అర్థం? అనే విషయాన్ని భగవద్రామానుజులు తమ గ్రంథాలలో చాలా చోట్ల తెలియజేశారు. వారి అభిప్రాయాన్ని శ్రుతప్రకాశికాచార్యులవారు కూడా ఆ విధంగానే వివరించారు. చాలా లోతుగా అనుభవించవలసిన విషయం ఇది. "ఏకమేవ" అనేదానికి అభిప్రాయం ఏమి? ఇప్పుడు నానాత్వం ఏకమేవ అన్నందున, అప్పుడు సూక్ష్మాకారం, ఇప్పుడు స్థూలాకారం. ఇప్పుడు ఘటశరావాదులుగా ఉండే వస్తువులు అప్పుడు మృత్పిండమై ఉన్నవి అన్నట్లే. ఇప్పుడు సృష్టికాలంలో ప్రకృతి ప్రాకృతాలుగా ఉన్నది. అప్పుడు, అంటే, ప్రళయ కాలంలో ప్రకృతి ప్రకృతిగానే ఉన్నది. అందుచేత, ఈ విధంగా దానికి, దీనికి ఉండే వస్త్వైక్యం. ఇదే ముఖ్యం. అంటే, ఇప్పుడు ఉన్నది ప్రకృతియే. అప్పుడు ఉన్నది ప్రకృతియే. ఇప్పుడు ఉన్నది బ్రహ్మమే, అప్పుడు ఉన్నది బ్రహ్మమే. ఇప్పుడు ప్తాకృత విశిష్టమైన బ్రహ్మం, అప్పుడు కూడా ప్రకృతి విశిష్టమైన బ్రహ్మమే. ప్రకృతి ప్రకృతియై ఉన్నది.—ప్రళయ కాలంలో. అదే ప్రకృతి ప్రాకృతమైన దశావిశేషాన్ని పొందినది— సృష్టికాలంలో. ఈ విధంగా భగవంతుడు ఇప్పుడు ఏ విధంగా ఉన్నాడు? ప్రాకృత విశిష్టమై ఉన్నాడు. ప్రళయ కాలంలో ఏ విధంగా ఉన్నాడు? ప్రకృతి విశిష్టమై ఉన్నాడు. ప్రకృతి ప్రకృతియే. ప్రాకృతం కూడా ప్రకృతియే. అది కూడా అచిత్తే. ఇది కూడా అచిత్తే. అది సూక్ష్మమైన దశ. ఇది స్థూలమైన దశ. ఈ విధంగా సూక్ష్మ చిదచిద్విశిష్టబ్రహ్మం అనేది కారణ బ్రహ్మం. స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మం అనేది కార్య బ్రహ్మం. ఈ విధంగా కారణ బ్రహ్మకు, కార్య బ్రహ్మకు అద్వైతాన్ని చెప్పే సంప్రదాయమే "విశిష్టయోః అద్వైతమ్" అనేది.

ఇక్కడ ఇంకా విశేషంగా తెలియవలసిన విషయం యథార్థం ఒకటి ఉన్నది. నమ్మాళ్వార్లు దీనిని చాలా స్పష్టంగా మనకు తెలియజేశారు. వారికి నాయికా భావం. కలిగింది. ఆ దశలో వారు ఉపదేశ ముద్రను ధరించారు. పరాంకుకుశ నాయికతల్లి చూస్తున్నది. తాను కన్న కుమార్తె ఏనాడూ పాఠశాలకు వెళ్లిన సమయం లేదు ఒక అక్షరం కూడా ఆమె నేర్చుకున్నది లేదు. అయినప్పటికీ ఆమె జ్ఞానముద్రను ధరించి

ఉన్నదే. జ్ఞానముద్రను ధరించి ఉంటే మాత్రం చాలునా! నోటిని తెరిచి ఏదైనా మాట్లాడుతుందా? అని ఆమె చూచింది. వెంటనే పరాంకుశ నాయిక పాశురాలను పాడడం ఆరంభించినది.. “ కడల్ ఞాలమ్ శెయ్ దేనుమ్ యానే” అని అంటూ పాశురాలను పాడడం ఆరంభించింది. అళ్వార్లు పరమవైదికసార్వభౌములు. నమ్మాళ్వారుల కంటే పరమవైదికులు ఇంకొకరు ఉన్నారా! పరమ వైదికులైన అళ్వారులు శ్రుతిచ్ఛాయలో, వేదాంతచ్ఛాయలో వేదాంతార్థాన్ని విశదీకరించగలిగిన తిరువాయ్ మొళ్ళిలో పాడిన ఈ పాశురం చాలా అర్థపుష్టి కలిగినది. మొదటి పాదంలోనే తాను జగత్తును సృష్టించాను– అని అన్నారు. తరువాత పాదంలో తాను జగత్తుగా అవుతున్నాను– అని అన్నారు– “ కడల్ ఞానమ్ ఆవేనుమ్ యానే” అనే పాదంలో. ఇక్కడ “ఆవేనుమ్” అనే పదంలోనే మన విశిష్టాద్వైత సంప్రదాయం యొక్క జీవనాడి ఉన్నది. “ కడల్ ఞానమ్ శెయ్ దేనుమ్” అని చెప్పడంలో విశేషం లేదు. “ కడల్ ఞానమ్ ఆవేనుమ్ యానే” అనేదే చాలా విశేషమైనది.

ఈ తత్త్వాన్ని కొంచెం వివరిస్తాను. కుమ్మరివాడు ఉన్నాడు. అతడు మట్టిని చూస్తున్నాడు. “మన్ను చాలా ఉన్నది. ఈ మన్నుతో నిండుగా మూకుళ్ళు, బానలు, ప్రమిదలు మొదలైనవానిని చేసి ధనాన్ని సంపాదించవచ్చు” అని అతడు భావిస్తున్నాడు. ఇక్కడ “నిండుగా మూకుళ్ళను, బానలను, ప్రమిదలను చేస్తాను” అనే కుమ్మరివాడు సంకల్పించడం తప్ప, “నేనే మూకుడుగా, చట్టిగా, బానలుగా అవుతాను” అని సంకల్పించడం సాధ్యం కాదు. ఎందుకంటే, కుమ్మరివాడు మూకుడు, చట్టి, బానలను చేయడానికి నిమిత్త కారణం మాత్రమే. చట్టి, బానలుగా కావడం మన్నే తప్ప, కుమ్మరివాడు ఆ విధంగా కావడం సాధ్యం కాదు. అందుచేత మన్నుతో చేయబడ్డ కుండకు మన్ను ఒక కారణం అవుతున్నది. అది ఉపాదాన కారణం అవుతున్నది. కుమ్మరివాడు ఒక కారణం. అతడు నిమిత్త కారణం అవుతున్నాడు. అందుచేత, కుండ పుట్టడానికి మన్ను ఒక కారణం, కుమ్మరివాడు మరొక కారణం. మన్ను లేకపోతే కుండ పుట్టడం జరగదు. కుమ్మరి వాడు లేకపోయినా కుండ పుట్టదు. అయితే, జగత్తుకు

భగవంతుడు ఏ విధంగా అవుతున్నాడు? అని అంటే, అతడే ఉపాదాన కారణంగా అవుతున్నాడు? అంటే, అతడే జగత్తుకు ఉపాదాన కారణం అవుతున్నాడు. అతడే నిమిత్త కారణంగా కూడా అవుతున్నాడు. భగవంతుని ఉపాదాన కారణత్వాన్ని చెప్పే శబ్దాలే "ఏకమేవ" అనేవి. అతడు తప్ప వేరు ఏ నిమిత్త కారణం లేదం—అని చెప్పడం కోసం వచ్చినది "అద్వితీయం" అనే పదం. ఈ విధంగా తాత్పర్యార్థాన్ని అనుగ్రహించారు, మన స్వామి భగవద్రామానుజులు. ఇదే మన సిద్ధాంతం. అభిన్న నిమిత్తోపాదాన కారణం బ్రహ్మం. ఇది వేదాంతంలోని పరమార్థం— అని అంటున్నారు, భగవద్రామానుజులు.

ఈ విధంగా లోక రీతిలో చూసినప్పుడు ఘటానికి కారణాలు అనేకం ఉన్నాయి. అయితే, ప్రపంచానికి పరమాత్మ కారణం అంటే, అతడే, అతడు మాత్రమే, అతడు ఒక్కడే కారణం అవుతున్నాడు. అతడే నిమిత్త కారణమై ఉన్నాడు. అతడే ఉపాదాన కారణమై అవుతున్నాడు.అతడే సహకారి కారణంగా కూడా అవుతున్నాడు. భగవంతుని కారణత్వాన్ని నిరూపించే రెండవ పదంలో నమ్మాళ్వారులు ఈ యథార్థాన్ని చాలా ఆశ్చర్యకరంగా అనుగ్రహించారు. "వేర్ ముదలాయ్ విత్తాయ్" (2–8). ఇది చాలా ఆశ్చర్యకరమైన ప్రయోగం. వేర్ అంటే కారణం. చెట్టుకు వేరు కారణం అని మనకు తెలుసు. ముదల్ అంటే ఏమి? కారణం. విత్తు అంటే ఏమి? కారణం. వేర్ అన్నా కారణమే, ముదల్ అన్నా కారణమే, విత్తు అన్నా కారణమే. ఈ విధంగా నమ్మాళ్వారులు కారణత్వానికి వాచకమైన మూడు శబ్దాలను ఎందుకు ప్రయోగించారు? అని అంటే,,త్రివిధ చిదచిత్తులకు త్రివిధ కారణం తానే అవుతున్నందున ఈ విధంగా ప్రయోగించారు –అని అంటున్నారు, మన పూర్వాచార్యులలో ఒకరైన అ*ழ*గియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్. ఆచార్య హృదయం అనే గ్రంథం నాలుగవ ప్రకరణంలో రెండవ దశకంలోని అర్థాన్ని తెలియజేసే రెండవ చూర్ణికయొక్క పరమ రహస్యార్థం ఇది. ఈ సందర్భంలో "లీలావిభూతిలో సంకల్పవిశిష్ట వేషంలో నిమిత్తంగాను, సూక్ష్మ విశిష్ట వేషంతో ఉపాదానంగాను జ్ఞానశక్త్యాది

గుణ విశేష విశిష్టవేషంతో సహకారిగాను, నిత్యవిభూతిలో ఇచ్ఛావిశిష్ట వేషంతో నిమిత్తంగాను, అప్రాకృత అచిజ్జీవ విశిష్ట వేషంతో సహకారిగాను, ఈ విధంగా బద్ధముక్త నిత్యరూపమైన చిత్త్రయానికి,ప్రాకృత అప్రాకృత కాలరూపమైన అచిత్త్రయానికి త్రివిధ కారణం తానే అయిన సర్వేశ్వరుడు" —అని శ్రీ వరవరమునులు అనుగ్రహించిన శ్రీ సూక్తులు ఇక్కడ అనుసందేయాలు.

భగవంతుడు జగత్తుకు ఉపాదాన కారణమై ఉన్నాడు, నిమిత్తకారణమై ఉన్నాడు,,సహకారి కారణమై ఉన్నాడు —అని పరమ వేదాంతార్థం. దీనికోసమే వేదవ్యాసులు ఒక అధికరణాన్ని అనుగ్రహించారు.

మొదటి అధ్యాయంలో 35 అధికరణాలు 34వ అధికరణం ప్రకృత్యధికరణం(1—4—7) అని అనబడుతున్నది ఇందులో మొదటి సూత్రం "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" అనేది. బ్రహ్మం ఉపాదాన కారణంగా కూడా అవుతున్నది. ఈ విధంగా గ్రహిస్తేనే ప్రతిజ్ఞ,దృష్టాంతం అనే రెండు విరోధించకుండా ఉంటాయి. కనుక —అని దానికి అర్థం. ఈ సూత్రానికి పూర్వపక్షం ఏమంటే, పరమాత్మ జగత్తుకు నిమిత్తరణంగా మాత్రమే తప్ప, ఉపాదాన కారణం అయ్యే అవకాశం లేదు —అనేది.

శైవులు అనేవారు కొందరు ఉన్నారు. వారు వేదాంతార్థాలను అన్నిటినీ చెప్పడానికి ముందుకు వస్తున్నారు. వారు ఏమని చెబుతున్నారు? అని అంటే, జగత్తుకు పరమాత్మ పరమశివుడు. అతడు ఉపాదాన కారణం కాదు. నిమిత్త కారణం మాత్రమే. అయితే, ఉపాదాన కారణం శివుడు కాదు, అది ప్రకృతి —అని వారు అంటున్నారు. పరమాణువులు జగత్తుకు ఉపాదాన కారణం —అని చెప్పేవారు కొందరు ఉన్నారు. ఏ విధంగా గ్రహించినప్పటికీ, ఈ విషయంలో మతభేదం ఉన్నది నిమిత్తోపాదన కారణాలకు ఐక్యాన్ని చెప్పినవారు లేరు, శైవ మతంలో. అయితే, మన

సంప్రదాయంలో జగత్తుకు నారాయణుడు నిమిత్త కారణం అవుతున్నాడు, ఉపాదాన కారణం అవుతున్నాడు, సహకారి కారణమూ అవుతున్నాడు. ఇవి అన్ని సృష్టికి పూర్వం ప్రలయ కాలంలో ఒకటిగానే ఉన్నాయి. దీనికి ఏకత్వం అని సృష్టికాలంలో పేరు. ఈనాడు అనేకంగా ఉండే ఈ జగత్తు దర్శనమిస్తున్నది దీనికి నానాత్వం అని పేరు. అది కారణ కాలం. ఇది కార్యకాలం. అది కారణావస్థ. ఇది కార్యావస్థ. అది సూక్ష్మావస్థ, ఇది స్థూలావస్థ. అభిన్న నిమిత్తోపాదాన కారణం బ్రహ్మం అని చెప్పే వేదాంతం ఏమి చేసింది? అని అంటే, బ్రహ్మం ఉపాదాన కారణం అనే అర్థాన్ని చూపించింది.—"ఏకమేవ" అనే శబ్దంతో. దానికంటే వేరైన నిమిత్త కారణం ఉన్నదా? అనే విచారం రాగా, రెండవదిగా నిమిత్త కారణం అనేది ఇంకొకటి లేదు, బ్రహ్మమే నిమిత్త కారణం— అని చెప్పడం కోసం ఏర్పడినది—" అద్వితీయమ్" అనే పదం.

అద్వితీయం అనే పదంతో చెప్పబడిన విషయం నిమిత్తాంతర నిషేధం— అని మన స్వామి భగవద్రామానుజులు వ్యాఖ్యానించారు. ఈ ఉపాదాన కారణాన్ని చెప్పేటప్పుడే, "కార్యకారణయోః అభేదః, కార్యకారణయోః అద్వైతం". అంటే, కారణబ్రహ్మం, కార్యబ్రహ్మం అని ఈ రెండు విశిష్ట బ్రహ్మలకు అద్వైతం చెప్పే సంప్రదాయమే విశిష్టాద్వైతం. ఇందులో ముఖ్యంగా, చాలా స్పష్టంగా తెలియవలసిన యథార్థం ఒకటి ఉన్నది. దానిని శ్రుతప్రకాశికాచార్యులవారు ఒక అద్భుతమైన దృష్టాంతమూలంగా వివరించి చూపించారు

. 20 సంవత్సరాలకు ముందు ఒక బిడ్డను కలకత్తాలో చూశాము. ఇప్పుడు మద్రాసు నగరంలో 20 సంవత్సరాలు గడిచిన తరువాత అదే బిడ్డను యవ్వన ప్రాయంలో చూశాము. ఈ విధంగా ఆ బిడ్డ ఈనాడు యువకుడుగా ఉన్నాడు. అతడే ఇతడు. ఆనాడు చూసినప్పుడు రెండు సంవత్సరాల వయస్సు. ఈనాడు చూసినప్పుడు 22 సంవత్సరాల వయస్సు..ఇక్కడే శ్రుతప్రకాశికాచార్యుల వారు వ్యాఖ్యానం చేస్తున్నారు. ఒకనికే ఆ బాల్యం, యవ్వనం అనే రెండు అవస్థలు

చెప్పబడినప్పటికీ, ఈ రెండు ఒకే కాలంలో ఉన్నాయా? అంటే, అవి లేవు. ఈ దృష్టాంతమూలంగా తెలియబడే అర్థం ఏమి? అంటే, సూక్ష్మావస్థ, స్థూలావస్థ అనే రెండు ఒకదానికి వెంట ఒకటిగా, కాలాధీనంగా చెప్పవచ్చు తప్ప, ఏక కాలావచ్ఛిన్నంగా చెప్పడం వీలు కాదు.భగవంతునకు ఏకత్వం, నానాత్వం—అనే రెండు ఏకకాలంలో లేవు. ఏ కాలంలో ఏకత్వమో, ఆ కాలంలో నానాత్వం లేదు. ఏ కాలంలో నానాత్వమో, ఆ కాలంలో ఏకత్వం లేదు. కారణ కాలంలో కార్యావస్థ లేదు. కార్యావస్థలో కారణావస్థ లేదు. "అగ్రే "అనే కాలంలో, అంటే, ప్రళయ కాలంలో పరమాత్మ సూక్ష్మమైన చేతనా చేతనాలను శరీరంగా కలిగి, తాను విశిష్ట తత్వంగా ఉన్నాడు. ఈనాటి దినం, అంటే, సృష్టి కాలంలో అదే బ్రహ్మం స్థూల చేతనా చేతనాలను శరీరంగా కలవాడై, విశిష్ట బ్రహ్మగా ఉన్నాడు. కారణ బ్రహ్మయై ఉండేటప్పుడు ఉండే విశేషణం కార్యబ్రహ్మమై ఉండేటప్పుడు, అంటే, ఇప్పుడు లేదు. ఆ విధంగానే, కార్య బ్రహ్మమై ఇప్పుడు ఉండే విశేషణం కారణ బ్రహ్మమై అప్పుడు ఉండే స్థితిలో లేదు. దీనిని మనం తెలియాలి. చాలా ముఖ్యంగా తెలియవలసిన తత్వం ఇది. తిరుమ*ழி* ఆళ్వారులు దీనికి ఒక దృష్టాంతాన్ని తిరుచ్చంద విరుత్తం అనే ప్రబంధంలోని మొదటి పాశురంలో అనుగ్రహిస్తున్నారు.

పూ నిలాయ ఐందుమాయ్ ప్పునఱ్కణ్ నిన్ఱ నాంగుమాయ్
తీ నిలాయ మూన్ఱుమాయ్ చ్చిఱంద కాల్ ఇరణ్డుమాయ్
మీ నిలాయదొన్ఱుమాగి వేఱు వేఱు తన్మైయాయ్
నీ నిలాయ వణ్ణ నిన్నై యార్ నినైక్క వల్లరే?

అనేది ఆ ప్రబంధంలోని మొదటి పాశురం.తరువాత, పదవ పాశురంలో దీనిని వివరిస్తున్నారు. మొదటి పాశురంలో చెప్పబడిన సామానాధికరణ్యానికి ఉపయోగకరమైన భావంలోని అర్థాన్ని నిర్వహించే రీతిలోని ప్రకరణంవలె ఉన్నది, పదవ పాశురం. ఆ పాశురం ఈ క్రింది విధంగా ఉన్నది.

తన్నుళే తిరైత్తెழுమ్ తరంగ వెణ్ తడమ్ కడల్
తన్నుళే తిరైత్తెழுమ్ తడంగుకిన్ఱ తన్మైపోల్,
నిన్నుళే పిఱందిరుంది నిఱ్పవుమ్ తిరిబవుమ్
నిన్నుళే అడంగుకిన్ఱ నీర్మై నిన్ కణ్ నిన్ఱదే.

ఈ పాశురంలో ఉపాదాన కారణమైన భగవంతునకు ఒక రీతిలో సముద్రాన్ని దృష్టాంతంగా అళ్వార్లు పలుకుతున్నారు. వాయువుచేత సముద్రం ఉప్పొంగి, అలలు దాని నుండి పైకి లేస్తున్నాయి. తరువాత ఆ అలలు ఆ సముద్రంలోనే అణగి పోతున్నాయి.భగవంతునకు జలధి అని పేరు. కరుణాజలది అని అన్నా సరియే. వాత్సల్య సాగరం అని అన్నా సరియే. సౌశీల్య సాగరం అని చెప్పినా సరియే. సముద్రంలో వీచే గాలి చేత ఉప్పొంగి లేచే అలలు, తరువాత ఆ సముద్రంలోనే అణగిపోయేటట్లు, భగవంతునకు శరీరంగా ఉండే చేతనాచేతనాలు కూడా. భగవంతునిలోనే పుట్టి అణగిపోతాయి. వీటి సృష్టి మొదలైనవి అన్నీ భగవంతుని స్వరూపంలో అణగి ఉన్నాయి– అని అంటున్నారు భక్తిసారమునీంద్రులు. చేతనా చేతనాలు వికాసాన్ని పొందితే, అది సృష్టి అని, అవి సంకోచాన్ని పొందితే, అది సంహారం అని చెప్పబడుతున్నది. ఈ దృష్టాంతంలో– సముద్ర స్థానంలో భగవంతుడు, వాయు స్థానంలో అతని సృష్టిసంహార సంకల్ప విశేషాలు, కెరటాల స్థానంలో సృష్టి సంహారాలు చెప్పబడ్డాయి.

" మొదటి పాశురంలో చెప్పబడిన ఉపాదాన కారణత్వాన్ని పదవ పాశురంలో దృష్టాంత సహితంగా పలికి ఉపసంహరింపబడినది "అనే శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యఖ్యాన శ్రీసూక్తులు అనుసంధేయాలు.

అందుచేత, బ్రహ్మం ఎల్లప్పుడూ విశిష్ట బ్రహ్మమే.మనం ఎల్లప్పుడూ అతనితో కూడినవారంగానే ఉన్నాము సృష్టికాలంతో, ప్రళయకాలంతో తేడా లేకుండా, పరమాత్మ సంబంధం లేని కాలమే లేదు– అనే ఈ వాస్తవమే మన విశిష్టాద్వైత సిద్ధాంతంలోని పరమమైన అభిప్రాయం. ఇది "విశిష్టయోః అద్వైతం విశిష్టాద్వైతమ్" అనేదానిని అనుసరించిన అర్థం.

ఇక, తరువాత, "విశిష్టస్య అద్వైతం విశిష్టాద్వైతమ్" అనేదానికి తగినట్లు అనుభవించవలసిన అర్థవిశేషం ఒకటి ఉన్నది. అది "చేతనాచేతనప్రకారం ఏకమేవ తత్త్వమ్" అనేది. శ్రీవేదాంత దేశికులు న్యాయ సిద్ధాంజనం ఆరంభంలో "అశేష చిదచిత్ ప్రకారం బ్రహ్మ ఏకమేవ తత్త్వమ్" అని అనుగ్రహిస్తున్నారు. అందుచేత మనం మన సంప్రదాయ రీతిలో తత్త్వం ఒకటే– అని చెప్పవచ్చు. దీనివల్ల తెలియబడే అర్థం ఏమి అంటే, ఇటువంటి చేతనాచేతన విశిష్టమైన దివ్యమంగళ విగ్రహ విశిష్టమైన, కళ్యాణగుణ విశిష్టమైన బ్రహ్మం రెండవది ఇంకొకటి లేదు– అనేది. అంటే, చేతనా చేతన విశిష్టమైన బ్రహ్మ వలె ఉండే రెండవ చేతనాచేతన విశిష్ట బ్రహ్మం అనేది లేదు అని అర్థం.

అద్వితీయం అని బ్రహ్మను గూర్చి వేదాంతం చెప్పింది. ఈ అద్వితీయ శబ్దానికి అర్థం ఏమి? అని ప్రశ్నించి, ఆశ్చర్యకరమైన అభిప్రాయాన్ని అనుగ్రహించారు, పరమాచార్యులైన శ్రీయామునులు– వారు అనుగ్రహించిన దివ్య గ్రంథమైన సిద్ధిత్రయంలో. "అద్వితీయం అంటే రెండవది లేదు– అనేదే అర్థం. అయితే, రెండవది లేదు అనేదానికి "బ్రహ్మ ఒక్కటే సత్యం, దానికంటే భిన్నమైన వస్తువు అయిన రెండవది లేదు" అని ఈ విధంగా అద్వైతులు చెప్పేటట్లుగా అర్థం కాదు. ఈ విషయాన్ని చాలా అందంగా వివరించి చూపించారు ఆ ఆచార్యులు.

శ్రీ నాథమునులు ఉత్తరదేశంలో యమునానదీ విషయంలోనూ, యమునానదీతీరవిహారి అయిన శ్రీకృష్ణుని విషయంలోనూ చాలా అభినివేశాన్ని

కలిగినవారు కనుక, వారి నియమనానికి అనుగుణంగా "యమునై త్తుఱైవర్" అనే నామకరణం చేయబడినవార్తె, తరువాత చోళరాజు ఆస్థానంలో జరిగిన వాద యుద్ధంలో జయించి, అప్పుడు ఏర్పడిన ఆళవందార్ అనే తిరునామాన్ని కలిగినవారు కనుక, యామునులు ప్రభువును మనస్సులో పెట్టుకొని ఆశ్చర్యకరంగా ఇక్కడ వివరిస్తున్నారు. చోళదేశప్రభువును ఒక విద్వాంసుడు " నీవు అద్వితీయుడవు" అని కీర్తించి, బహుమానాన్ని పొందాడు. దీనిని చూసిన కొందరు, రాజు దగ్గరకు వచ్చి "మీకు పత్నీ పుత్రులు, రాజ్యం, గుణాలు, గొప్పతనం, కీర్తి అన్నీ ఉండగా, మిమ్ములను చూసి "రెండవది ఏమీ లేనివాడవు అద్వితీయుడవు" అని చెప్పి ఇతడు వెళుతున్నాడే! " అని ఆక్షేపించగా, ప్రభువు కూడా ఆ విద్వాంసుని చూసి, "అద్వితీయుడు అంటే ఏమి?" అని అడిగాడు. దానికి ఆ పండితుడు " నీవు అద్వితీయుడవు అంటే, పత్ని, పుత్రుడు, రాజ్యం, ధనం, కీర్తి ఏమీ లేనివాడవు– అని అర్థం కాదు. నీతో సమానంగా పత్నీపుత్రులను, ధనాన్ని పొందినవాడు ఇంకొకనిని లేనివాడవు నీవు –అనేదే అర్థం" అని వివరించాడు.

ఈ విధంగానే, మన సంప్రదాయంలో కూడా "అశేష చిదచిత్ ప్రకారం బ్రహ్మ ఏకమేవ తత్త్వం". అంటే – ఇంకొక ప్రకారితత్త్వం లేదు. దీనిని "ప్రకారి అద్వైతం" అని అంటారు. మన పెద్దలు. అశేషచిదచిత్ ప్రకారం తత్త్వం. అన్ని చేతనాచేతనాలను తనకు ప్రకారంగా కలవాడు భగవంతుడు. అంత మాత్రమే కాకుండా, సమస్త కళ్యాణ గుణాత్మకుడై ఉన్నాడు. అంతమాత్రమే కాదు, దివ్యమంగళవిగ్రహవిశిష్టుడుగా కూడా ఉన్నాడు. శ్రీభూనీలానాయకుడుగానూ ఉన్నాడు. ఈ విధంగా విశిష్టమై ఉండే తత్త్వానికి అద్వైతం, అంటే, వీటిని అన్నిటిని కలిగిన ఈ పరమాత్మవలె ప్రకారితత్త్వం వేరు ఏదీ లేదు– అనేదే మన సిద్ధాంతంలో పరమార్థం –అని అంటున్నారు, మన పూర్వాచార్యులు.

ఈ విధంగా "విశిష్టయోః అద్వైతం విశిష్టాద్వైతమ్" అని అంటే, అది కార్యకారణ భావం. " విశిష్టస్య అద్వైతం విశిష్టాద్వైతమ్" అని చెబితే ప్రకార ప్రకారి భావం. వేదాంతాలలో చెప్పబడిన అద్వైతం, ద్వైతం వంటి శబ్దాలన్నీ పైన చెప్పిన రీతిలో విశిష్టాద్వైతపరంగానే నిర్వహించి, యథార్థమైన తాత్పర్యార్థాన్ని మనం తెలుసుకోవాలి– అనేది మన పూర్వాచార్యులు, ప్రధానంగా, మన స్వామి భగవద్రామానుజులు మనకు చూపించిన దారి, ఈ విధంగా ఇదే అద్వైతం, ద్వైతం అనే పేర్లతో ప్రసిద్ధమై ఉండే రెండు మతాలను ఖండించేదై వెలుగుతున్నది, మన సిద్ధాంతం.

" యానుమ్ తానాయ్ ఒழிన్దానే" (తిరువాయ్ మొழி– 8 –8–4) అని నమ్మాళ్వార్లు అనుగ్రహించారు. ఈ పాశురాన్ని వ్యాఖ్యానం చేస్తూ ఈడు వ్యాఖ్యానంలో నంబిళ్ళై ఏమన్నారు అంటే, " ఐక్యం అనేదానికి అద్వైతులు చెప్పే రీతిగా స్వరూపైక్యం కాదు అర్థం. ఐక్యం అనేదానికి శరీర శరీర భావ నిబంధనమైన ఐక్యం– అని అర్థం. ఆ విధంగానే, భేదం అంటే భేదవాదులు చెప్పే శుద్ధ భేదం కాదు, అర్థం. భేదం అనేది స్వతంత్రమైన భేదాన్ని తెలుపదు. మన సిద్ధాంత ప్రకారం భేదం అనేదానికి శేష శేషిభావనిబంధనమైన భేదం అనేది అర్థం. శ్రుతప్రకాశికాభట్టర్ కూడా ఈ వాస్తవాన్ని వివరించారు. కారణం వేరు, కార్యం వేరు– అని కొందరు (వైశేషికులు) వాదిస్తారు. "కార్యకారణయోః భేద ఏవ " అనేది వారి సిద్ధాంతం కారణకార్యాలకు అద్వైతం, అనన్యత్వం లేదు –అని వారు చేసే వాదం. వీరు చెప్పే ఈ భేదాన్ని కుతర్క బ్రాంతి రూపమైన భేదం అని తమ శారీరక మీమాంసా శాస్త్రంలో శ్రీ వేదవ్యాసులు ఖండించారు. అంటే, కార్యం వేరు, కారణం వేరు అనేది కాదు. కారణం బ్రహ్మమే, కార్యం కూడా బ్రహ్మమే. కారణం మట్టిముద్దే, కార్యం కూడా మట్టిముద్దే. అవస్థా బేధం చెప్పవచ్చునే తప్ప, వస్తు భేదాన్ని చెప్పడానికి లేదు –అనేది మన సిద్ధాంతంలోని జీవనాడి అయిన అర్థం.

ద్వైత సంప్రదాయంలో కూడా భేదాన్ని అంగీకరిస్తారు. అటువంటి భేదాన్ని మనం ఒప్పుకోలేదు. స్వనిష్ఠ భేదం మన సిద్ధాంతంలో లేదు. స్వనిష్ఠం అంటే –స్వతంత్రం అని అర్థం. స్వతంత్రమైన భేదం మన సిద్ధాంతంలో లేదు. ప్రకృతి భిన్నమైనదే. జీవుడు కూడా భిన్నమైనవాడే. ప్రపంచం వేరయినదే. తత్వత్రయం కూడా వేరు వేరుగా ఉండే తత్వాలుగా ఉన్నప్పటికీ, అవి ప్రత్యేకంగా ఉంటాయా? అని అడిగితే, పరమాత్మకు లొంగకుండా జీవాత్మ లేడు, పరమాత్మకు అధీనం కాకుండా అచిత్తత్వం లేదు. ప్రకృతి కానీ, జీవుడు కానీ, ఏ తత్వం అయినప్పటికీ కూడా, అది స్వతంత్ర తత్వం కాదు. పరమాత్మకు పూర్తిగా పరతంత్రమైన తత్వంగా ఉన్నందువల్ల, ఈ తత్వాలు ప్రత్యేకంగా వస్తువులుగా ఉన్నప్పటికీ కూడా, అవి ఏ సమయంలోనూ ప్రత్యేకంగా పరమాత్మను విడచి ఉండలేవు– అనేది మన సంప్రదాయం. ఇవి ఎప్పుడూ పరమాత్మలో చేరి ఉండే తత్వాలుగానే ఉంటాయి. బ్రహ్మకు, జగత్తుకు మధ్య ఉండే సంబంధం నిత్యసిద్ధమైన సంబంధమే తప్ప, ఒకనాడు ఏర్పడి, ఒకనాడు లేకుండా పోయే సంబంధం కాదు. అద్వైతం అంటే "కార్యకారణయోః అనన్యత్వమ్" అనే వాస్తవాన్ని శ్రీ వేదవ్యాసులు స్పష్టంగానే తెలియజేశారు. ఇది పరమ వేదాంత తాత్పర్యం. " వాచారంభరణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అనే వేదాంత వాక్యంలో స్పష్టంగా చెప్పబడిన అర్థం ఇదే. "సదేవ, ఏకమేవ" అనే చోట్ల చెప్పబడిన విషయం ఇది –అని అంటారు, మన స్వామి భగవద్రామానుజులు. అందుచేత, "చేతనాచేతన విశిష్ట బ్రహ్మణః అద్వైతమ్ విశిష్టాద్వైతమ్" అనేది మన సిద్ధాంతంలోని పరమార్థం.

ఇక్కడ తప్పక తెలుసుకోవలసిన సత్యం ఒకటి ఉన్నది. మట్టికి వికారం కలుగుతున్నది. అది కుండగా మారుతున్నది. అయితే, బ్రహ్మకు వికారాన్ని ఒప్పుకొని, జగత్తుగా బ్రహ్మం పరిణమిస్తున్నట్టుగా చెబితే, నిర్వికారం బ్రహ్మ –అని వేదాంతం చెప్పే క్రమానికి విరోధం వస్తుంది. అందుచేత ఉపాదాన ఉపాదేయ భావం చెప్పేటప్పుడు శరీరాత్మ భావం తప్పక చెప్పి తీరాలి. శరీరాత్మ భావం చెప్పకుండా ఉపాదాన కారణత్వాన్ని నిర్వహించడం వీలు కాదు. "అవిద్యా విశిష్ట బ్రహ్మం

జగదుపాదన కారణం" అని అద్వైతులు అంటారు. చేతన చేతన విశిష్ట బ్రహ్మం ఉపాదాన కారణం —అనేది మన సంప్రదాయం.

ఈ విధంగా విశిష్టమైన బ్రహ్మకే ఉపాదాన కారణత్వాన్ని చెప్పడం సాధ్యమవుతుంది. శుద్ధ బ్రహ్మకు ఉపాదాన కారణత్వాన్ని ఎవరూ చెప్పలేదు, చెప్పలేరుకూడా. ఎందుకంటే, ఆ విధంగా చెబితే, "నిర్వికారం బ్రహ్మ "అనే వేదవాక్యం అర్థం లేనిదే అవుతుంది.

ఈ విధంగా మన సిద్ధాంతానుసారంగా మనం ఎల్లప్పుడూ పరమాత్మతో కూడినవారంగానే ఉన్నాము. అయితే. "ఇది లేకుండా భగవత్సంబంధం దుర్లభం" అని శ్రీవచనభూషణంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు (సూత్రం– 440) అన్నారు. అంటే, ఆచార్య సంబంధం లేకపోయినట్లయితే భగవత్సంబంధం లేదు– అని దీని అర్థం. ఎల్లప్పుడూ జీవాత్మ పరమాత్మల నిత్యయోగం ఉన్నందువల్ల, అంటే, అనాది సిద్ధంగా భగవత్సంబంధం ఉన్నప్పుడు, "ఆచార్య సంబంధం లేకపోతే భగవత్సంబంధం ఏర్పడదు",– అని సూత్రకారులు వర్ణనం చేయడానికి అభిప్రాయం ఏమి? అని ప్రశ్నించుకొని, ఈ సూత్ర వ్యాఖ్యానంలో దీనికి స్వామి మణవాళ మహామునులు అత్యాశ్చర్యకరంగా వివరణాన్ని అనుగ్రహించారు. అది ఏమంటే, భగవంతునకు జీవునకు మధ్య ఉండే సంబంధం అనాది సిద్ధం. ఈ సంబంధాన్ని ఇకమీదట క్రొత్తగా ఏర్పరచేవారు ఎవరూ లేరు. అయితే, అతనికి మనకు మధ్య ఉండే నిరుపాధికమైన, ఏనాడు విడచి పోనటువంటి, విడదీయడానికి వీలు కాని సంబంధాన్ని మనం తెలియాలి కదా! ఇదే కదా ముఖ్యం! " ఉందన్నోడు ఉఱవేల్ నమక్కు ఇంగు ఒழிక్క ఒழிయాదు" అని గోదాదేవి పలికిన రీతిగా ఈ జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని భగవంతుడు భావించినా పోగొట్టుకోవడం సాధ్యం కాదు. మనం కోరుకున్నా పోగొట్టుకోవడం వీలు కాదు. అతడు, మనము కలసి పోగొట్టుకోవాలని అనుకున్నా సాధ్యం కాదు. ఇటువంటి భగవత్సంబంధం మనకు అనేక విధాలుగా ఏర్పడి ఉన్నది– అనే విషయాన్ని శ్రీ పిళ్ళైలోకాచార్యులవారే అనుగ్రహించారు. తాము అనుగ్రహించిన 18 రహస్య

గ్రంథాలలో ఒకటి అయిన నవవిధ సంబంధం అనే ప్రబంధంలో మనకు భగవంతునకు మధ్య ఉండే 9 విధాలైన సంబంధక్రమాలను చాలా ఆశ్చర్యకరంగా వివరించి చూపించారు.

" పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః,

స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"

అనే విధంగా మనకు భగవంతుని మధ్య 1) విశేషణ విశేష్య సంబంధం, 2) రక్షక సంబంధం,3) శేష శేషి సంబంధం, 4 భర్తృ భార్యా సంబంధం, 5)పితా పుత్ర సంబంధం, 6)జ్ఞాతృ జ్ఞేయ సంబంధం, 7)స్వస్వామి సంబంధం, 8)శరీర శరీరి సంబంధం,9) ధార్య ధారక సంబంధం –అనే తొమ్మిది విధాలయిన సంబంధాలు ఉన్నాయి. ఈ విధంగా మనం ఏనాటికీ, ఎల్లప్పటికీ భగవంతునితో కూడినవారంగానే ఉన్నా, అతనికి మనకు మధ్య ఉండే సంబంధాన్ని ఒక ఆచార్యుడు తెలియజేస్తేనే మనం తెలియగలం తప్ప, మనంగా తెలిసికోవడం సాధ్యం కాదు. అందుకే భగవంతునకు, మనకు మధ్య ఉండే సంబంధాన్ని గూర్చిన జ్ఞానాన్ని అనుగ్రహించేవారు ఆచార్యులు అవుతున్నారు. ఆచార్యుల మూలంగా ఈ అర్థాలను తెలిసికొని తరించాలి. ఇందుకోసమే పంచసంస్కారం అనే ఒక క్రమాన్ని అనుష్ఠానంలో మనం పెట్టుకున్నాము. ఆచార్యుల మూలంగా ఈ పంచసంస్కారాలను పొంది, భగవానుని చరణారవిందాలను ఆశ్రయించి ఉజ్జీవించాలి. ఇదే భగవద్రామానుజుల దర్శనం అనబడే మన విశిష్టాద్వైత సిద్ధాంత శ్రీవైష్ణవ సంప్రదాయంలోని సారం –అనేది పెద్దలు మనకు చేసిన ఉపదేశం, మహోపకారం.

ఆళ్వార్ ఎంబెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.

# ఉపనిషత్తులలో శాంతిమంత్రం

హరిః ఓమ్

సహనా వవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై

తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై

ఓం శాంతిః శాంతిః శాంతిః

హరిః ఓమ్

వైదిక సంప్రదాయం అనేది శిష్యాచార్యక్రమాన్ని అనుసరించి అనూచానంగా ప్రవర్తిస్తున్నది. వేదానికి శ్రుతి అని పేరు. ముందు ఆచార్యులు ఉచ్చరించగా, దానిని శిష్యుడు తన శ్రవణేంద్రియంతో విని, ఆ విధంగానే అనుసరించి ఉచ్చరించి అధికరించేది వేదం. ఈ విధంగా నేర్పబడే వేదమంత్రాలు మనం ప్రతినిత్యం, ఆ విధంగానే, కొన్ని విశేష దినాలలో ఆచరించే వైదిక కర్మలలో ప్రధానంగా ప్రకాశిస్తున్నాయి. ఈ విధంగా నోటితో ఉచ్చరించే ఈ మంత్రాలను శబ్దం ద్వారా నేర్వడం మాత్రమే కాకుండా, వాటి అర్థాలను కూడా తెలుసుకుంటే మనకు చాలా ఉత్సాహాన్ని, ఆనందాన్ని పొందినవారమై, ఆ వైదిక కర్మలను మరింత శ్రద్ధాసక్తులలతో ఆచరించే అవకాశం ఉన్నది.

మనది వైదిక సంప్రదాయ. శిష్యాచార్య పరంపరను ఆధారంగా చేసికుని ప్రవర్తించినది అనే విషయానికి మొట్టమొదటి ఉదాహరణమే– భగవంతుడు సృష్టి ప్రారంభ కాలంలో చతుర్ముఖ బ్రహ్మకు అంతకు ముందే ఉన్న వేదాలను యథాతథంగా ఉపదేశం చేయడం. ఆ ఉపదేశమే ఈనాటికీ మనం అనుసంధిస్తున్న వేదంగా ప్రకాశిస్తున్నది. శిష్యాచార్య సంబంధమనేది ఎవరి చేతను విడదీయడానికి సాధ్యం కానటువంటి చాలా దృఢమైన సంబంధం. దీని వైభవాన్ని దీని క్రమాన్ని వివరించే మంత్రమే పైన ప్రస్తావించిన "సహనావతు" అనే మంత్రం.

వేదాంత కాలక్షేపాన్ని ఆరంభించడానికి ముందు, కొన్ని ఉపనిషద్భాగాలను అధ్యయనం చేయడానికి ముందు ఈ మంత్రాన్ని అనుసంధించడం సనాతన సంప్రదాయంగా వస్తున్నది. ఇప్పుడు, పైన ప్రస్తావించిన మంత్రంలోని అర్థాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

( సహనావతు) ఇందులో శిష్యుడు, ఆచార్యుడు అనే ఇద్దరు కలిసి ప్రార్థన చేస్తున్నట్లుగా చెప్పబడుతున్నది. వీరిద్దరూ ఎవరిని ఉద్దేశించి ప్రార్థిస్తున్నారు? ఏ విధమైన ప్రార్థన చేస్తున్నారు ?అనే విషయమే మనం ఇప్పుడు తెలుసుకోబోతున్నాము. వేదాంతదేశికులు రహస్య త్రయ సారం అనే గ్రంథంలో వేదమంత్రాలు అన్నీ భగవంతుడు అయిన శ్రీమన్నారాయణునే తెలియజేస్తున్నాయి అని సప్రమాణంగా నిర్ణయించి తెలియజేశారు. ఆ నిర్ణయాన్ని అనుసరించి ఇప్పుడు పై మంత్రం ద్వారా శిష్యుడు. ఆచార్యుడు పరమాత్మ సన్నిధిలో చేసే ప్రార్థనయే పై మంత్రం అని భావించవలసి ఉన్నది.

పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుని సన్నిధిలో శిష్యుడు, ఆచార్యుడు అనే ఇద్దరు కలిసి ప్రార్థన చేస్తున్నారు, ఈ వేదమంత్రంద్వారా. వేదమంత్రాలుకూడా పరమాత్మ యొక్క స్వరూపమే అనేది పెద్దల సంప్రదాయం. ఈ విధంగా మంత్రస్వరూపుడుగా, మంత్ర ప్రతిపాద్యరూపుడుగా ప్రకాశిస్తున్న పరమాత్మ సన్నిధిలో శిష్యుడు, ఆచార్యుడు ఇద్దరు "సహనావతు", అని ప్రార్థన చేస్తున్నారు. "శిష్యాచార్యుల రూపంలో ఉండే మమ్ములను పరమాత్మ రక్షించాలి", అనేది ఇందులోని అర్థం.

ఇక్కడ ప్రార్థింపబడే రక్షణ అనేది ఎటువంటిది? అని అడిగితే, బ్రహ్మజ్ఞానం ఉపదేశించడానికి ఆచార్యునకు, ఆచార్యుల మూలంగా ఆ జ్ఞానాన్ని పొందడానికి శిష్యునకు అడ్డుగా ఉండే ఆటంకాలు అన్నిటిని పోగొట్టి మమ్ములను ఇద్దరినీ రక్షించాలి– అనేది మొట్టమొదటి ప్రార్థన. శిష్యునకు, ఆచార్యులకు మధ్య ఉండే ఒక ఘనిష్టమైన సంబంధం, ఆచార్యులకు శిష్యుని విషయంలో ఉండే ప్రీతి, శిష్యునకు ఆచార్యుని పట్ల ఉండే భక్తి అనేవే ఇటువంటి ప్రార్థనను చేయడానికి కారణం అవుతున్నవి – అని మనం భావించాలి.

(సహ నౌ భునక్తు) ఇది తరువాత చేయబడే ప్రార్థన. ఇది కూడా గురుశిష్యులు ఇద్దరు భగవంతుని సన్నిధిలో చేసే ప్రార్థనయే. గురుశిష్యుల రూపంలో ఉండే మమ్ములను ఇద్దరిని భగవంతుడు పాలించాలి. బ్రహ్మజ్ఞానం ఉపదేశించడానికి తగిన స్థితిని ఆచార్యునకు, దానిని తెలిసిపోవడానికి తగిన స్థితిని శిష్యునకు కలిగించి, శరీర పోషణం మొదలైన వానిని చేసి, భగవంతుడు మమ్ములను ఇద్దరినీ రక్షించాలి— అని ఈ రెండవ ప్రార్థనలోని తాత్పర్యం.

(సహ వీర్యం కరవావహై) ఇది మూడవ ప్రార్థన. ఇది ఒక అద్భుతమైన ప్రార్థన. గురుముఖంగా మంత్రాలను అభ్యసించే విద్య వల్ల ఏర్పడే ప్రయోజనాలను, ఉన్నతమైన శక్తిని శిష్యుడు, ఆచార్యుడు అనే మేమిద్దరం అనుభవించాలి. మేమిద్దరము కలిసే అనుభవించాలి. —అనేది ఈ ప్రార్థనలోని తాత్పర్యం

దీనివల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, ఆచార్యుడు ఎల్లప్పుడూ శిష్యుని హితాన్నే కోరుకుంటున్నాడు, శిష్యుడు కూడా ఆచార్యునకు తన విషయంలో కలిగే అనుగ్రహమే తనకు ఔన్నత్యం అని, అదే తనకు మంచిని కలిగిస్తుందని భావిస్తున్నాడు —అని ఏర్పడుతున్నది అందువల్లనే ఈ శిష్యాచార్యులు ఇద్దరు కలిసి "అధ్యయనంలోని ఫలం మాకిద్దరకు లభించాలి "అని ప్రార్థిస్తున్నారు.

(తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై) ఇది నాలుగవ ప్రార్థన. నాలుగవ వాక్యంతో చేయబడుతున్నది. ఈ అధ్యయనం ద్వారా ఏర్పడే జ్ఞానం చాలా గొప్ప ప్రకాశంతో వెలగాలి. భ్రమ, సందేహం మొదలైన దోషాలు ఏమీ లేకుండా ప్రకాశించాలి. ఇది వీర్యవత్తరంగా ఉండాలి —అని శిష్యాచార్యులు ఇద్దరు ప్రార్థిస్తున్నారు.

(మా విద్విషావహై) ఇది అన్ని ప్రార్థనల కంటే ముఖ్యమైన ప్రార్థన. శిష్యాచార్యుల రూపంలో ఉండే మా ఇద్దరి మధ్య ఏ సమయంలోను విద్య, వర్తనం, స్వభావం మొదలైన వాటిలో ఎటువంటి భేదం, ద్వేషం ఏర్పడకూడదు. మా మధ్య ఏ సమయంలోనూ

ఎటువంటి అభిప్రాయ భేదం కలుగకూడదు మేమిద్దరము అన్ని సమయాలలోనూ ఒకరితో ఇంకొకరు స్నేహాన్ని, ప్రీతిని కలిగిన వారమై ఉండాలి –అనేది ఈ చివరి ప్రార్థన

ఇటువంటి ప్రార్థనలను భగవంతుని సన్నిధిలో చేసిన తరువాత చివరిగా ఒక ప్రార్థనను ఈ మంత్రం తెలియజేస్తున్నది అది ఏమంటే, " ఓం శాంతిః శాంతిః శాంతిః ", (అని.

మేము కోరినది అంతా శాంతియే అది ఎటువంటిదై ఉండాలి? అంటే, దోషాలు అనేవి ఏ కొంచెం కూడా లేకుండా, ఒక మంగళకరమైన, శుభప్రదమైన, సుఖకరమైన స్థితి ఏర్పడాలి. దోషాలు పూర్తిగా నశించి పోవాలి. –అనేది ఇక్కడ ప్రార్థన. ఈ ప్రార్థనయే "శాంతిః శాంతిః శాంతిః "అని మూడుసార్లు చెప్పబడుతున్నది.

ఈ మంత్రం మూలంగా మనం తెలిసే విషయం, మనకు వేదం బోధించే విషయం ఏమిటంటే –శిష్యాచార్య సంబంధం అనేది చాలా ఉన్నతమైన సంబంధం అది ఎటువంటి సమయాల్లోనూ సడలని సంబంధం. " మనం ఆచార్యుని విషయంలో అపచారం చేయకూడదు. ఆచార్యులు ఎల్లప్పుడూ మన మంచిని ఆశిస్తారు "అనే విషయంలో మనం గొప్ప విశ్వాసంతో ఉండాలి. శిష్యాచార్యుల మధ్య ఉండే సంబంధానికి భేదం అనేది ఏ సమయంలోను ఏర్పడకూడదు. ఆ విధంగా వారిద్దరూ ప్రవర్తించాలి –అనేది వేదం బోధిస్తున్నది.

అటువంటి ప్రవర్తనను మనకు భగవంతుడు అనుగ్రహించాలి –అని వేదమూర్తి అయిన శ్రీమన్నారాయణుని సన్నిధిలో మనం అందరం ప్రార్థన చేద్దాం.

# ప్రోక్షణమంత్రం

మనం చేసే ఏ కర్మ అయినా, అది భగవంతుని ఆరాధన రూపంగానే ఉండాలి అని శాస్త్రం తెలుపుతున్నది. భగవంతుడు మనకు కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మం, మనసు అనే ఇంద్రియాలను అనుగ్రహించాడు. వీటిని మనకు ఎందుకు అనుగ్రహించాడు? అంటే, " విచిత్రా దేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్, పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాదిసంయుతా" అనే విధంగా భగవంతునకు ఆరాధన చేయడం కోసమే కదా. భగవంతుని ఆ భగవంతుడే ఇచ్చిన ఇంద్రియాలతో ఆరాధించి, మనం ఈ సంసారం నుండి విడుదలను పొందాలి. భగవంతుడు మనకు శరీరాన్ని, ఇంద్రియాలను ఇందుకోసమే అనుగ్రహించాడు. కాని, మనం ఆ స్వామి మనకు అనుగ్రహించిన ఇంద్రియాలను ఆ స్వామి ఆరాధన కోసం కాకుండా, వేరే విధంగా ఉపయోగించడం, వేరు ప్రయోజనాలకు ఉపయోగించడం, ఆవశ్యకం లేని విషయాలలో మాటిమాటికి ఆసక్తిని పొందడం, వాటిని పొందడం కోసం ఈ ఇంద్రియాలు ఉపయోగించడం మొదలైన ఆకృత్యాలను చేసి, మనం ఈ సంసారంలోనే కూరుకు పోతున్నాం. ఆ స్థితి నుండి బయటపడి, ఉజ్జీవనం పొందే విధానమేమో తెలియకుండా అలమటిస్తున్నాం. ఆ విధంగా కాకుండా, మనం చేసే ప్రతికార్యాన్ని భగవంతుని ఆరాధనగానే చేయాలి. వండుకోవడం, భుజించడం మొదలైన లౌకిక కార్యాలను కూడా మనం స్వార్థబుద్ధితో కాకుండా, వాటిని కూడా భగవంతుని ఆరాధనా రూపాలుగా భావిస్తూ, ఏ ఫలాన్ని వాటి వల్ల కోరకుండా చేసినట్లయితే, అవి కూడా మన ఉజ్జీవనానికి కారణం అవుతాయా? అనే ప్రశ్నిస్తే, అవును, అవి కూడా నిష్కామంగా ఆచరించినట్లయితే ఉజీవనానికి హేతువులు అవుతాయి —అని శాస్త్రం తెలుపుతున్నది. మనం భుజించడం ఎందుకంటే భగవత్సేవను చేయడం కోసం ఆవశ్యకమైన శక్తిని పొందడం కోసం. నిద్రించడం కూడా ఇంద్రియాలు శ్రమను పొందకుండా, భగవంతుని ఆరాధనలో ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని పొందడం కోసం, దానికి తగిన శక్తిని ఉత్సాహాన్ని పొందడం కోసంగా కావాలి.

ఈ విధంగా భగవంతునకు మన శరీరాన్ని, ఇంద్రియాలు ఉపయోగించి చేసే కైంకర్యాలు రెండు విధాలుగా ఉంటాయి. ఆజ్ఞా కైంకర్యాలు అని, అనుజ్ఞా కైంకర్యాలు అని అవి రెండు విధాలు. వీటిలో ఆజ్ఞా కైంకర్యాలు అనేవి భగవంతుని ఆజ్ఞా రూపాలు. భగవంతుని ఆజ్ఞలను అనుసరించి, వాటిని నిర్వర్తించకపోతే, మనం భగవంతుని కోపానికి, నిగ్రహానికి గురి కావలసి ఉంటుంది. దీపారోపణం చేయడం, దానాధులను చేయడం, యజ్ఞాలను చేయడం మొదలైనవి అనుజ్ఞాకైంకర్యాలు అని అనబడతాయి. ఈ కైంకర్యాలను మనం చేసినట్లయితే మనకు హితం కలుగుతుంది. ఈ కార్యాలు చేయకపోతే వాటి వల్ల ఏ పాపం రాదు.

భగవంతునకు సమర్పించే ఆజ్ఞారూపమైన కైంకర్యాలలో చాలా ప్రధానమైనది– మూడు సంధ్యలలోనూ నిర్వర్తించే సంధ్యావందనం. "అహారహః సంధ్యా ముపాసీత" –ప్రతి దినం సంధ్యావందనాన్ని చేయాలి– అని విధి ఉన్నది. ఆ విధంగానే సంధ్యావందనం చేయకపోతే, "సంధ్యాహీనోశుచిః అనర్హః సర్వకర్మసు" అని అతనికి పవిత్రత లేదని, ఏ కార్యాన్ని చేయడానికి, ఏ భగవత్కైంకర్యాన్ని సమర్పించడానికి కూడా తగిన యోగ్యత లేని వాడు అవుతాడని కూడా చెప్పబడింది. అందుచేత సంధ్యావందనం అనేది అజ్ఞాకైంకర్యం అవుతున్నందున, ఈ విధిని నిర్వర్తించనివాడు భగవంతుని ఆగ్రహానికి గురి అవుతాడు. ఆ విధంగానే, సంధ్యావందనాన్ని చేసినట్లయితేనే భగవంతునకు సేవను చేయడానికి తగిన యోగ్యతను కలవాడు అవుతాడు. ఈ రెండు విషయాలను మనం మనసులో పెట్టుకోవాలి.

ఒకడు భగవంతుని కైంకర్యంలోనే అభినివేశాన్ని కలిగినవాడు ఇనప్పటికీ, సంధ్యావందన సమయం అయినప్పుడు సంధ్యావందనాన్ని నిర్వర్తించి, ఆ తరువాత భగవత్కైంకర్యాన్ని కొనసాగించాలి. ఆ విధంగా చేయకపోతే, సంధ్యావందనం చేయకుండా మనం చేసే కైంకర్యాలను భగవంతుడు ఏ సమయంలోనూ తృప్తిగా స్వీకరించడు– అని కొందరు భావిస్తారు.

ఆలయాలలో ఉత్సవాదులు జరిగే సమయాలలో, సంధ్యావందన సమయం అయినప్పటికీ, ఆ ఉత్సవాలు పూర్తి అయిన తరువాతనే ఇంటికి వచ్చి సంధ్యావందనాలు చేయవచ్చు అని, ఉత్సవ సమయంలో ఆలయాలలో చేసే భగవత్కైంకర్యాన్ని మానివేసి, సంధ్యావందనం కోసం తొందరపడవలసిన ఆవశ్యకత లేదని, ఆ విధంగా ఉత్సవ సమయాలలో భగవంతుని కైంకర్యంలో నిమగ్నమై ఉన్నందున సంధ్యావందనం తగిన సమయంలో చేయలేని వారి విధులను నిర్వర్తించడానికి కొంతమంది దేవతలు ఉంటారని, ఆ సమయాలలో సంధ్యావందనాన్ని చేయకపోయినా భగవంతుని కోపానికి గురి కారని, భగవంతుని ప్రీతికే వారు విషయం అవుతారని కూడా కొందరు పెద్దలు భావిస్తారు.

సంధ్యావందనం అంటే ఏమి? అందులో ప్రధానమైన కృత్యం ఏమి? సంధ్యావందనంలో ఆచమనం, ప్రాణాయామం, ప్రోక్షణం, ప్రాశనం, అర్ఘ్యం, జపం, ఉపస్థానం మొదలైన ఎన్నో కృత్యాలను చేస్తున్నాము. ఈ విధంగా పలు విధాలైన కృత్యాలతో కూడినది సంధ్యావందనం. ఇందులో ప్రధానమైనవి అర్ఘ్యం. జపం, ఉపస్థానం —అనే మూడు. కృత్యాలు.

భగవంతుని ఆరాధనా రూపమైన ఈ సంధ్యావందనాన్ని ఆచరించడానికి మనం మనలను మానసికంగా, శారీరకంగా పరిశుద్ధం చేసుకోవాలి. శారీరకంగా, మానసికంగా యోగ్యతను కలిగినవారినిగా, సంధ్యావందనం చేయడానికి తగిన అధికారాన్ని కలవారినిగా చేసుకొన్న తర్వాతనే మనం అర్ఘ్యం, జపం, ఉపస్థానం మొదలైన కృత్యాలను ఆచరించాలి —అని తెలియజేస్తున్నది, శాస్త్రం. శారీరకంగా మనలను పరిశుద్ధం చేసేది ప్రోషణ మంత్రం అని చెప్పబడే ఈ క్రింద ప్రస్తావింపబడే మంత్రం.

"అపో హి ష్ఠా మయో భువః తాన ఊర్జే దధాతన

మహే రణాయ చక్షసే యో వ శ్శివతమో రసః
తస్య భాజయతే హనః ఉశతీరివ మాతరః
తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ
ఆపో జనయథా చ నః. "

అనేది ప్రోక్షణ మంత్రం. ఈ మంత్రంలో ప్రతిపాదింపబడే దేవతలు అబ్దేవతలు. అనే తీర్థాధిపతులైన దేవతలు. దీని ఛందస్సు దేవి గాయత్రీ ఛందస్సు.

ఈ మంత్రంతో ప్రోక్షణ చేయడానికి ముందు పంచావసానం అని చెప్పబడే స్థితిలో ఐదు చోట్ల నిలిచేటట్లుగా గాయత్రితో ముందుగా ప్రోక్షణ చేసుకోవాలి. ఇపుడు ఈ ప్రోక్షణ మంత్రంలోని అర్థాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

ముందుగా వేద భాష్యానుసారం అర్థాన్ని సంగ్రహంగా గమనిద్దాం. ఆ తరువాత, సంప్రదాయానుసారంగా ఉండే విశేషాలను గమనిద్దాం.

అపో హి ష్ఠామ యో భువః– ఆపశ్శబ్దం నిత్య బహువచనం. కనుక, ఇక్కడ అబ్దేవతలనబడే దేవతలను ఉద్దేశించి "హే ఆపః" సంబోధింపబడుతున్నది.
ఈ విధంగా సంబోధించి, "మయో భువః ష్ఠా హి" అని చెప్పబడుతున్నది. "మీరంతా సుఖానికి కారణంగా అవుతున్నారు కదా "అని దీని అర్థం. అంటే, ఈ దేవతలే సుఖానికి కారణమైనవారు– అని భావం.
"తాన ఊర్జే దధాతన మహే రణాయ చక్షసే"– " పెద్దవిగాను, అందంగాను ఉండే ఇంద్రియాల కోసం మీరు అన్నాన్ని ఇవ్వండి" అని ఇందులో ఆ దేవతలను ఉద్దేశించి ప్రార్థింపబడుతున్నది.
"యో వ శ్శివతమో రసః తస్య భాజయతే హనః ఉశతీరివ మాతరః" –" మీ దగ్గరనే మిక్కిలి మంగళకరమైన రసం ఉన్నది. ఆ రసాన్ని ఇక్కడే మేము పొందేటట్లుగా మీరు

చేయాలి. ఏ విధంగా అంటే, తన బిడ్డ విషయంలో చాలా ప్రీతి కలిగిన ఒక తల్లి భోగ్యమైన రసాన్ని ఏ విధంగా తన బిడ్డకు అనుగ్రహిస్తుందో, ఆ విధంగానే మీరు ఉన్నతమైన రసాన్ని మాకు పొందించాలి " అని ఈ విధంగా ఇందులో ప్రార్థింపబడుతున్నది.
"తస్మా అరం గమామ వః యస్య క్షయాయ జిన్వథ"— ఏ రసం స్థిరంగా ఉండడం కోసం మీరు ప్రీతిని పొందుతున్నారో, ఆ రసంకోసం మిమ్ములను మేము ప్రార్థిస్తున్నాము, ఆశ్రయిస్తున్నాము— అని ఇందులోని అర్థం.
"ఆపో జనయథా చ నః. "—" జల దేవతలారా! మమ్ములను జనించినవారినిగా చేయాలి. జన్మ సాఫల్యాన్ని పొందినవారినిగా చేయాలి" అని ప్రార్థన.

ఇక, ఈ మంత్రంలోని సాంప్రదాయికమైన అర్థాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

"మయో భువః" అని "అన్ని విధాలైన సుఖాలను అనుగ్రహించేవాడు", అని చెప్పదగినవాడు పరమాత్మయే కదా. వాస్తవంగా ఆలోచిస్తే, కేవలం జలం వల్ల అన్ని విధాలైన సుఖాలు కలిగే అవకాశం లేదు. అందుచేత, ఇక్కడ జలదేవతలకు అంతర్యామిగా ఉండే భగవంతుడే చెప్పబడుతున్నాడు. —అనేది మొదట గ్రహించవలసిన అర్థం.

ఈ శరీరంతో ఉండేటప్పుడు మనం భగవదనుభవాన్ని పొంది, దానివల్ల తగిన ఆనందాన్ని పొందాలి —అనేది ఒక ఆశ. దానికి తగిన, ఉండవలసిన శక్తిని పొందడం కోసం అన్నాన్ని ప్రార్థించడంలో తప్పు లేదు.
"శ్శివతమో రసః" అనే సూక్తిని గమనిద్దాం. " రసో వై సః"— అని అన్ని భోగ్య వస్తువులలోనూ రసస్వరూపుడై ఉండేవాడు పరమాత్మయే. ఇక్కడ రస శబ్దం చేత చెప్పబడుతున్నాడు. ఒక తల్లి ఏ విధంగా తన బిడ్డకు తన స్తన్యాన్ని పొందడానికి కారణం అవుతున్నదో, మేము ఆ భగవద్రసాన్ని అనుభవించడానికి ఆ భగవంతుడే

కారణమై ఉన్నాడు. అందుచేతనే, ఆ పరమాత్మ సన్నిధిలో ప్రార్థన చేస్తున్నాము. ఆ రసాన్ని మేము అనుభవించేటట్లుగా మమ్ములను స్వామి అనుగ్రహించాలి. భగవదనుభవరూపమైన ఆ రసం ఎల్లప్పుడు మాలో సుప్రతిష్ఠితమై ఉండాలి.

"ఆపో జనయథా చ నః. " –"మాకు జన్మను అనుగ్రహించాలి "–అంటే ఏమి అర్థం? జన్మ అంటే– అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః" అనే విధంగా బ్రహ్మజ్ఞానాన్ని పొందినపుడే జన్మించినవాడు అవుతున్నాడు, సత్తను పొందినవాడు అవుతున్నాడు– అని వేదమే తెలుపుతున్నది. ఎవరైతే పరమాత్మను గూర్చి తెలుసుకుంటున్నారో, యథాతథంగా తెలుసుకుంటున్నారో, వారే జన్మించిన వారు అని భావింపబడుతున్నారు. అటువంటి జన్మను కలిగినవారినిగా మమ్ములను నీవు చేయాలి– అని ఇక్కడ జలానికి అంతర్యామిగా వేంచేసి ఉండే పరమాత్మను ప్రార్థిస్తున్నట్లుగా మంత్రం ప్రకాశిస్తున్నది.

ఇది ఈ మంత్రంలో భాసించే సాంప్రదాయకమైన విశేషమైన అర్థం.

ఈ విషయాన్ని దేశికులు–

"ఆపో హీత్యాదిభిః మంత్రైః వాచికైః పరమాత్మనః,
సంప్రోక్ష్య మంత్రాచమనం మంత్రై స్తత్ప్రతిపాదకైః" నంజియర్ అనుగ్రహించిన నిత్య గ్రంథంలోని కారికను ప్రస్తావించి, వివరించారు.

మనం కూడా ఈ మంత్రంతో భగవంతుని ఆరాధన చేయడానికి తగిన యోగ్యతను పొందుదాం.

ఈ మంత్రంలోని ఇంకా మరికొన్ని విశేషాలను మరొక సమయంలో గమనిద్దాం.

# యజ్ఞోపవీతధారణమంత్రమహిమ

యజ్ఞోపవీతాన్ని ధరించేటప్పుడు అనుసంధించే మంత్రంలోని కొన్ని విశేషాలను ఈ వ్యాసంలో తెలుసుకుందాం.

మనం ఏదైనా ఒక మంత్రాన్ని జపించడాని ముందు ఆ మంత్రాన్ని దర్శించిన ఋషి, ఆ మంత్రంలోని ఛందస్సు, దాని చేత చెప్పబడే దేవత –అనే ఈ మూడు అంశాలను స్మరించియే మనం ఆ మంత్రాన్ని అనుసంధించాలి. యజ్ఞోపవీత ధారణకు ఉపయోగించే మంత్రానికి బ్రహ్మ ఋషి, త్రిష్టుప్ ఛందస్సు, మూడు వేదాలు దేవతలు. ఈ మంత్రం మనం యజ్ఞోపవీత ధారణ చేసేటప్పుడు అనుసంధించవలసిన మంత్రంగా ప్రకాశిస్తున్నది. ఈ మంత్రం మనకు పలు అర్థాలను బోధిస్తున్నది. వాటిని ఇప్పుడు మనం సంగ్రహంగా తెలుసుకుందాం. మొదట మంత్రాన్ని గమనిద్దాం.

యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతేః యత్సహజం పురస్తాత్,
ఆయుష్య మగ్ర్యం ప్రతిమం చ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః.

ఈ మంత్రం ఆరంభం యజ్ఞోపవీతం అనే పదంతో అవుతున్నది. యజ్ఞోపవీతం అంటే ఏమి అనే ప్రశ్నకు సమాధానాన్ని "దక్షిణం బాహు ముద్ధరతే, అవధత్తే సవ్యమితి, యజ్ఞోపవీతమ్". అనే మంత్రంతో వేదమే తెలియజేస్తున్నది. ఎడమ భుజానికి పైన, కుడి భుజానికి కింద ధరింపబడేది యజ్ఞోపవీతం– అని చెప్పబడుతున్నది అని ఈ మంత్రం మనకు తెలుపుతున్నది.
ఈ యజ్ఞోపవీతం అనేది నూతన వస్త్రంతో చేసినదిగా ఉండవచ్చు, నూలుతో చేసినదిగా ఉండవచ్చు, క్షత్రియుల విషయంలో అయితే, పట్టునూలుతో చేసినదిగా కూడా

ఉండవచ్చు, . కృష్ణాజినం అనబడే నల్ల జింక చర్మంతో చేసినదిగా కూడా ఉండవచ్చు —అని పూర్వకాలంలో చెప్పబడింది. ప్రస్తుత కాలంలో అయితే, ఒకే విధంగా నూలుతో చేసిన యజ్ఞోపవీతాన్ని మనం ధరిస్తున్నాము.

ఈ యజ్ఞోపవీతాన్ని ధరించడానికి ఒక క్రమం అనేది ఉన్నది. యజ్ఞోపవీతాన్ని మనం ధరించేటప్పుడు, మనకు క్షేమం కలగాలి – అనే అభిప్రాయంతోనే దీనిని ధరిస్తున్నాము. ఆ ధారణను సరియైన క్రమంలో చేయకపోయినట్లయితే, క్షేమం కలగకపోవడమే కాదు, విపరీత ఫలం కూడా కలుగవచ్చు. " నాభేరూర్ధ్వ మనాయుష్య మధస్తాత్తు తపఃక్షయః" అని చెప్పబడుతున్నది. అందుచేత బొడ్డుకు సమానంగా మనం ఈ యజ్ఞోపవీతాన్ని ధరించాలి అని తెలుస్తున్నది. నాభికి సమంగా లేకుండా, ఇంకా చిన్నదిగా ఉన్నట్లయితే, అది ఆయుస్సును తగ్గిస్తుంది. బాగా పొడుగ్గా నాభికి కిందగా ఉన్నట్లయితే, తపస్సుకు కొరత కలుగుతుంది. అందుచేత నాభికి సమంగా యజ్ఞోపవీతాన్ని ధరించాలి. "తస్మా న్నాభిసమం ధార్యం ఉపవీతమ్" అని చెప్పబడుతున్నది. ఈ విధంగా బొడ్డుకు సమంగా ఉండేటట్లు మనం యజ్ఞోపవీతాన్ని ధరించాలి.

ఇప్పుడు యజ్ఞోపవీతాన్ని ధరించినప్పుడు మనం ఉచ్చరించే మంత్రంలోని అర్థా. న్ని కొంచెం చూద్దాం.

ఈ యజ్ఞోపవీతం పరమ పవిత్రమైనది. అంటే, పవిత్రమైన వస్తువులు అన్నిటిలో చాలా పవిత్రమైనది —అని అర్థం. లోకంలో గంగాజలం మొదలైనవి చాలా పవిత్రమైనవిగా భావింపబడుతున్నాయి. ఈ విధంగా పవిత్రమైనవిగా భావింపబడే వస్తువులు అన్నిటిలో ఈ యజ్ఞోపవీతం చాలా పవిత్రమైనదిగా పడుతున్నది —అని ఇక్కడ తాత్పర్యం. అందువల్లనే ఈ యజ్ఞోపవీతం ధరించడం వల్ల మనకు పవిత్రత కలుగుతున్నది అని చెప్పబడుతున్నది. మనకు జాతాశౌచ మృతాశౌచాలు

ఏర్పడినప్పుడు కానీ, వేరు ఏ కారణం చేతనైనా మలమూత్రాదుల కారణంగా యజ్ఞోపవీతానికి అశుద్ధి కలిగినప్పుడు కానీ, పూర్వం ఉండే యజ్ఞోపవీతాన్ని మార్చుకొని, నూతన యజ్ఞోపవీతాన్ని ధరిస్తే శుద్ధి కలుగుతుంది. ఈ యజ్ఞోపవీతం తాను పవిత్రంగా ఉండడమే కాకుండా, తనను ధరించినవారిని కూడా పవిత్రతను పొందినవారినిగా చేస్తుంది. ఇది యజ్ఞోపవీతానికి గల ఒక గొప్పతనం.

ఈ యజ్ఞోపవీతం అనేది ఎప్పుడు ఆవిర్భవించింది? ఎంత కాలంగా ఈ యజ్ఞోపవీతాన్ని ధరించే సంప్రదాయం కొనసాగుతూ వస్తున్నది ?అనే ప్రశ్నలు అందరికీ కలుగుతాయి. ఈ ప్రశ్నలకు తగిన సమాధానం ఈ మంత్రంలోనే చెప్పబడి ఉన్నది (ప్రజాపతేః యత్సహజం పురస్తాత్) పురస్తాత్— సృష్టి కాలంలో— అని అర్థం. ప్రళయం ముగిసిన తరువాత భగవంతుడు సృష్టి చేసిన కాలంలో మొట్టమొదటగా బ్రహ్మను సృష్టించాడు. బ్రహ్మను సృష్టించే సమయంలోనే ఈ యజ్ఞోపవీతాన్ని కూడా భగవానుడు సృష్టించాడట. భగవంతుడు తన నాభికమలనుండి బ్రహ్మను సృష్టించాడ. బ్రహ్మను సృష్టించడంతో పాటు, వేదాలను, వైదిక కర్మలను కూడా ఆవిర్భవింప చేశాడు. బ్రహ్మను సృష్టించి భగవంతుడు ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడు. ఈ విషయాన్ని వేదమే స్వయంగా "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అని అంటూ తెలియజేసింది.

వేదాలను ఉచ్చరించాలంటే దానికి తగిన యోగ్యత కావాలి కదా. ఆ యోగ్యత యజ్ఞోపవీతాన్ని ధరించడం వల్ల ఏర్పడుతుంది. వేదాన్ని అధ్యయనం చేయడానికి, దానిని అనుసంధానం చేయడానికి యజ్ఞోపవీత ధారణ చాలా ముఖ్యం అని చెప్పబడింది. అందుచేత ప్రజాపతి అనబడే బ్రహ్మను సృష్టించినప్పుడే భగవంతుడు ఈ యజ్ఞోపవీతాన్ని కూడా సృష్టించాడు. బ్రహ్మను సృష్టించి, యజ్ఞోపవీతాన్ని సృష్టించి, ఆ బ్రహ్మకు యజ్ఞోపవీతాన్ని ధరింపజేసి, తరువాతనే భగవంతుడు ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడు. ఈ విషయం ఈ మంత్రంలోని "ప్రజాపతేః యత్సహజం

పురస్తాత్" అని చెప్పబడింది. ఈ యజ్ఞోపవీతాన్ని ధరించినందు వల్లనే బ్రహ్మ కూడా వేదాలను ఉచ్చరించగలిగిన అధికారాన్ని కలిగినవాడవుతున్నాడు

అంతే కాదు ఈ వేదాలను బ్రహ్మకు ఉపదేశించే భగవంతుడు కూడా యజ్ఞోపవీతాన్ని ధరించియే ఉన్నాడు. ఈ విషయాన్ని దివ్యసూరులు అనబడే ఆళ్వార్లు పలు సందర్భాలలో తెలియజేశారు. భగవదాలయాలలో భగవంతుని అర్చామూర్తిని మనం దర్శించినప్పుడు, ఆ మూర్తి యజ్ఞోపవీతాన్ని, నడుముకు మొలనూలును ధరించి ఉండడాన్ని మనం గమనించవచ్చు. అందుచేత భగవంతుడు యజ్ఞోపవీతధారియై బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడు– అని ఏర్పడుతున్నది కదా.

ఇక్కడ ఒక విషయాన్ని మనం మనసులో గుర్తుపెట్టుకోవాలి. వేదం ఎవరి చేతనో నిర్మింపబడినది కాదు. భగవంతుని వలె అది నిత్యం, అనాది, నాశం లేనిది. అన్నీ లయన్ని పొందిన మహా ప్రళయ కాలంలో కూడా వేదానికి నాశం అనేది లేదు. అవి సంస్కార రూపాలుగా నిలచి ఉంటాయి. నిద్రపోయినవాడు తిరిగి లేచినప్పుడు తన పూర్వసంస్కారాలను స్మరించినట్లుగా, భగవంతుడు కూడా ప్రళయ కాలం పూర్తి అయిన తరువాత, అంతకుముందు ఉండే, సంస్కార రూపాలుగా నిలచి ఉన్న వేదాలను స్మరించి, వాటిని పూర్వం ఏ విధంగా ఉన్నాయో అదే క్రమంలో బ్రహ్మకు ఉపదేశిస్తాడు. అందుచేత వేదం అనేది నిత్యమైనది. వేదం ఏ విధంగా నిత్యమైనదో, ఆ వేదాన్ని అధ్యయనం చేయడానికి ఏర్పడిన నియమాలు కూడా నిత్యమైనవి.

ఈ యజ్ఞోపవీతాన్ని ధరించినందు వల్ల మనకు ఏమి ప్రయోజనం?అది గొప్ప పవిత్రమైనది అయితే కానీ, దానిని ధరించడం వల్ల మనకు ఏమి ప్రయోజనం కలుగుతుంది? లోకంలో సహజంగా ఇటువంటి ప్రశ్నలే కదా ఎవరికైనా మనస్సులో కలుగుతాయి.

ఈ ప్రశ్నలకు ఈ మంత్రమే తగిన సమాధానాలను ఇస్తున్నది –"ఆయుష్య మగ్ర్యమ్" అని అంటూ. యజ్ఞోపవీతాన్ని ధరించినందు వల్ల మనకు దీర్ఘమైన ఆయుస్సు కలుగుతుంది. మనలను అన్ని విధాలుగా యోగ్యతను కలవారిగా యజ్ఞోపవీతం చేస్తుంది.

అంతేకాక, యజ్ఞోపవీతం మనకు చక్కని జ్ఞానాన్ని, బలాన్ని ఇవ్వాలి –అని ఈ యజ్ఞోపవీతమంత్రంలోనే ప్రార్థన చేయబడుతున్నది. అటువంటి శక్తి యజ్ఞోపవీతానికి ఉన్నది. దానిని ధరించడానికి ముందు, మనకు జ్ఞానాన్ని, బలాన్ని, తేజస్సును కలిగించాలని ప్రార్థిస్తూ దానిని ధరిస్తున్నాము.

ఈ విధంగా ఈ యజ్ఞోపవీత ధారణ వల్ల మనం పొందే ప్రయోజనాలను ఈ మంత్రంతో గమనించాము. దీనిని అంతటిని మనకు ఈ మంత్రం ద్వారా తెలియజేసిన, వేదపురుషుడైన పరమాత్మను మనకు సకల క్షేమాలు కలగాలని, అనుగ్రహించాలని ప్రార్థిద్దాం.

# భగవత్ప్రార్థన

హరిః ఓమ్

" అగ్నే నయ సుపథా రాయే అస్మాన్

విశ్వాని దేవ వయునాని విద్వాన్

యుయోధ్యస్మత్ జుహురాణ మేనో

భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ.

హరిః ఓమ్.

ఇది ప్రథమాచార్యుడైన శ్రీమన్నారాయణుని సన్నిధిలో చేయబడే వైదిక ప్రార్థన, ఇందులోని విశేషాలను గమనిద్దాం.

మొదట, ఈ మంత్రంలోని అర్థాన్ని వేద భాష్యంలో తెలుపబడిన రీతిలో తెలిసికొందాం.

అమావాస్య. పౌర్ణమి అనే రెండు దినాలు క్రమంగా దర్శమని, పౌర్ణమాసం అని వేదంలో చెప్పబడతాయి. ఈ కాలాలను నిమిత్తంగా చేసుకొని కొన్ని ఇష్టులు యజ్ఞాలు, యాగాలు చేయాలని శాస్త్రాలలో విధింపబడ్డాయి. ఒక సమయంలో మన అజ్ఞానం వలన, అజాగ్రత్త వలనో ఆ యాగాలను చేసేటప్పుడు కొన్ని లోపాలు. తప్పిదాలు జరగవచ్చు. ఆ కార్యాలను చేయకుండా పోవచ్చు. చేసిన కార్యాలు కూడా క్రమానుసారంగా చేసినవి కాకపోవచ్చు. ఆ విధంగా ఏర్పడిన లోపాల వల్ల, తప్పిదాల వల్ల మనకు అనర్థాలు సంభవిస్తాయి. ఈ విధంగా అనర్థాలు మనకు ఏర్పడకుండా ఉండడం కోసం మనం చేసే ప్రార్థనయే ఈ మంత్రం.

ఇక్కడ చెప్పబడిన అగ్ని శబ్దం అగ్నిదేవతను నిర్దేశిస్తున్నది. ఇక్కడ మంత్రంలో అగ్నిదేవతను ఉద్దేశించి ప్రార్థనను చేస్తున్నట్లు మనకు గోచరిస్తున్నది. దర్శ పౌర్ణమాస కాలాలలో చేసే యజ్ఞ యాగాదులను చేసి, దాని వలన కలిగే ప్రయోజనమే పరమధనమని చెప్పబడుతున్నది. "అటువంటి ఆ ధనాన్ని మేము పొందడంకోసం

మమ్ములను, ఓ అగ్నీ!, నీవు మంచి మార్గంలో పెట్టాలి" —అని ఇందులో అగ్నిదేవత ప్రార్థింపబడుతున్నాడు.

"అంత మాత్రమే కాకుండా, నరకానికి వెళ్లే మార్గానికి చేర్చే రీతిలోని, మా కుత్సిత బుద్ధి వల్ల ఏర్పడే పాపాలను కూడా నీవు పోగొట్టాలి. నీకే అన్ని విధాలైన మంచి మార్గాలు తెలుసు. అందుచేత నీవు మమ్ములను మంచి మార్గంలోకి తీసుకొని పోవాలి. ఇందుకోసం నీకు మేము పలుమార్లు నమస్కారోక్తులను ప్రయోగిస్తున్నాము"— అని ఇందులో అగ్నిదేవత ప్రార్థింపబడుతున్నాడు.
ఇది సామాన్యంగా ఈ మంత్రంలో పైన తోచే అర్థం

ఈ మంత్రానికి సంప్రదాయ క్రమంలో చెప్పబడే అర్థాన్ని ఇప్పుడు కొంచెం గమనిద్దాం.

ప్రతి గృహస్థుడు తాను అనుష్ఠించే ఔపాసనం, వైశ్వదేవం, శ్రాద్ధకర్మలలో హోమం మొదలైన అగ్నికార్యాలలో అన్నిటిలోనూ హోమం పూర్తి అయిన తర్వాత ఈ మంత్రాన్ని చెప్పి, భగవంతుడైన శ్రీమన్నారాయణుని సన్నిధిలో ప్రార్థన చేయాలి— అనేది విధింపబడిన ఒక కర్తవ్యం. ఈ విధంగా ఈ మంత్రాన్ని అనుసంధిస్తూ, భగవంతుని ప్రార్థించాలని శాస్త్రాలలో విధింపబడిన ఒక క్రమం. మనం అనుష్ఠించే ప్రతి ఒక్క వైదిక కర్మ కూడ భగవంతుని ఆరాధనా రూపంగా, అంటే, అది భగవంతుని ఆరాధించే రూపంగానే చేయాలి— అని కూడా శాస్త్రం తెలుపుతున్నది. యజ్ఞం అంటే శ్రీమన్నారాయణుడే. °యజ్ఞో వై విష్ణుః° అని వేదమే తెలియజేస్తున్నది. మనం అనుష్ఠించే వైదిక కర్మలు అన్ని భగవత్స్వరూపాలుగానే ప్రకాశిస్తున్నాయి. మనం చేసే కర్మలలో లోపాలు ఏర్పడితే, భగవంతుని కోపానికి గురి అయ్యే అవకాశం ఉన్నది. అందువల్ల మనకు అనేక విధాలైన అనర్థాలు, ఆపదలు ఏర్పడే అవకాశం ఉన్నది. ఆ విధంగా జరగకుండా ఉండడం కోసమే భగవంతుని సన్నిధిలో ఈ మంత్రం ద్వారా ప్రార్థన చేయబడుతున్నది.

ఇక్కడ "అగ్నే" అనే పదం అగ్నిదేవతకు అంతర్యామిగా వేంచేసి ఉండే భగవంతుని తెలుపుతున్నది— అని తెలియాలి. అగ్నిశబ్దంతో భగవంతుని నిర్దేశిస్తూ చేసే ప్రార్థనయే ఈ మంత్రం. ఇక్కడ అగ్నిశబ్దానికి అగ్నిదేవత అనే అర్థాన్ని గ్రహించినప్పటికీ కూడా, ఈ పదానికి " అగ్రం నయతి ఇతి అగ్నిః" అనే యోగ వ్యుత్పత్తిని గ్రహించి, మనలను అందరినీ మోక్ష పర్యంతమైన ఐశ్వర్యాన్ని ఇచ్చి ముందుకు తీసుకునిపోయేవాడు కనుక, అగ్ని —అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ విధంగా అర్థం గ్రహించినట్లయితే, అగ్నిశబ్దం సాక్షాత్తుగానే భగవంతుని నిర్దేశిస్తుంది. ఇది జైమినిమహర్షియొక్క అభిప్రాయం. ఈ రీతిలో ఏ విధంగా చూసినప్పటికీ కూడా, ఇక్కడ "అగ్నే!" అనే శబ్దం భగవంతుని నిర్దేశించి సంబోధించే పదంగా మనకు ఏర్పడుతున్నది.

ఇక, మంత్రంలో తరువాతి భాగాన్ని చూద్దాం.

" అగ్నే! సుపథా నయ"— "మమ్ములను మంచి మార్గంలోకి తీసుకొని" పోవాలి అని ఇక్కడ ప్రార్థింపబడుతున్నది. ఎందుకోసం తీసికొని పోవాలి? అని అంటే,
రాయే— సంపదను పొందడం కోసం—— అని భావం. "మేము నిన్ను ఈ కర్మలతో ఆరాధిస్తున్నాము. ఈ కర్మలలో ఏమైనా లోపాలు ఉన్నప్పటికీ కూడా, క్రమానుసారంగా, ఏ లోపం లేకుండా, ఈ కర్మలను చేసినప్పుడు ఏ ఫలమైతే సిద్ధిస్తుందో, ఏ సంపద అయితే లభిస్తుందో, లభించే అవకాశం ఉన్నదో, అదే మాకు సంపద. అదే మాకు ధనం ఈ కర్మలను సరి అయిన క్రమంలో చేస్తే వచ్చే ఫలం నీకు కలిగే ప్రీతియేకదా. ఆ విధంగా నీకు కలిగే ప్రీతియే మాకు ధనం. అటువంటి, నీకు కలిగే ప్రీతి అనే ధనం మా విషయంలో ఎల్లప్పుడూ కలగాలి. అది మాకు లభించేటట్లుగా మమ్ములను నీవు మంచి మార్గంలోకి నడిపించాలి" —అనేది ఇక్కడ చేయబడే ప్రార్థన.

ఈ విధంగా తాము చేసే ప్రార్థనను విని, భగవంతుడు "మిమ్ములను మంచి మార్గంలోకి నడిపించమని నన్ను అడుగుతున్నారే!. నాకు మాత్రం ఏది మంచి

మార్గమో, ఏది చెడు మార్గమో, తెలుసునా? ఏమి!" అని అంటున్నట్లుగా మనసులో భావించి, "విశ్వాని దేవ! వయునాని విద్వాన్" అని " భగవన్! నీకు ఒక్కనికి మాత్రమే అన్ని మంచి మార్గాలు తెలుసును. అందుచేత, ఓ దేవా! నీకు మాత్రమే ఏది మంచి మార్గమో, ఏది చెడు మార్గమో తెలుసును" అని అంటున్నారు.

తరువాత చేసే ప్రార్థన ఏమంటే, " మేము నరకమార్గంలోకి వెళ్లడానికి అవకాశం ఉండే, మా చెడ్డ బుద్ధి వల్ల సంభవించిన మా పాపాలను నీవే పోగొట్టగలవు. వాటిని నీవే పోగొట్టాలి" అనే భావంతో "యుయోధ్యస్మత్ జుహురాణ మేనో " అని ప్రార్థిస్తున్నారు.

ఇక మంత్రంలోని "భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" అనే చివరి భాగాన్ని గమనిద్దాం.

"ఈ విధంగా మా పాపాలను నీవు పోగొట్టడం కోసం నీకు మేము అనేక మార్లు నమస్కారోక్తులను పలుకుతూ, నమస్కరించి, ఆశ్రయిస్తున్నాము "అనేది దీని భావం

ఈ విధంగా మన అన్ని పాపాలను పోగొట్టి, మోక్షపర్యంతమైన ఐశ్వర్యాన్ని ఇచ్చి, మనలను మంచి మార్గానికి తీసికొని పోగలిగినవాడు శ్రీమన్నారాయణుడు ఒక్కడే. అందుచేత, ఇక్కడ ఆ స్వామినే అగ్ని శబ్దంతో వేద పురుషుడు నిర్దేశించి, మన క్షేమం కోసం ప్రార్థిస్తున్నాడు.

అదేవిధంగా, మనం కూడా మనం చేసే హోమాదికర్మల చివర పై వేదమంత్రంతో మనలను మంచి మార్గంలోకి తీసికొనిపోయే శ్రీమన్నారాయణుని ఆశ్రయించి, సేవిద్దాం. ఆ స్వామిని శరణాగతి చేద్దాం. దానివల్ల మనం సకల విధాలయిన ఐశ్వర్యాలను పొందుదాం.

# శుశ్రూష

లోకంలో మనం "శుశ్రూష "అనే పదాన్ని పలుమార్లు వింటుంటాం. తల్లిదండ్రులకు కుమారుడు సేవ చేస్తాడు, ఆచార్యులకు శిష్యుడు సేవ చేస్తాడు. ఈ విధంగా తనకంటే పెద్దవారైన వ్యక్తుల విషయంలో చేసే సేవకు శుశ్రూష అని పేరు. ఇది ఒక గొప్ప ధర్మం. మహానుభావులైనవారి సన్నిధిలో ఉండి, వారు మెచ్చిన శుశ్రూషను చేయడం అనేది ఒక విలక్షణమైన, ఉత్తమమైన ధర్మం. శుశ్రూష అనే ఈ పదానికి ఏమి అర్థం? ఆ పదం ఏ విధంగా పుట్టింది? అనేదానిని గురించిన ఒక వృత్తాంతాన్ని వేదం తెలుపుతున్నది.

పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు మొట్టమొదటగా ఈ జగత్తును సృష్టించేటపుడు మునుముందుగా మంత్రాలను అన్నిటిని ఆవిర్భవింప చేశాడు. ఈ మంత్రాలకు అన్నిటికీ అధిదేవతలు ఉన్నారు. ఈ మంత్రానికి ఇతడు దేవత, ఈ మంత్రానికి ఇతడు దేవత – అనే విధంగా మంత్రాలకు అధిదేవతలు ఉన్నారు. ఈ విధంగా భగవంతుడు మంత్రాలను సృష్టించడమే కాక, ఆయా మంత్రాలకు తగిన దేవతలను కూడా సృష్టించాడు.

భగవంతుడు మొట్టమొదటగా ఒక మంత్రాన్ని సృష్టించి, ఆ మంత్రానికి తగిన దేవతను సృష్టించాడు. ఆ మంత్ర దేవతను చూడాలి అనే ఆశ భగవంతునకు కలిగింది. అపుడు అతడు ఆ దేవతను "ఆత్మన్" అని సంబోధిస్తూ పిలిచాడు. ఆత్మ శబ్దానికి "కుమారా !"అని అర్థం. వేదంలో కూడా "ఆత్మా వై పుత్రనామాసి" అని ఈ విషయం చెప్పబడుతున్నది. అయితే, ఆ దేవత వెంటనే రాలేదు. పదిసార్లు ఆహ్వానించిన తరువాతనే ఆ దేవత రావడం జరిగింది. పదిసార్లు పిలిచిన తర్వాత ఆ దేవత వచ్చాడు కనుక, దేవతకు "దశ హూతః "అనే పేరును భగవంతుడు పెట్టాడు. (ఈ పదాన్ని "దశ హోతా" అని కూడా చెబుతారు). ఈ దేవతను అధిదేవతగా గలిగిన ఆ మంత్రానికి దశహోతృ మంత్రం అని పేరు.

తరువాత భగవంతుడు ఇంకొక దేవతను సృష్టించి, అతనిని ఇంకొక మంత్రానికి అది దేవతగా నియమించాడు. పూర్వం వలనే ఈ దేవతను కూడా చూడాలని భగవంతునకు తోచింది. అందువల్ల అతడు ఆ దేవతను "ఆత్మన్! ఆత్మన్!" అని అంటూ ఏడుసార్లు పిలిచాడు. ఆ విధంగా ఏడుసార్లు పిలిచిన తర్వాత, ఆ దేవత భగవంతుని దగ్గరకు వచ్చాడు కనుక, ఆ దేవతకు సప్త హోత అని, ఆ మంత్రానికి సప్తహోతృ మంత్రం అని పేరు వచ్చింది.

భగవంతుడు మళ్లీ ఇంకొక దేవతను సృష్టించి, అతనిని ఇంకొక మంత్రానికి అధిదేవతగా చేశాడు. ఈసారి భగవంతుడు ఈ దేవతను ఆరుసార్లు పిలిచాడు. అప్పుడు ఆ దేవత భగవంతుని దగ్గరకు వచ్చాడు. అందువల్ల ఆ దేవతకు "షడ్ఢోతా" అని, ఆ మంత్రానికి "షడ్ఢోతృమంత్రం" అని పేరు వచ్చింది.

మళ్లీ, ఇంకొకసారి, భగవంతుడు ఇంకొక దేవతను సృష్టించి, అతనిని ఐదుసార్లు పిలిచాడు. అప్పుడు ఆ దేవత భగవంతుని దగ్గరకు వచ్చాడు. కనుక, ఆ దేవతకు పంచహోత అని, అతనిని అధిదైవంగా కలిగిన ఆ మంత్రానికి పంచహోతృ మంత్రం అని పేరు వచ్చింది.

ఆ తర్వాత మళ్లీ, ఇంకొక దేవతను భగవంతుడు సృష్టించడం, అతనిని నాలుగు సార్లు పిలిచిన తరువాత ఆ దేవత భగవంతుని దగ్గరకు రావడం జరిగింది. అందువల్ల ఆ దేవతకు చతుర్ హోతా అని, ఆ మంత్రానికి చతర్ హోతృమంత్రం అని పేరు కలిగింది.

అప్పుడు చతుర్హోతా అనే ఆ దేవతను చూచి భగవంతుడు, ఈ విధంగా అన్నాడట" నాయనా! నీవు నేను నాలుగు సార్లు పిలిచినంతనే నా దగ్గరకు వచ్చావు. అందువల్ల నీవు నాకు చాలా ఇష్టమైనవాడవు. మిగిలినవారు నీవలె వెంటనే రాలేదు చాలా ఆలస్యం చేశారు. " పిలిస్తే పిలవనీ!, ఎన్నిసార్లు అయినా పిలవనీ!" అని వారు

తామసం చేశారు. కానీ, నీవు ఆ విధంగా కాకుండా, నేను పిలిచిన వెంటనే నా దగ్గరకు వచ్చావు కదా. నీవు నాలుగుసార్లు పిలిచినంతలోనే నా దగ్గరకు వచ్చావు కను, నీకు చతుర్హోత అనే పేరు స్థిరంగా నిలుస్తుంది. నిన్ను అధిదేవతగా గలిగిన మంత్రానికి చతుర్హోత్రృ మంత్రం అనే ప్రసిద్ధి వస్తుంది. అంతే కాదు, ఈ మంత్రంతో పాటు మిగిలిన మంత్రాలు కూడా చతుర్హోతృ మంత్రాలు అనే నీ పేరుతోనే పిలవబడతాయి "అని అన్నాడు. అందువల్ల. , దశహోత్ర మంత్రం మొదలైన మిగిలిన మంత్రాలకు అన్నిటికి కలిపి చతుర్హోతృ మంత్రాలు అని పేరు వచ్చింది

ఈ విధంగా నాలుగు సార్లు పిలవగానే పరమాత్మ దగ్గరకు వచ్చి, అతని సమీపంలో ఉండే ఆ దేవతకు "నేదిష్టః" అనే ప్రసిద్ధి వచ్చింది. లోకంలో కూడా తండ్రి పిలవగానే బదులు పలికి, అతని సమీపానికి వచ్చి, అతని వెంటనే ఉండే కుమారుని విషయంలో ఆ తండ్రికి చాలా ప్రేమ ఉంటుంది కదా. ఈ విషయాన్ని ఇక్కడ వేదం మనకు ఈ కథ ద్వారా తెలియజేసింది. ఈ రీతిలో తండ్రి మాటను వెంటనే మన్నించి, అతనికి సంతోషాన్ని కలిగించే రీతిలో ప్రవర్తించి, సేవ చేయడానికి "శుశ్రూష" అని పేరు.

శుశ్రూష అనే పదానికి "వినడంలో ఆశ–అని అర్థం. ఇటువంటి శుశ్రూషను చేసేవానిని ఈ లోకంలో అతని తండ్రి మిక్కిలి అభిమానించడమే కాదు, సర్వలోక పిత అయిన భగవంతుడు కూడా అతనిని మిక్కిలి అభిమానిస్తాడు– అని "నేదిష్ఠో బ్రహ్మణో భవతి" అనే సూక్తి ద్వారా. ఏ వేదం తెలుపుతున్నది. పెద్దలకు భక్తిశ్రద్ధలతో శుశ్రూషను చేయడమనేది పరమధర్మమనే విషయాన్ని తెలియజేస్తూ, పరమాత్మ ఆ ధర్మాన్ని ఆచరించేవానిని తన సమీపంలో ఉంచుకొని, అతడు చేసే కైంకర్యాన్ని ప్రియంగా స్వీకరిస్తాడు– అని వేదపురుషుడు ఈ సూక్తి ద్వారా వ్యక్తం చేస్తున్నాడు

వేదానికి అపరావతారంగా చెప్పదగిన శ్రీమద్రామాయణంలో కూడా ఈ విధమైన శశ్రూష అనే వైదికమైన, పరమ ధర్మాన్ని గురించిన ప్రస్తావన మనకు కనిపిస్తుంది.

తల్లిదండ్రులకు మిక్కిలి భక్తితో సేవ చేసే మునికుమారుని వృత్తాంతం అయోధ్యాకాండలో మనకు కనిపిస్తుంది. దీనిని దశరథుడు కౌసల్యకు తెలియజేస్తాడు. ఆ విధంగానే, తనకు పినతల్లి అయిన కైకేయిని మిక్కిలి భక్తిశ్రద్ధలతో శ్రీరాముడు శుశ్రూషను చేశాడు– అని కూడా శ్రీరామాయణం తెలియజేస్తున్నది. ఏ శాస్త్రోపదేశమైనా శుశ్రూషువు కానివానికి ఉపదేశించరాదని భగవద్గీత " న చాశుశ్రూషవే వాచ్యమ్" అనే సూక్తి ద్వారా తెలుపుతున్నది.

ఈ విధంగా వేదసిద్ధమైన, మహనీయులు అందరూ ఆచరించి చూపించిన శుశ్రూష అనే వైదికమైన పరమ ధర్మాన్ని మనం కూడా ఆచరించి, ధన్యులం అవుతాం.

# వేద కథలో– గాయత్రీ మంత్ర మహిమ

హరిః ఓమ్.
ఓజోసి బలమసి భ్రాజోసి
దేవానామ్ ధామ నామాసి
విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయుః రభిభూః
హరిః ఓమ్.

మొట్టమొదటగా మనకు ఉపదేశింపబడే మంత్రం గాయత్రీ మంత్రం. ఉపనయన సమయంలో బ్రహ్మోపదేశమని ఉపదేశింపబడే మంత్రం గాయత్రీ మంత్రమే. ఆ తర్వాత మనం మూడు వేళలలోనూ ఆ గాయత్రీ మంత్రాన్ని జపం చేస్తున్నాము. గాయత్రీ మంత్రంలో గాయత్రీ ఛందస్ అనే ఒక అంశం ఉన్నది. ఇదే గాయత్రీ దేవతగా సంభావింపబడుతున్నది. ఈ దేవత తనను ఉపాసన చేసే అందరిని రక్షిస్తున్నది. " గాయ"– తనను గానం చేసేవారిని, " త్రి"– రక్షించేది అని గాయత్రీ మంత్ర శబ్దానికి అర్థాన్ని పెద్దలు తెలియజేశారు. ఆ గాయత్రీ వైభవాన్ని గురించి తెలియజేసే ఒకానొక చిన్న, అందమైన కథ వేదంలో ఉన్నది. దానిని మనం ఇప్పుడు గమనిద్దాం.

ఒకానొక సమయంలో దేవతలకు, అసురులకు మధ్య యుద్ధాన్ని సంభవించింది. ఈ విధంగా ఈ రెండు వర్గాలవారికి మధ్య మాటిమాటికి యుద్ధం జరగడం అనేది పరిపాటి. ఈ విధంగా మాటిమాటికి వీరిద్దరి మధ్య యుద్ధం జరగడం చూసిన గాయత్రీ ఈ వీరి మధ్య జరిగే యుద్ధాన్ని నిలుపు చేయాలని భావించింది యుద్ధం సంభవించినట్లయితే రెండు వర్గాల వారికి ఎన్నో విధాలైన కష్టనష్టాలు ఉంటాయి. యుద్ధం వల్ల యుద్ధం చేసేవారికే కాకుండా, వారికి సంబంధించినవారికి, వారిపై ఆధారపడి ఉండే పిల్లలు, పశువులు మొదలైన ప్రాణులకు ఎన్నో విధాలైన కష్టాలు ఏర్పడతాయి. రెండు పక్షాల వారి ఐశ్వర్యానికి నష్టం కలుగుతుంది. ఈ సంగతులన్నీ

గమనించిన గాయత్రీ దేవి దేవతలకు, అసురులకు మధ్య యుద్ధం జరగకుండా నిలపాలని భావించింది. ఆ ప్రయత్నంలో ఆమె దేవతల బలాన్ని, ఐశ్వర్యాన్ని, ఆ విధంగానే, అసురుల బలాన్ని, ఐశ్వర్యాన్ని అంతటినీ గ్రహించి కనిపించకుండా పోయింది. ఓజస్సు, ఇంద్రియం, బలం, వీర్యం, వారి సంతానం, వారి సమస్తం, వారి ఇంటిలో ఉండే పశువులు మొదలైన ప్రాణులు— ఈ విధంగా ఉండే అన్నిటినీ గాయత్రీ దేవి తీసుకుని పోయింది. ఇందువల్ల దేవతలకు, రాక్షసులకు పరస్పరం యుద్ధం చేయడానికి సాధ్యం కాకుండా పోయింది. ఓజస్సు, ఇంద్రియశక్తి, బలం, వీర్యం మొదలైనవి ఉంటే కదా ఎవరికైనా యుద్ధం చేయడానికి సాధ్యం అవుతుంది. ఏమి ఏమీ లేకుండా యుద్ధం చేయడం ఎట్లా సాధ్యం అవుతుంది? అందువల్ల వారు ఏమి చేయాలి? అని బాగా ఆలోచించారు. "మనకు చెందిన సమస్తాన్ని గాయత్రీ దేవి తీసుకొని పోయింది కదా ఆమెనే మన వద్దకు రప్పించుకుందాం. దానివల్ల మనకు చాలా లాభం కలుగుతుంది" —అని వారంతా ఆలోచించారు. దేవతలు ఏమి ఆలోచించారంటే, "ఈ గాయత్రీ దేవి దగ్గర మనబలం, ఐశ్వర్యం మొదలైనవి అన్ని ఉన్నాయి. అసురుల బలం, ఐశ్వర్యం కూడా ఆమె దగ్గరే ఉన్నాయి. అందువల్ల గాయత్రీ దేవిని మన పక్షం వైపు వచ్చేటట్లు చేసుకోగలిగితే, మొత్తం మన దగ్గరకు వస్తుంది. అంతా మనకు సిద్ధిస్తుంది. అసురుల ఐశ్వర్యం, బలం అంతా కూడా మనకు లభిస్తుంది అందుచేత మన యుద్ధం చేయవద్దు, గాయత్రీ దేవిని మన వద్దకు వచ్చేటట్లు చేసుకుందాం" అని దేవతలు ఆలోచించారు. అసురులు కూడా ఈ విధంగానే ఆలోచించారు.

ఈ విధంగా రెండు పక్షాలవారు యుద్ధం చేయడం మానివేసి, గాయత్రీ దేవిని తమ తమ పక్షం వైపు వచ్చేటట్లు చేయడం కోసం ఆలోచించసాగారు. దానికి ఏమి ఉపాయం? అనే విషయాన్ని గురించి ఆలోచించడం ప్రారంభించారు. మెల్లిగా గాయత్రీ దేవిని తమ వద్దకు పిలిచి, తమ వైపు రమ్మని అడగాలని భావించారు. అందుకోసం వారు విశ్వకర్మను ఆ కార్యాన్ని చేయమని కోరారు. గాయత్రిని పిలిచి తమ వద్దకు ఆహ్వానించాలంటే, ఆమెను కీర్తిస్తూ కదా పిలవాలి. ఎవరినైనా పొగడి పిలిస్తే కదా, వారు

దగ్గరకు వస్తారు. ఎవరైనా మన ఇంటికి రావాలంటే, వారిని మనం పొగడుతూ పిలిచినట్లయితే, వారు మన ఇంటికి వస్తారు కదా. అందువల్ల దేవతలు "విశ్వకర్మన్" అని కీర్తిస్తూ గాయత్రిని పిలిచారు. విశ్వకర్మ అంటే –అన్ని పనులను చేయగలిగినది– అని అర్థం. ఎవరు ఏ పని చేయాలన్నా, ఆ పని చేయడానికి తగిన బలం, వీర్యం మొదలైనవి కావాలి. ఇప్పుడు అవి అన్ని గాయత్రీ దేవి దగ్గరే ఉన్నాయి కనుక, అన్ని విధాలైన కార్యాలు చేయగలిగినది అనే అర్థంలో గాయత్రిని విశ్వకర్మన్ అని దేవతలు పిలిచారు. కానీ గాయత్రీ దేవి ఆ విశ్వకర్మ దగ్గరకు రాలేదు

అప్పుడు అసురులు "దాధి" అనే పేరుతో గాయత్రిని ఆహ్వానించారు. "దాధి" అంటే– హింసించేది –అని అర్థం. ఓజస్సు బలం వీర్యం మొదలైనవి అన్ని మంచికి ఉపయోగపడతాయి, హింసించడానికి కూడా ఉపయోగపడతాయి. ఇప్పుడు అవి అన్ని గాయత్రీ దేవి దగ్గర ఉన్నాయి, కనుక వాటితో ఆమె శత్రువులను హింసించగలుగుతున్నది అనే అర్థంలో అసురులు ఆమెను ఆ విధంగా ఆహ్వానించారు. దేవతల స్వభావానికి తగినట్లుగా వారు గాయత్రీ దేవిని "అన్ని కార్యాలను నిర్వహించగలిగినది" అని పొగడుతూ పిలిచారు, దేవతలు. అసురులు అయితే, వారి స్వభావానికి తగినట్లుగా, అందరినీ హింసించేది– అనే అర్థం వచ్చేటట్లు నిర్దేశిస్తూ ఆమెను పిలిచారు.

అయినా, గాయత్రి అసురుల దగ్గరకు కూడా రాలేదు ఎందుకంటే, దేవతలైనా అసురులైనా, గాయత్రీ దేవి యొక్క వైభవంలో కొంత భాగం మాత్రమే చెప్పారు తప్ప, పూర్ణంగా ఆమెను కీర్తించలేకపోయారు. ఓజస్సు, బలం, వీర్యం మొదలైనవానిని అన్నిటిని రెండు విధాలుగాను ఉపయోగించాలి. అంటే, కార్యసాధనకు ఉపయోగించాలి, శత్రువులను నిర్జించడానికి ఉపయోగించాలి. ఈ విధంగా రెండు విధాలుగాను వాటిని ఉపయోగించాలి. ఈ విధంగా ఉండే రెండు విధాలుగా ఉండే గాయత్రి యొక్క సామర్థ్యాన్ని దేవతలు, పూర్తిగా కీర్తించలేదు, అసురులుకూడా

పూర్తిగా కీర్తించలేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క విషయాన్ని మాత్రమే చెప్పారు. అందుచేత గాయత్రీ దేవి ఎవరి దగ్గరకు వెళ్ళలేదు అప్పుడు దేవతలు బాగా ఆలోచించి, ఇంకొక మంత్రాన్ని ఉచ్చరిస్తూ గాయత్రీ దేవిని ఆహ్వానించారు. ఆ మంత్రమే – "ఓజోసి సహోసి బలమసి భ్రాజోసి" అని మొదలవుతున్న మంత్రం. " నీవే ఓజస్సు, నీవే బలం, నీవే వీర్యం, నీవే ఐశ్వర్యం, నీవే విశ్వం, నీవే సర్వం, నీవే శత్రువులను నిర్జించగలిగినదానివి "అనేది ఈ మంత్రంలోని సారార్థం. ఈ విధంగా ఈ మంత్రంలో గాయత్రీదేవి యొక్క గొప్పతనం అంతా ఇమిడి ఉన్నది. ఈ మంత్రాన్ని దేవతలు ఉచ్చరిస్తూ ఆమెను పిలిచి నందున, గాయత్రీ వైభవాన్ని వారు పూర్తిగా స్తుతిస్తూ ఆహ్వానించినట్లయినది. ఇందువల్ల గాయత్రి దేవి సంతోషించినదై, వారి వద్దకు వచ్చింది. ఈ విధంగా గాయత్రీ దేవి దేవతల దగ్గరకు వచ్చినందువల్ల వారికి ఓజస్సు, వీర్యం, బలం, ఐశ్వర్యం, శక్తి మొదలైనవి అన్ని తిరిగి ఏ కొరత చేకూరాయి. సమస్తమైన ఐశ్వర్యం వారికి సిద్ధించింది. ఇది వేద కథలోని విషయం.

అందువల్ల గాయత్రీ మంత్రాన్ని మనం ఉచ్చరిస్తే, ఈ గాయత్రీ దేవి యొక్క అనుగ్రహం చేత మనకు ఐశ్వర్యం, వీర్యం, బలం, ఓజస్సు, సంతానం మొదలైనవి అన్ని మనకు కలుగుతాయి.

ఈ గాయత్రీ మంత్రానికి అధిదేవత సవిత, అంటే, సూర్యుడు. ఆ సూర్యుడే మనకు జ్ఞానాన్ని, బలాన్ని అనుగ్రహిస్తున్నాడు. సూర్య శక్తి వల్లనే మనకు జ్ఞానం కలుగుతున్నది ఆరోగ్యం చేకూరుతున్నది. సంగ్రహంగా చెప్పాలంటే చిన్నతనంలో పిల్లలకు ఆరోగ్యం, జ్ఞానం కలగాలంటే అవి వారికి గాయత్రీమంత్రోపదేశం వల్ల, దానిని వారు జపించడం వల్ల సిద్ధిస్తాయి. ఈ గాయత్రి మంత్రాన్ని జపించినట్లయితే, దానికి అధిదేవత అయిన సూర్యుడు అనుగ్రహిస్తాడు.

ఇక్కడ మనం గమనించవలసిన ముఖ్యమైన విషయం ఏమంటే, ఈ గాయత్రికి, గాయత్రీ మంత్రానికి అధిదేవత అయిన సూర్య భగవానునకు ఈ విధంగా జ్ఞానాన్ని,

ఆరోగ్యాన్ని ఉపాసకులకు ఇవ్వగలిగిన శక్తి శ్రీమన్నారాయణుని వీరికి అంతర్యామిగా వేంచేసి ఉండే వల్లనే కలిగింది. అందువల్ల గాయత్రీ మంత్రాన్ని మనం ఉపవాసించేటప్పుడు సూర్య మండలంలో అంతర్యామిగా మధ్యన వేంచేసి ఉండే లక్ష్మీనారాయణుని మనసులో మనం ధ్యానించి ఉపాసించాలి.

. "ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణః సరసిజాసన సన్నివిష్టః,
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః "

అనే ధ్యానశ్లోకంతో సూర్యమండలం మధ్యలో వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుని ఉపాసించే క్రమం ప్రసిద్ధం కదా. ఈ విధంగా, సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణని అనుగ్రహంచేత విద్యార్థులకు ఆవశ్యకమైన బుద్ధికుశలత, జ్ఞానం, ఆరోగ్యం మొదలైనవి అన్నీ సిద్ధించడమే కాక, గాయత్రీ మంత్రోపాసన వల్ల అందరికీ కూడా ఆరోగ్యం, జ్ఞానం, బుద్ధి, బలం పెంపొందుతాయి. – అనే ముఖ్యమైన విషయం ఈ వేదోపాఖ్యానం వల్ల మనకు తెలుస్తున్నది.

# వేదోపమానాలు

"అనంతా వై వేదాః" – వేదాలు అనంతాలు –అని చెప్పబడుతున్నది. ఈ విధంగా అనంతమై ఉండే వేదాలను పరిమితంగా ఉండే మన జీవిత కాలంలో ఏ విధంగా అధ్యయనం చేయడం? వాటిని ఏ విధంగా తెలుసుకోవడం? " అనంతపారం బహు వేదితవ్యం ఆల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః" అనే విధంగా తెలుసుకోవలసిన విషయం అంతు లేనిది. చాలా ఉన్నది. కాలమేమో, చాలా అల్పంగా ఉన్నది. ఎదురయ్యే ఆటంకాలు కూడా అనేకంగా ఉన్నాయి. ఆ ఆటంకాలకు ఆటంకాలే లేవు. వేదంలో తెలియవలసిన అర్థాలు అనంతాలుగా ఉన్నాయి. "తెలిసినది గుప్పెడు, తెలుసుకోవలసినది కొండంత" అనే విషయం వేదంలోనే భరద్వాజమహర్షివృత్తాంతంలో తెలుపబడింది కదా. అందుచేత వేదనలోని తత్వాన్ని ఏ విధంగా గ్రహించడం? అని ఈ విధమైన సందేహం మనకు జీవితంలో నిత్యం కలుగుతూనే ఉంటుంది.

వేదాన్ని అధ్యయనం చేయడం చాలా ముఖ్యమైనది. వేదార్థాన్ని గ్రహించడం అనేది ఇంకా అంతకంటే ముఖ్యమైనది. వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేయడం అనేది మన జీవితంలో సాధ్యం కాని పని కనుక, ఆ వేదంలో అత్యంత ఉపయుక్తమైన భాగాలను అయినా అధ్యయనం చేసి వాటి అర్థాన్ని తెలుసుకోవడం చాలా ఆవశ్యకమైనది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీమద్వేదాంతదేశికులు "ఉపయుక్తేషు వైశద్యం త్రివర్గనిరపేక్షతా, కరణత్రయ సారూప్య మితి సౌఖ్య రసాయనమ్" అని వేదాలలోని ఉపయుక్త భాగాలను తెలుసుకోవడం సుఖ జీవనానికి గొప్ప రసాయనం – అని అన్నారు

తెలుసుకోవలసిన విషయాలు అనేకంగా ఉన్నప్పటికీ, ముఖ్యమైన అంశాలను అయినా మనం ఆచార్యుల మూలంగా గ్రహించాలి. అమూల్యమైన భగవంతుడు మనకిచ్చిన కాలం అనే సంపదను వ్యర్థం చేయకూడదు. వ్యర్థమైన విషయాలతో

గడపకూడదు. వేదాన్ని పూర్ణంగా తెలిసినవాడు అనే వ్యక్తి లోకంలో ఎవరూ లేకపోయినా, తాను గ్రహించిన వేదభాగంలోని తాత్పర్యాన్ని అయినా గ్రహించాలి. ఆ విధంగా వేద తాత్పర్యాన్ని గ్రహించినవానిని వేదం పొగడుతున్నది. ఎవడు తనను భక్తితో ఆరాధిస్తున్నాడో, ఆ మహనీయునకు వేదకాంత తన స్వరూపాన్ని తానే స్వయంగా ప్రకాశింప చేస్తుంది. ఈ విషయాన్ని వేదమే స్వయంగా "జాయేవ పత్యుః ఉశతీ సువాసాః" అని ఒక చక్కని లౌకికమైన, మనోహరమైన ఉపమానంతో తెలుపుతున్నది. లోకంలో కూడా, ఒక విషయాన్ని తెలియజేసేటప్పుడు దానిని ఒక చక్కని, తగిన ఉదాహరణతో పోల్చి చెప్పినట్లయితే, ఆ విషయం సులభంగా, స్పష్టంగా అర్థం అవుతుంది కదా. ఈ ప్రక్రియ లోకంలో అంతటా మనకు కనిపిస్తున్నది. ఇదే రీతిలో వేదం కూడా, వేద తాత్పర్యాన్ని తెలిసిన వ్యక్తికి తన స్వరూపాన్ని తానే స్పష్టంగా ప్రకాశింప జేస్తుంది –అనే విషయాన్ని ఒక మనోహరమైన, శృంగార రసాత్మకమైన ఉపమానంతో తెలియజేసింది.

పైన వేదం చెప్పిన ఉదాహరణలోని తాత్పర్యం ఏమంటే– ఒక అందమైన రూపాన్ని కలిగిన పతివ్రత, తనను ప్రేమించే భర్తకు తన స్వరూపాన్ని ఏ విధంగా దర్శింపజేసి, తనను అర్పించుకుంటుందో, ఆ విధంగాన, వేదకాంత కూడా, తన స్వరూపాన్ని, తనను, ఆరాధించే వ్యక్తికి ప్రకాశింప చేస్తుంది –అని పై ఉదాహరణలోని తాత్పర్యం.

లోకంలో సర్వసాధారణమైన, అందరికీ అర్థమయ్యే రీతిలోని ఉదాహరణలను చెప్పినప్పుడే చెప్పబడుతున్న అర్థం స్పష్టంగా అర్థం అవుతుంది. ఈ ప్రక్రియలోని అనుసరిస్తూ, వేదం లౌకికమైన అందమైన పై ఉదాహరణాన్ని ప్రస్తావించింది– అని మనం గమనించాలి. మన పట్ల చాలా వాత్సల్యాన్ని కలిగినది కదా వేదం. వాల్మీకి, కాళిదాసు మొదలైన మహాకవులు కూడా ఇదే ప్రక్రియను అనుసరించారు. కవుల కావ్యాలలో

అడుగడుగునా ఇటువంటి, మనోహరమైన ఉపమానాలతో చెప్పదలచిన అర్థాన్ని తెలిపే ప్రక్రియను మనం గమనించవచ్చు.

అయితే, ఇక్కడ ఒక సందేహం మనకు కలుగవచ్చు. తుచ్ఛమైన, లౌకికశృంగార రసాత్మకమైన ఉదాహరణతో ఇక్కడ వేదం చెప్పదలచిన అర్థాన్ని చెప్పడంలో ఏమి తాత్పర్యం? మన హితాన్ని కోరే వేదం పరమార్థాన్ని కదా తెలిసేయాలి? ఈ విధంగా లౌకికమైన, అల్పమైన ఉదాహరణలతో ప్రస్తావించవచ్చునా?— అనేది ఆ సందేహం. ఇక్కడ వనం గమనించవలసిన విషయం ఏమంటే, వేదం మన పట్ల వాత్సల్యాన్ని కలిగినది కనుక, మనకు తెలిసిన భాషలో, మనకు అర్థమయ్యే రీతిలో ఉపమానాలతో చతాను చెప్పదలచిన విషయాన్ని చెప్పినప్పుడే, మనం దానిలోని అర్థాన్ని గ్రహించే అవకాశం ఉన్నది, కనుక, మన స్థితిని దృష్టిలో పెట్టుకొని ఇటువంటి ఉదాహరణలను వేదం ప్రస్తావిస్తున్నది— అనే సత్యాన్ని గమనించాలి. అలౌకికమైన అదృష్టవంతాలను ఉదాహరిస్తే, వాటిలోని తాత్పర్యాన్ని మనం సులభంగా గ్రహించలేము కదా. శ్రీరామాయణంలో కూడా శ్రీరామచంద్రుని గుణాలను వర్ణించే వాల్మీకి "సముద్ర ఇవ గాంభీర్యే" అని శ్రీరాముని గాంభీర్య గుణానికి సముద్రాన్ని ఉదాహరణగా చెప్పడం కూడా ఇటువంటిదే. వాస్తవానికి శ్రీరాముని గాంభీర్య గుణానికి సముద్రం ఎంత మాత్రం సాటి కాదు కదా. ఈ విధంగా చక్కని ఉపమానాలతో తాను తెలియజేయదలచిన విషయాలను అందంగా మనకు ఉపదేశిస్తూ, వేదం మన హృదయాలను ఆకర్షిస్తుంది.

వేదంలో చివరి భాగం, అంటే, శిరోభాగం వేదాంతం అనబడుతుంది. ఇందులో బ్రహ్మతత్వం ఉపదేశింపబడింది బ్రహ్మస్వరూపం ఎటువంటిది?, బ్రహ్మను మనం పొందడం ఏ విధంగా?, ఆ పరమాత్మను పొందినందు వల్ల కలిగే ఆనందం ఎటువంటిది? అనే విషయాలను అన్నిటిని ఈ భాగం మనకు తెలియజేస్తున్నది. ఈ విధంగా తెలియజేయడానికి కారణం ఏమంటే, "ప్రయోజన మనుద్ధిశ్య న మందోఽపి ప్రవర్తతే" అనే విధంగా ఏ ప్రయోజనం లేకుండా లోకంలో ఎవరు ఏ పనిని చేయరు కదా. తెలివి

తక్కువవాడు కూడా తాను చేసే పనికి ఏమి ప్రయోజనం అని ఆలోచిస్తాడు కదా. అందుచేత, వేదాంతం బ్రహ్మప్రాప్తివల్ల మనకు కలిగే ప్రయోజనం బ్రహ్మానందప్రాప్తి అని మనకు తెలుపుతున్నది. ఈ విధంగా బ్రహ్మ ప్రాప్తి అనేది ప్రయోజనంతో కూడినది అనే విషయాన్ని వివరించే సందర్భంలో వేదం మనకు ఒక చక్కని ఉదాహరణతో దానిని వివరిస్తున్నది.

లోకంలో 9 విధాలైన రసాలు ఉన్నాయి అని అలంకారికుల సిద్ధాంతం. వీటిలో సర్వజీవసాధారణమైనది, అందరూ మెచ్చేది శృంగారసమే కదా. అందుచేత అది ఉన్నతమైన స్థానాన్ని అధిరోహిస్తున్నది. "శృంగం ఇయర్తి" అని శృంగార శబ్దవ్యుత్పత్తి ఈ విషయాన్ని తెలియజేస్తున్నది. వేదం కూడా ఈ విషయాన్ని గ్రహించి తాను చెప్పదలచిన ఉపదేశాన్ని ఒక అందమైన, అందాల రసాత్మకమైన ఉమానంతో తెలుపుతున్నది.

భగవంతుని వర్ణించేటప్పుడు వేదం " సర్వగంధః సర్వరసః", అంటే, భగవంతుడు అన్ని విధాలైన సుగందాలను కలిగినవాడు, సకల రసస్వరూపుడు— అని తెలియజేసింది. వేరొక చోట ఉపనిషత్తు " రసో వై సః" అని భగవంతుని సకల రసస్వరూపిగా తెలియజేసి. " రసగ్ మ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని సర్వరసాత్మకుడైన పరమాత్మను పొందిన ముక్తుడు ఆనందాన్ని పొందుతున్నాడని తెలిపింది.

ఈ విధంగా భగవంతుని పొందినవాడు పొందే ఆనందం ఎటువంటిది? అనే విషయాన్ని కూడా వేదం ఒక మనోహరమైన ఉదాహరణతో తెలియజేస్తున్నది. వాస్తవానికి బ్రహ్మానందం అనిర్వచనీయమైనది. దానిని సాక్షాత్తుగా అనుభవించినప్పుడే అది ఎటువంటిదో తెలియడానికి సాధ్యమవుతుంది. కానీ, మనం ఆ బ్రహ్మప్రాప్తివల్ల బ్రహ్మానందాన్ని పొందాలని ప్రయత్నం చేస్తున్నానము కనుక, అది ఎటువంటిదో, ఎంత గొప్పదో మనకు తెలియజేయడం తన కర్తవ్యం అని వేదం బావించి, ఒక లౌకికమైన,

మధురమైన ఉదాహరణను ప్రస్తావిస్తున్నది. ఈ విధమైన మనకు తెలిసిన దృష్టాంతాన్ని పలికితే, దానివల్ల మనకు, ఏ ఆ ఆనందం పట్ల అభిరుచి కలుగుతుంది కదా. మనకు బ్రహ్మానందం పట్ల ఆసక్తి, అభిరుచి కలగడం కోసం వేదం మనకు తెలిసిన రీతిలో ఒక చక్కని ఉదాహరణతో దానిని మనకు తెలుపుతున్నది.

ఆ ఉదాహరణ ఏమంటే "తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తః న బాహ్యం కించన వేద" – "తనకు ప్రియమైన పత్నిచే ఆలింగనం చేసుకోబడినవాడు ఏ విధంగా వాక్యవిషయాలను తెలియడో, ఆ విధంగానే బ్రహ్మానంద ప్రాప్తిని పొందినవాడు ఇక ఏ విషయాన్ని తెలియడు" అని ఒక అందమైన, శృంగార రసాత్మకమైన దృష్టాంతాన్ని వేదం ఇక్కడ తెలియజేసింది.

ఇక్కడ కూడా ఈ లౌకికమైన ఉదాహరణను అలౌకికమైన బ్రహ్మానందానికి నిదర్శనంగా వేదం పలకడంలో ఉద్దేశం మనకు బ్రహ్మానంద వైభవం ఎటువంటిదో సులభంగా అర్థం కావడం కోసమే అనే వాస్తవాన్ని గుర్తించాలి. అల్పమైనది, తాత్కాలికమైనది, పరిమితమైనది, కేవలం శారీరకమైనది అయిన భార్యాలింగనంలో కలిగే ఆనందాన్ని అనిర్వచనీయమైన, అలౌకికమైన, అంతు లేని వైభవాన్ని కలిగిన బ్రహ్మానందానికి ఉదాహరణగా పలకడం మన మనసుకు ఆ బ్రహ్మానందం పట్ల అభిరుచిని కలిగించడానికి కోసమే. ఈ ప్రక్రియను అనువదిస్తూ, నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో " ఎల్లైయిల్ అన్నలమ్ పుల్ గు "అని అన్నారు. ఇక్కడ చేయబడిన "పుల్గు" అనే ప్రయోగంవలన బ్రహ్మానందానుభూతి అంగనాపరిష్వంగంవలె చాలా మనోహరమైనది, కోరదగినది –అని తెలుపబడిందని పూర్వాచార్యులు వివరించారు.

ఇటువంటి అందమైన ఉపమానాలు వేదంలో మనకు ఎన్నో కనిపిస్తాయి.

# వేదాలు భగవంతుని నిఃశ్వాసరూపాలు

"వేదాలు భగవంతుని నిఃశ్వాస రూపాలు" అనే విషయం గూర్చి కొన్ని అంశాలను తెలుసుకోవడం ద్వారా వేద మహిమలను గ్రహిద్దాం.

వేదాలు భగవంతుని నిఃశ్వాస రూపాలు– అనే విషయాన్ని ఎవరు అన్నారు ?అని ప్రశ్నించుకున్నప్పుడు, ఆ విషయాన్ని వేదమే మొదట చెప్పింది, తరువాత ఆ విషయాన్ని అనుసరిస్తూ ఎన్నో గ్రంథాలు దానిని తెలియజేశాయి.

వేదంలో బృహదారణ్యకం అనే ఒక భాగం ఉన్నది. అందులో ఈ వాక్యం ఒకటి కనబడుతున్నది. " తస్య హ వా ఏతస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతత్ ఇతి ఋగ్వేదో యజుర్వేద సామవేదోఽథర్వవేదః". ఈ వాక్యంలో "మహతో భూతస్య" – అంటే, "ఏకో విష్ణుః మహద్భూతమ్" అని విష్ణువునకు మహద్భూతమ్ అనే పేరు ఉన్నందున, ఈ వాక్యంలో "మహతో భూతస్య" అనే పదం ద్వారా విష్ణువు చెప్పబడుతున్నాడు. ఆ విష్ణువు యొక్క నిఃశ్వసితం, అనగా, ఊపిరియై ఉన్నవి– ఈ ఋగ్వేదం, సామ యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం –అనే నాలుగు వేదాలు అనే అర్థాన్ని ఈ ఉపనిషద్వాక్యం ద్వారా చెప్పబడింది

వేదాలు భగవంతుని నిఃశ్వాస రూపాలు– అని చెప్పాలంటే, ఆ రెండిటికి మధ్య ఏమేమి సామ్యాలు ఉండాలి? అని ఆలోచిస్తే, మనకు రెండు సామ్యాలు సులభంగానే మనసుకు తోస్తాయి. వేదాలు అయినా, నిఃశ్వాసాలు అయినా, భగవంతుని ముఖం నుండి ఆవిర్భవించాయి –అనేది ఒక సామ్యం, రెండవది ఏమంటే– నిఃశ్వాసం అనేది ప్రాణం వంటిది. ఆ విధంగానే, వేదం కూడా ప్రాణ సమానమైనది అనేది –రెండవ సామ్యం. అయితే, కేవలం ఈ రెండు పోలికలు మాత్రమే కాదు, మన పెద్దలు భగవంతుని నిశ్వాసాలకు, వేదాలకు మధ్య ఉండే చాలా సామ్యాలను మనకు తెలియజేశారు.

వాటిలో ఒక సామ్యాన్ని ఆదిశంకరభగవత్పాదులు తెలియజేస్తున్నారు వారు పైన ప్రస్తావించిన ఉపనిషద్వాక్యానికి వ్యాఖ్యానాన్ని వ్రాస్తూ, " యథా అప్రయత్నేనైవ పురుష నిఃశ్వాసః" అని ఒక సామ్యాన్ని వేదాలకు, నిఃశ్వాసాలకు మధ్య సూచించారు. ఒక వ్యక్తికి నిఃశ్వాసం అనేది అప్రయత్నంగానే వెలువబడుతుంది అనే విషయాన్ని మనలను గమనించమని వారు సూచిస్తున్నారు. ఒక వ్యక్తి ఒక పెద్ద బరువును మోయడానికి, లేదా, చాలా దూరం వేగంగా పరిగెత్తడానికి పెద్ద ప్రయత్నం చేయాలి అనే విషయం మనకు తెలుసు. ఆ విధంగా ఎటువంటి ప్రయత్నం లేకుండానే, మనకు తెలియకుండానే మనం నిఃశ్వాసాన్ని వెలువరిస్తున్నాము. ఆ విధంగానే, మన నిద్రపోయేటప్పుడు కూడా అప్రయత్నంగానే ఊపిరి వదులుతూనే ఉంటాము. ఈ విషయం మనకు స్పష్టంగానే తెలుస్తుంది. నిఃశ్వాసం పురుషుని ఏ విధమైన ప్రయత్నాన్ని అపేక్షించడం లేదు– అనే సంగతి స్పష్టమవుతున్నది. ఆ విధంగానే వేదం కూడా ఏ విధమైన పురుషప్రయత్నం లేకుండానే వ్యక్తమైనది. అది ఆ పౌరుషేయం. అది ఎల్లప్పుడూ, ఎవరి ప్రయత్నం లేకుండానే నిరంతరంగా కొనసాగాలి– అని భగవంతునిచే సంకల్పించబడింది. అందుచేత వేదం భగవంతుని నిఃశ్వాసం వంటిది– అనే ఒక సామ్యాన్ని శంకరులు సూచించారు.

ఎందుచేత వేదం నిఃశ్వాసంతో పోలి ఉన్నది? అని అడిగితే, ముఖంనుండి వెలువబడుతున్నందున, ఏ ప్రయత్నం లేకుండానే వ్యక్తమవుతున్నందున వేదం నిఃశ్వాసంతో పోలినది– అనే విషయాన్ని మనం ఇంతవరకు గమనించాం.

అయితే, ఇంత మాత్రమే కాకుండా, ఇంకా ఎన్నో సామ్యాలు ఈ రెండిటికి మధ్య ఉండే విషయాన్ని ఎన్నో గ్రంథాలు మనకు తెలియజేస్తున్నాయి. ఉదాహరణకు భాగవత మహాపురాణంలో ఒక శ్లోకం ఉన్నది. భగవంతుని నాసిక నుండి నిఃశ్వాసం వెలువడినట్లుగా నా స్వామి నాసికనుండి వేదం కూడా వెలువబడుతున్నది –అని ఈ

శ్లోకం తెలియజేస్తున్నది. "వాచో బభూవు రుశతీః శ్వసతోఽస్య న స్తః" అనేది ఆ భాగవత సూక్తి. భగవంతుడు తన నాసిక నుండి నిశ్వాసాలను వెలువరించేటప్పుడు, ఆ నిఃశ్వాస వాయువులతో పాటు వేదాలు కూడా ఆ నాసిక నుండే వెలువడ్డాయి– అని ఇందులో చెప్పబడింది ఈ విధంగా వేదాలు, నిఃశ్వాసాలు– అనే రెండు కూడా ముక్కునుండి వెలువడిన కారణంచేత ఈ రెండిటికి మధ్య ఈ విధమైన, అంటే, రెండు భగవంతుని నాసిక నుండే ఆవిర్భవించడం అనే పోలికను కలిగి ఉన్నాయి.

ఇప్పుడు, ఇంతకంటే ఇంకొక సామ్యాన్ని మనం గమనించడం కోసం దేశికుల దేవనాయక పంచాశత్ స్తోత్రంలోని ఒక సూక్తిని గమనిద్దాం. " నిత్యోదితైః నిగమనిఃస్వసితైః తవైషా నాసా నభశ్చరపతే!నయనాబ్ధిహేతుః, ఆమ్రేడిత ప్రియతమా ముఖపద్మగంధైః ఆశ్వాసినీ భవతి సంపతి ముహ్యతో మే" అనేది ఆ సూక్తి. ఈ శ్లోకంలో భగవంతుని నిఃశ్వాసానికి, నిగమానికి ఇంకా చాలా సామ్యాలు దేశికుల చేత సూచింపబడ్డాయి వీటిని దేశికులు చాలా ఆచమత్కారంగా శబ్దం ద్వారా కాకుండా, అర్థం ద్వారా సూచిస్తున్నారు. వాటిలో కొన్నిటిని గమనిద్దాం.

"నిత్యోదితైః "– వేదాలు నిత్యోదితాలు, అంటే, ఎల్లప్పుడూ ఆవిర్భవిస్తూనే ఉంటాయి. ఆ విధంగానే, నిఃశ్వాసాలు కూడా నిత్యంగా వెలువడేవే. "నభశ్చరపతేః"– నిగమం, నిఃశ్వాసం– అనే ఈ రెండు కూడా నభశ్చరాలే. ఆకాశంలో సంచరించేవే. ఈ నిగమాలకు, వేదాలకు ఈ రెండిటికి పతి దేవనాథుడే. "నయనాబ్ధి"– నిగమం, భగవత్ సమీపనయనం. నిఃశ్వాసం భగవన్నయన సమీపం. నాసిక నేత్రసమీపంలో ఉంటుంది కదా. నిగమం ఆశ్వాసనం కలిగిస్తుంది, నిఃశ్వాసం కూడా ఆశ్వాసనం కలిగిస్తుంది. నిగమం ఆమ్రేడితం. ఆ విధంగానే, నిఃశ్వాసం కూడా ఆమ్రేడితమే. మాటిమాటికి విలువరింపబడేది. నిగమం లేకపోయినా మోహం, అంటే, అజ్ఞానం కలుగుతుంది. ఆ విధంగానే, నిఃశ్వాసం లేకపోయినా, మోహం, అంటే మూర్ఛ కలుగుతుంది. ఈ విధంగా నిగమానికి, నిఃశ్వాసానికి మధ్య చాలా అందమైన పోలికలను దేశికులు సూచించారు.

"నిత్యోదితైః"– నిగమపక్షంలో ఏమి అర్థం? అంటే, ఉదితం అంటే, చెప్పబడినది –అని అర్థం. " నిత్యో నిత్యానామమ" అనే విధంగా నిత్యశబ్దంచేత భగవంతుడు చెప్పబడతాడు. ఈ విధంగా నిత్య శబ్దంచేత చెప్పబడే భగవంతుని చేత ఎల్లప్పుడూ చెప్పబడేది– అని అర్థం. లేక, నిత్యం, అంటే, ఎల్లప్పుడూ అధ్యయనం చేయబడేది– అనికూడా అర్థం. ఈ బ్రహ్మాండంలో ప్రతిక్షణం ఎక్కడో ఒకచోట, ఎవరో ఒకరు, వేదాన్ని అధ్యయనం చేస్తూనే ఉంటారు. ఈ ప్రయోగానికి నిఃశ్వాస పక్షంలో అర్థం చెప్పేటప్పుడు, నిత్యం –ఎల్లప్పుడూ, ఉదితం– వెలువడేది, నాసిక నుండి వెలువడేది –అని అర్థం.

"–నభశ్చర"– ఈ శబ్దానికి వేదపక్షంలో ఏమని అర్థం? అంటే, వేదాలు అంతరిక్షంలో తరంగాల రూపంగా సంచరిస్తూ ఉంటాయి. వాటిని మహర్షులు తమ తపఃశక్తితో దర్శించి, మంత్రాల రూపంలో మనకు అనుగ్రహిస్తున్నారు. ఈ విషయాన్ని మనకు స్మృతులు తెలియజేస్తున్నాయి కూడా. ఇక, నిఃశ్వాసపక్షంలో ఏమని అర్థం? అంటే, నాసిక నుండి వెలువడిన నిఃశ్వాసం వాయు రూపం కనుక, అది ఆకాశంలో సంచరిస్తుంది. ఏ వాయువు అయినా ఆకాశంలోనే సంచరిస్తుంది కదా.

నిగమం ఆశ్వాసనం కలిగిస్తుంది, అంటే, మనకు ఓదార్పును, అంటే జ్ఞానాన్ని కలిగించడం ద్వారా అజ్ఞానాన్ని తీర్చి, మనకు ఊరటను కలిగిస్తుంది– అని అర్థం. ఇక, నిఃశ్వాసం విషయంలో చూస్తే, అది కూడా మనకు ఆశ్వాసనం కలిగిస్తుంది. నిఃశ్వాసం వెలువడడం చేత మనకు అలసట లేకుండా, శరీరంలో ఊరట కలుగుతుంది కదా. ఆ –సమంతాత్, లేక, ఆ–ఈషత్, శ్వాసనం కలిగిస్తుంది, బడలికను తీరుస్తుంది –అని అర్థం. నిగమం అంతర్హితమైతే, మోహం కలుగుతుంది, అంటే, అజ్ఞానం కలుగుతుంది, నిగమం వ్యక్తమైతే, అజ్ఞానం తీరిపోతుంది. నిఃశ్వాసం అంతరించిపోయినా మోహం కలుగుతుంది. శ్వాసకు నిరోధం కలిగితే తెలివి లేకుండా పోతుంది కదా. శ్వాసం మళ్ళీ

ఆడితే, పోయిన తెలివి మళ్లీ వస్తుంది. ఈ విధంగా వేదాలకు, (భగవంతుని) నిఃశ్వాసాలకు మధ్య చాలా పోలికలు ఉన్నాయి.

దీనిని అనుసరించి, దేశికులకు అనంతర కాలంలో పుట్టిన అప్పయ్య దీక్షితులు అనే మహా పండితులు తమ నయమయూఖమాలిక అనే గ్రంథంలో హయగ్రీవ స్వామికి ఒక మంగళశ్లోకాన్ని రచిస్తూ, "నిఃశ్వాస పంక్తిం నిఖిలామపి త్రయీమ్, అశ్వాననః పాతు స వ శ్చిరం హరిః" అని అన్నారు. ఇక్కడ వీరు శబ్దాలతో చమత్కారంగా పలుకుతున్నారు. హయగ్రీవులు అశ్వాస్యులు. అంటే, అశ్వముఖాన్ని కలవారు. ఆ స్వామి అశ్వాస్యులు అయినప్పుడు, మనం ఆశ్వాస్యులమై ఉన్నాము– అని కవి అంటున్నారు. ఆశ్వాస్యులు అంటే, ఆశ్వాసాన్ని, అంటే, ఓదార్పును పొందడానికి తగినవారు– అని అర్థం. మనం వారి పట్ల విశ్వాసాన్ని కలిగి ఉండాలి. అపుడు వారు మనకు తమ నిఃశ్వాసాన్ని అనుగ్రహిస్తారు– అని అంటున్నారు. అశ్వాస్యులు అయిన హయగ్రీవులు విశ్వాసాన్ని కలిగినవారికి తమ నిఃశ్వాసాన్ని అనుగ్రహించి, ఆశ్వాస్యులనుగా, అంటే, ఆశ్వాసాన్ని పొందినవారినిగా చేస్తున్నారు–< అనేది ఇక్కడ శబ్దచమత్కారం.

ఈ విధంగా వేదాలు నిఃశ్వసితంవంటివి –అనే విషయాన్ని ఇంకా పలువురు పండితులు తెలియజేశారు. వేదభాష్యాలలో ప్రసిద్ధమైన సాయణ భాష్యం " యస్య నిఃశ్వసితం వేదా యో వేదోభ్యోఽఖిలం జగత్" అనే వేదాలు భగవంతుని నిఃశ్వాసాలు– అని పలికే మంగళ శ్లోకంతో ఆరంభమవుతున్నది. యాదవభ్యుదయ మహాకావ్యంలో దేశికులు "నిగమనిఃశ్వసితం స్వసుతస్య తత్ " అని అంటూ వేదాలు భగవంతుని నిఃశ్వాసాలు –అని అన్నారు. ఈ విధంగానే ఇంకా ఎన్నో గ్రంథాలు వేదాలు భగవంతుని నిఃశ్వాసరూపాలు– అనే విషయాన్ని తెలుపుతున్నాయి.

దీనివల్ల వేదానికి కల ఎన్నో మహిమలు ఇక్కడ మనకు వ్యక్తం అయ్యాయి. సంగ్రహంగా చెప్పినట్లయితే,

1)వేదం భగవంతునకు చెందినది,

2)వేదం ప్రాణం వలె ముఖ్యమైనది,

3) వేదం అపౌరుషేయమైనది,

4)వేదం భగవంతునినుండి వ్యక్తమైనది,

5) వేదం నిత్యమైనది,

6)వేదం ఆకాశంలో ఎల్లప్పుడూ సంచరిస్తూ ఉంటుంది,

7)వేదం మనకు జ్ఞానాన్ని వివేకాన్ని కలిగిస్తుంది,

8) వేదం మన మోహాన్ని తీరుస్తుంది– అని ఎనిమిది విధాలయిన వేద మహిమలను మనం గ్రహించాము.

వేదం అమూల్యమైనది. దానిని మనం కాపాడుకుందాం.

# వేదం – అరణ్యం

“వేదం అరణ్యంతో సమానమైనది”అనే విషయాన్ని గూర్చి ప్రస్తావించడం ద్వారా వేద మహిమను తెలుసుకోవడానికి ప్రయత్నం చేద్దాం.

వేదం అనే కాననం అని, వేదం అనే విపినం అని ఆచార్య చంపువు అనే గ్రంథం తెలుపుతున్నది. “ కాన్ ఎన్ఱ వేదంగళ్” అని చరమ శ్లోక చ్చురుక్కు అనే గ్రంథం తెలియజేస్తున్నది. వేదం అనే అరణ్యకం అని యాదవాభ్యుదయ మహాకావ్యం తెలుపుతున్నది. ఇపుడు అరణ్యానికి, వేదానికి మధ్య ఉండే పోలికలు ఏ రీతిలో ఉన్నాయి?అనే విషయాన్ని ఆలోచిద్దాం.

మొదటగా, ఈ రెండిటికీ పేరులో సామ్యం. వేదానికి, అడవికి, ఈ రెండిటికి అరణ్యకం అనే పేరు ఉన్నది. ఏ విధంగా అంటే, వేదాలలోని కొన్ని భాగాలకు తైత్తిరీయ ఆరణ్యకం, అని బృహదారణ్యకం అని– ఈ విధంగా నామాలు ఉన్నాయి. అడవికి అరణ్యం అనే పేరు ఉండడం ప్రసిద్ధమే. రెండవ సామ్యం ఏమంటే, ఈ రెండూ కూడా గహనమే. దట్టంగా ఉండేవే. అంటే, లోపలికి ప్రవేశించి తెలుసుకోవడానికి వీలు లేనివే. మూడవ సామ్యం ఏమంటే, ఈ రెండిటిలోనూ తెలుసుకోవడానికి వీలు కాకుండా మరగుపడి ఉండే స్థానాలు చాలా ఉండడం. నాలుగవ పోలిక ఏమంటే, ఈ రెండిటిని లౌకిక జీవనాన్ని కోరనివారు ఆశ్రయిస్తారు అనేది. ఈ విషయంలో మనం యాదవాభ్యుదయ కావ్యంలోని ఒక సూక్తిని కూడా గమనించబోతాం. తరువాత, సామ్యం ఏమంటే, ఈ రెండు కూడా భగవంతునిచే రక్షింపబడడం. వేదం విషయంలో ఈ సంగతి స్పష్టమైనదే, ఇక అరణ్యంలో సంచరించేవారిని రక్షించగలిగినవాడు భగవంతుడు ఒక్కడే కదా. తరువాత, సామ్యం ఏమంటే, ఈ రెండిటిలోనూ, గుహలోని వసించే సింహం నివసించడం. రెండిటిలోనూ, నెమలి ఆనందంగా వివరించడం –అనేవి. ఇంకొక సామ్యం

ఏమంటే– వేదంలో నెమలి ఆనందంగా విహరిస్తున్నది? అనేది. ఈ విషయాన్ని కూడా మనం గమనించబోతాం.

మొదటగా ఒక యాదవభ్యుదయ శ్లోకాన్ని గమనిద్దాం. "బద్ధం తథా భావయతాం ముకుందమ్, అయత్నవిచ్ఛేదిని కర్మ బంధే, తపస్వినీ తత్క్రతునీతిరాద్యా సవ్రీడ మారణ్యగుహాసు తస్థౌ" అనేది ఆ శ్లోకం. ఇది చాలా చమత్కారమైన శ్లోకం. వేదంలో తత్క్రతు నీతి అనే ఒక న్యాయం ఉన్నది. ఆ న్యాయం ఏమి తెలియజేస్తున్నది ?అంటే, "మానవుల భావనకు బలం అధికం "అని. అది ఏవిధంగా అంటే, "అథ యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి, తథేతః ప్రేత్య భవతి" అని అంటూ ఒక చాందోగ్యోపనిషత్ వాక్యం ఈ న్యాయాన్ని తెలుపుతున్నది. దీనికి ఏమి అర్థం అంటే, ఒక మానవుడు తాను ఏ విధంగా భావిస్తున్నాడో, ఆ విధంగా అవుతున్నాడు– అని. అంటే, ఈ లోకంలో అతడు ఏ భావనలతో జీవిస్తాడో, అతడు మరణించిన తరువాత కూడా ఆ విధంగానే, ఆ భావనలకు అనుగుణంగానే కాగలడు –అని ఈ వాక్యం తెలుపుతున్నది. ఉదాహరణకు, ఒకడు జీవించి ఉండే సమయంలో దైవికమైన భావనలతో జీవితాన్ని గడిపితే, అతడు మరణించిన తరువాత, దివ్యుడు అవుతాడు. ఆ విధంగానే, ఆసురమైన భావాలతో కాలం గడిపితే, దానికి తగినట్లే, అసురుడుగా, భూతంగా, పిశాచిగా అవుతాడు. ఒక ముని తాను పెంచే జింకను గూర్చి సదాతలుస్తూ కాలం గడిపేడు. అతడు మరణించిన తరువాత కూడా జింకగానే పుట్టాడు– అని పురాణాలలో ఒక కథ ఉన్నది. దీనికి తత్క్రతు నీతి అని పేరు. ఈ నీతి ఇక్కడ ఒక స్త్రీగా రూపణం చేయబడుతున్నది.

ఒకసారి ఆమెకు చాలా అవమానం కలిగిందట. ఏ విధంగా? ఎప్పుడు? అంటే, ఆ అవమానం ఆమెకు కృష్ణావతార సమయంలో సంభవించింది. శ్రీకృష్ణుని యశోదా దేవి రోటికి కట్టి బంధించింది, ఈ ఉలూఖల బంధన వృత్తాంతాన్ని తరువాత కొందరు అనుసంధించారు. ఈ వృత్తాంతాన్ని స్మరించినవారికి ఎటువంటి ఫలం సిద్ధించింది?

అంటే, వారి బంధాలు అన్ని విడిపోయాయి అంటే, సంసార బంధాలు అన్ని లేకుండా పోయాయి. బంధింపబడినవానిని స్మరించినవారు తత్క్రతునీతిప్రకారం తాము కూడా బంధింపబడాలి కదా! ఆ విధంగా కాకుండా, సంసారబంధాల నుండి వారు బయటపడ్డారు. ఇది తత్క్రతు నీతికి భంగమే కదా. ఈ సంఘటన తరువాత తత్క్రతు నీతి అనే స్త్రీని అందరూ పరిహసించడం మొదలు పెట్టారట. దానివల్ల చాలా అవమానాన్ని పొందిన ఆ స్త్రీ, ఊరిలో ఎవరికీ తన ముఖం చూపించలేక, అరణ్యంలోకి వెళ్లిపోయి, అక్కడ తలదాచుకున్నది. ఊరిలో అవమానాన్ని పొందినవారు అవమానాన్ని భరించలేక, అడవులకు పోయి తలదాచుకుంటారు కదా! ఆ విధంగానే, ఈ స్త్రీ కూడా అరణ్యంలోకి వెళ్లిపోయి, అక్కడ తలదాచుకున్నది. ఇక్కడ అడవి అంటే, అరణ్యకం. అనబడే వేద భాగం. ఆరణ్యకం, వేదంలో ఒక భాగమే కదా. అక్కడ ఈ తత్క్రతున్యాయమనే స్త్రీ తలదాచుకున్నది. ఇక్కడ వాస్తవమైన అర్థం ఏమంటే–ఈ న్యాయం వేదంలోనే కదా ఉన్నది, లోకంలో లేదు కదా! అందుచేత, ఈ స్త్రీ ఊరిని వదిలిపెట్టి, అరణ్యంలోకి వెళ్లి నివసిస్తున్నది –అని కవి అయినందున దేశికులు చమత్కారంగా పలుకుతున్నారు.

ఇప్పుడు ఇంకొక శ్లోకాన్ని యాదవాభ్యుదయ మహాకావ్యం నుండే గమనిద్దాం. ఇందులో, వేదం అరణ్యం అయితే, ఆ అరణ్యంలో గుహవాసి అయిన నివసించే సింహం ఏది? అనే ప్రశ్నకు సమాధానం తెలుపబడుతున్నది. “మదలుప్తధియా తదాభియుక్తో యదుసింహః శిశుపాలకుంజరేణ, విజహార గుహాశయ స్తరస్వీ నిఖిలారణ్యక నిర్వ్యఘాతవృత్తిః” అనేది ఆ శ్లోకం. శిశుపాలుడు కృష్ణుని ఎదిరించాడు. ధర్మరాజు చేసిన రాజసూయయాగ సందర్భంలోనిది, ఈ శ్లోకం. శిశుపాలుడు మదించిన ఏనుగువంటివాడు. శ్రీకృష్ణుడు యదు సింహం. కృష్ణుని సింహం అని అంటున్నాము కదా! అతడు ఆ విధంగా సింహమా? సింహంవలె అరణ్యంలో నివసిస్తాడా? గుహలో శయనిస్తాడా? క్రీడిస్తాడా? ఏనుగులతో పోరాడి వాటిని సంహరిస్తాడా? కృష్ణుని సింహమని అంటే, ఇవి అన్ని అతనిలో ఉండాలి కదా? అని ఈ విధంగా మనకు మనసులో ప్రశ్నలు

చాలా కలుగుతాయి. ఈ ప్రశ్నలను అన్నిటినీ మనస్సులో అభ్యూహించిన కవితార్కిక సింహం అయిన వేదాంతదేశికులు యదు సింహాన్ని వర్ణించేటప్పుడు వీటికి తగిన, చక్కని సమాధానాలను పై శ్లోకం ద్వారా తెలియజేశారు.

నిజమే! శ్రీకృష్ణుడనే ఈ సింహం కూడా అరణ్యంలో నివసించేదే! వేదం అనబడే అరణ్యంలో ఏ అడ్డు లేకుండా అ సంచరిస్తుంది, ఈ యదు సింహం. ఇది గుహలోనే శయనిస్తుంది. మన హృదయం అనే గుహలో నివసిస్తుంది. వేదం కూడా భగవంతుని "గుహాశయం గహ్వరేష్ఠం పురాణమ్" అని చెప్పింది కదా. అందుచేత యదుసింహం గుహలో శయనిస్తుందనే సామ్యం పొసగినట్లు అయినది. ఈ శ్రీకృష్ణ సింహం ఏనుగుతో పోరాడుతుంది. ఏ విధంగా అంటే, శిశుపాలుడు అనే మదించిన ఏనుగుతో పోరాడుతుంది. ఇక్కడ మదం అనేదానికి కూడా రెండు అర్థాలు ఉన్నాయి. ఏనుగుల పక్షంలో మదజలమని, శిశుపాలుని పక్షంలో పొగరు అని అర్థం.

ఈ విధంగా శ్రీకృష్ణుని సింహంగా వర్ణించే నెపంతో దేశికులు వేదానికి సంబంధించిన నాలుగు విధాలైన వైభవాలను తెలియజేశారు. వాటిలో ఒకటి, వేదం పరమాత్మకు నివాస స్థానం అనేది. ఇది చాలా గొప్ప మహిమ. భగవంతునకు క్రీడించే మైదానం వేదమే. మనం అరణ్యంలో సంచరిస్తే ఎన్నో విధాలయిన విఘాతాలు ఏర్పడతాయి. కాని ఈ వేదమనే అరణ్యంలో శ్రీకృష్ణుడు సంచరించేటప్పుడు ఏ విధమైన అడ్డూ లేకుండా సంచరించాడు. మనకందరికీ వేదం అనే అరణ్యంలో సంచరించేటప్పుడు ఎన్నో అవరోధాలు ఎదురవుతాయి. ఇది కూడా ఒక విధమైన వేదమహిమను తెలిపేదే.

వేదంలో సంచరించినందున శ్రీకృష్ణుడు తరస్వి అయినాడు. అంటే, ప్రకాశాన్ని, బలాన్ని పొందాడు —అని ఈ శ్లోకం తెలుపుతున్నది. ఇది కూడా ఒక విధమైన వేదమహిమే. ఈ నాలుగు విధాలైన మహిమలను కలిగిన వేదమనే అరణ్యంలో సంచరించే కృష్ణుడు అనే సింహం శిశుపాలుడు అనే ఏనుగును జయించాడు— అనేది

యుక్తమే కదా. ఇక్కడ "నిఖిలారణ్యక" అనే ప్రయోగంలో ఉండే నిఖిల అనే పదం వల్ల కూడా ఇంకొక వేద మహిమ తెలుస్తున్నది. అరణ్యకంలో అన్ని భాగాలలోను అంతటా భగవంతుడు ఉన్నాడు. "ముృవేద ముదల్వన్" అని అంటూవేదంలో అంతట భగవంతుడు ఉన్నాడని ఆళ్వారులు అంటారు. భగవంతుని తన అన్ని భాగాలలోను కలిగి ఉండే మహిమ వేదానికి ఉన్నది. ఈ విధంగా సింహాన్ని గురించి చెప్పడం అయినది.

తరువాత, వేదమనే అరణ్యంలో సంచరించే నెమలిని గురించి చూద్దాం. అరణ్యం అని అనగానే అక్కడ సంచరించే సింహం గుర్తుకు వచ్చినట్టే, అక్కడ ఆనందంగా నాట్యం చేసే నెమలి కూడా మనకు గుర్తుకు వస్తుంది. భగవంతుని నెమలిగా భావించే క్రమం ప్రసిద్ధం. "మాడమామయిలై. తిరువల్లి క్కేణి క్కండేనే" అని పెరియ తిరుమొఴి ప్రబంధంలో తిరుమంగై ఆళ్వారులు భగవంతుని నెమలిగా పలికారు కదా. ఇప్పుడు మనం ఒక ప్రశ్నను చేసుకోవచ్చు. వేదం అనేది ఒక అడవి అయితే, అందులో పురిని, పింఛాన్ని విప్పి నాట్యమాడే నెమలి ఎవరు? అనేది ఆ ప్రశ్న. దీనికి సమాధానం ఇస్తున్నది, ఆచార్య చంపువు అనే గ్రంథం. వేంకటేశ్వరుడే ఆ నెమలి అట. "వేద కానన విహార కేకినః వేంకటాచలపతేః" అనేది కావ్యంలోని సూక్త. ఆశ్వయుజ మాసంలో కొండపై జరిగే బ్రహ్మోత్సవాలను వర్ణించే సందర్భంలోనిది, ఈ సూక్తి. వేదం అనబడే అరణ్యంలో నాట్యం చేసే నెమలి శ్రీ వేంకటేశ్వరుడు– అని ఇందులో అంటున్నారు. ఈ సూక్తి వల్ల మనకు తెలిసే వేదమహిమ ఏమంటే, వేదం భగవంతునకు విహారస్థానం– అనేది ఒకటి, వేదంలో భగవంతునకు ఆనందం అధికం అనేది ఇంకొకటి. "నడమాడి త్తోకై విరిగిన్ర మామయిల్ కాళ్" అని గోదాదేవి కూడా అరణ్యంలో నెమళ్లు తమ పింఛాలను విప్పి నాట్యం చేస్తాయి– అని అన్నది కదా ఆ విధంగానే, వేదమనే అరణ్యంలో భగవంతుడు అనే నెమలి ఆనందంగా నాట్యం చేస్తున్నాడు –అని ఇక్కడ తెలియబడిన వేదమహిమ.

చివరిగా, దేశిక ప్రబంధంలో ఒక సూక్తిని గమనిద్దాం. ఇది చరమశ్లోక చ్చురుక్కు అనే గ్రంథంలోని ఒక సూక్తి. “కాన్ ఎన్ట వేదంగళ్ కాక్కుమ్ పరనెన్డు కాట్ట నిన్ట” అనేది ఈ సూక్తి. ఇందులో దేశికులు వేదానికి సంబంధించిన నాలుగు విధాలైన మహిమలను తెలియజేస్తున్నారు. “కాన్ ఎన్ట వేదమ్” అనే సూక్తివల్ల వేదం అరణ్యం వంటిది—అని, ఆరణ్యకం అనే పేరును కూడా కలిగినది అని చెప్పబడింది. “కాట్టుమ్. పరమన్”— వేదాలు పరమాత్మను “ఇతడు ఇటువంటివాడు “అని ఇదమిత్థంగా తెలుపుతున్నవి. “వేదంగళ్ కాక్కుమ్ పరమన్”— వేదాలను రక్షించేవాడు సాక్షాత్తు పరమాత్మయే. ఇక్కడ, వేదం అరణ్యంవంటిది—అని, వేదం పరమాత్మను ఇదమిత్థంగా నిరూపిస్తున్నది— అనే అర్థాలు చెప్పే అవకాశం ఏర్పడింది. ఏ విధంగా? అంటే, “కాన్ ఎన్టుమ్ వేదమ్ కాట్టుమ్” అనే చోట “కాణ్ ఎన్టుమ్ వేదమ్ కాట్టుమ్ “అనే పాఠాన్ని కూడా గ్రహించి, చమత్కారంగా ఈ అర్థాలు చెప్పవచ్చు. వేదం అరణ్యం వంటిది —అనేది మొదటి పాఠానికి అర్థం. రెండవ పాఠానికి —”ఇదిగో! చూడు. పరమాత్మ ఈ విధంగా ఉన్నాడు, చూడు! “అని వేదం తెలుపుతున్నది— అని అర్థం. ఇక్కడ “కాక్కుమ్ వేదమ్” అనే ప్రయోగానికి “పరమాత్మను రక్షించే వేదం” అని కూడా అర్థం చెప్పవచ్చు ఆ విధంగా వేదం పరమాత్మను రక్షిస్తున్నదా? అని అంటే, ఏ మరి ప్రమాణం ద్వారా కూడా భగవంతుని తెలియడానికి వీలు లేనప్పుడు, వేదం వల్లనే తెలియడానికి వీలున్నది కనుక, ఆ విధంగా వేదమే తెలియజేయకపోతే, పరమాత్మ స్వరూపం గాని, సత్తగాని ఏమీ ఎవరికీ తెలియకుండా పోయే ప్రమాదం ఉన్నది. కనుక, ఆ ప్రమాదం నుండి వేదం భగవంతుని కాపాడుతున్నది— అని ఇక్కడ చెప్పవచ్చు. అందుచేత వేదం భగవంతుని రక్షిస్తున్నదని అనడంలో ఏ లోటు లేదు.

ఇన్ని విధాలుగా వేదం మహిమ చూపించే పలు సూక్తుల ద్వారా “వేదం అరణ్యం వంటిది” —అనే సామ్యాన్ని తెలిసికోగలిగాము. స్వస్తి.

# వేదనావ

వేదం నావవంటిది అనే పోలికను ఆధారంగా చేసికొని వేదవైభవాన్ని గమనిద్దాం. ఈ పోలికను మహాభారతం, మత్స్యపురాణం యమకరత్నాకరం మొదలైన పలు గ్రంథాలు ప్రస్తావించాయి.

మొదట మత్స్య పురాణంలో ఏ విధంగా ఈ సామ్యం ప్రస్తావింపబడిందో గమనిద్దాం. వేదం నావ వంటిది అనే ఉపమానాన్ని నేరుగా ప్రస్తావించకుండా, వేదమే నావగా రూపొందింది అని ఈ పురాణం తెలుపుతున్నది. ఈ విధంగా వేదం నావగా ఏ సమయంలో రూపాన్ని పొందింది ?ఎందుకోసం? అనే ప్రశ్నలకు సమాధానాన్ని చూద్దాం. "ఏతదేకార్ణవం సర్వం కరిష్యంతి జగత్త్రయమ్, వేదనావ మిమాం గృహ్యా సత్వబీజాని సర్వశః, ఆరోప్య రజ్జుయోగేన మత్ప్రదత్తేన సువ్రత, సంయమ్య నావం ——మత్ప్రభావాభిరక్షితః" అని మత్స్య మూర్తి. ప్రళయకాలం సమీపించినప్పుడు మనువు అనబడే రాజుతో ఈ విధంగా అంటున్నాడు. "ప్రళయకాలంలో సముద్రాలు పొంగి అంతా జలమయంగా అవుతుంది. అప్పుడు వేదం ఒక నావ రూపాన్ని ధరించి వస్తుంది. నేను నీకు ఒక దారాన్ని ఇచ్చాను కదా. దాని ఒక కొనను నీవు మత్స్య రూపాన్ని ధరించిన నా కొమ్ముకు కట్టి, వేరొక కొనను ఆ నావకు కట్టు. నా మహిమ నిన్ను ప్రళయకాలంలో కాపాడగలదు. ఆ వేదనావలో జీవులను బడే బీజాలను అన్నిటిని భద్రంగా పెట్టు". అని మత్స్య మూర్తి మనువుతో అన్నాడు. ఆ మనవు కూడా ఆ విధంగానే చేశాడు.

ఈ సందర్భంలో మనకు వేద మహిమ నాలుగైదు విధాలుగా గోచరిస్తున్నది. ప్రళయ కాలంలో అన్ని నశించినప్పటికీ, వేదం నశించలేదు —అనేది ఒక వేద మహిమ. వేదాన్ని ఒక నావగా చేసి, ఆ ప్రళయ సముద్రంలో భగవంతుడు దానిని సంచరింప చేస్తున్నాడు— అని అన్నందున, భగవంతుడు తాను చేసే ప్రళయం, సృష్టి మొదలైన కార్యాలో వేదాన్ని ఉపకరణంగా చేసుకుంటున్నాడు— అనేది ఇంకొక వేద మహిమ. భగవంతుడు తనచే నేరుగా రక్షింపబడే విధంగా వేదాన్ని ముఖ్యంగా పరిగణిస్తున్నాడు అనేది మరి ఒకటి. వేదం అనే నావలో భగవంతుడు సత్వబీజాలను నిక్షేపించమని

చెప్పాడు కదా. ఎందుకు కోసం ఆ విధంగా చెప్పాడు? ప్రళయ కాలం ముగిసిన తరువాత, సృష్టి ఆరంభం అయ్యేవరకు ఆ వేద నావలోనే సత్వబీజాలు అన్నీ భద్రంగా రక్షించడం కోసం ఆ విధంగా చెప్పాడు. వేదానికి ఉండే మహిమలలో ఇది కూడా ఒకటి. ఆ వేదనావను కట్టే చోటు ఏది? అని అంటే, భగవంతుని యొక్క అవతార రూపమే. ఆ విధంగా తన కొమ్ముకు వేదనావను బంధించే మనువును రక్షిస్తానని భగవంతుడే స్వయంగా తెలియజేశాడు. ప్రళయం తరువాత వేదాన్ని ఆధారంగా చేసుకుని జగత్తు అంతా సృష్టింపబడునున్నది. వేదానికి అంతటి ప్రాధాన్యం, మహిమ ఉన్నది. జగత్తును లయం చేయడంలోనూ, మళ్ళీ తిరిగి సృష్టి చేయడంలోనూ ఉన్నది. ఈ కార్యాలన్నిటిలోనూ భగవంతునకు ఇది సహాయపడుతున్నది. వేదానికి కల ఈ మహిమలు అన్ని పై మత్స్య పురాణ వచనాల ద్వారా తెలుస్తున్నవి. వేదం ఒక నావ అనే విషయంలో ఇన్ని విశేషాలు ఇమిడి ఉన్నాయి.

ప్రళయకాలం సంగతి అటు ఉండనివ్వండి, ప్రళయం లేని సమయంలో కూడా వేదం నావ వంటిది అని అంటున్నది మహాభారతం. నావ ఏ విధంగా జలప్రవేశాలను దాటడానికి ఉపయోగపడుతుందో, ఆ విధంగానే వేదం కూడా మనకు దాటడానికి ఉపయోగపడుతుంది. దేనిని రాకడానికి ఉపయోగపడుతుంది? అని అంటే, మహాభారతంలోని వన పర్వంలోని ఒక వృత్తాంతం మనకు ఈ విషయాన్ని తెలియ జేస్తున్నది. ధర్మరాజు మార్కండేయముని దగ్గర ఒక సందేహాన్ని అడిగే సందర్భం ఇది. ఆ సందేహం ఏమంటే, లోకంలో ఒక వ్యక్తి దగ్గర నుండి దానాన్ని గ్రహించేవారు పాపాన్ని పొందుతున్నారు అని ఒక సామాన్య విధి ఉన్నది కదా. ఆ విధంగా ఉన్నప్పుడు, బ్రాహ్మణులు ప్రతి గ్రహదోషాన్ని తాము దాటడమే కాక, దానాన్ని ఇచ్చిన వారిని కూడా పాపాల నుండి దాటిస్తున్నారు— అని అనడం ఏ విధంగా యుక్తం? పాపాన్ని పొందినవారు ఇతరులను పాపం నుండి విముక్తులను చేయలేరు కదా! ఇది ఏ విధంగా సాధ్యం? – అని ధర్మరాజు సందేహాన్ని అడిగాడు. దానికి మార్కండేయ మహర్షి బదులిస్తూ, "జపైః మంత్రైశ్చ హోమైశ్చ స్వాధ్యాయాధ్యయనేన చ, నావం వేదమయీం కృత్వా తారయంతి తరంతి చ" అని అన్నాడు. దానాన్ని పరిగ్రహించేవాడు పాపాన్ని

పొందుతున్నాడు అనేది సామాన్యంగా ఉండే విషయమే. ఇది వాస్తవమే అయినప్పటికీ, ఆ పాపాన్ని దాటడానికి వైదికులు కొన్ని మార్గాలను అనుసరిస్తున్నారు. వైదిక మంత్రాలను ఆవృత్తి చేస్తున్నారు, హోమాలను చేస్తున్నారు. వేదాలను అధ్యయనం చేస్తున్నారు. ఈ విధంగా చేయడం ద్వారా వేదం వారికి నా వలే సహాయపడుతున్నది. నావ వలే ఉండే ఆ వేదంసహాయంతో వైదికులు తాము పాపనుండి దాటడమే కాక, దానాన్ని ఇచ్చినవారిని కూడా పాపం నుండి విముక్తులను చేస్తున్నారు. వైదికులు కానివారికి దానం ఇవ్వకూడదు. వేదమనే నావను కలిగినవారు మాత్రమే పాపాలను దాటగలరు, దాటించగలరు.

ఈ మార్కండేయ మహర్షి పలికిన సమాధానాన్ని అనుసరించి మనకు మూడు విధాలైన వేదహిమలు వ్యక్తం అవుతున్నాయి. అవి ఏవి ?అంటే, వేదం వల్లనే ప్రతి గ్రహదోషం నుండి విముక్తిని పొందడానికి సాధ్యం అవుతున్నది. రెండవది ఏమంటే, జపమయినా, హోమమైనా, అన్నీ కూడా వేద సంబంధాన్ని కలిగి ఉన్నందున, వేదం పలు రీతులలో పాపసముద్రాన్ని దాటించడానికి ఉపయోగపడుతున్నది. నావ తనపై పలువురులను ఎక్కించుకొని, వారిని జలప్రదేశం నుండి దాటించి, తీరాన్ని చేర్చి రక్షిస్తున్నది. తానుకూడా తీరాన్ని చేరుతున్నది. ఆ విధంగానే, వేదం కూడా తాను ప్రళయ సముద్ర తీరాన్ని చేరి, ఇతరులను కూడా దాని తీరాన్ని చేరుస్తున్నది. ఇన్ని వేదమహిమలను పై మహాభారత సూక్తి తెలియజేస్తున్నది.

మహాభారతంలోనే ఆశ్వమేధిక పర్వంలో, “నావం వేదమయీం కృత్వా” అనే విషయమే మళ్ళీ ప్రస్తావనకు వచ్చింది. వేదం అనే నావ అనే మాట మాటిమాటికి మహాభారతంలో ప్రస్తావించబడడానికి కారణం, అది వ్యాసమహర్షి కి చాలా అభిమతమై ఉండడమే. అక్కడ “సాయం ప్రాతస్తు యే సంధ్యాం సంయుక్ నిత్యముపాసతే, నావం వేదమయీం కృత్వా తరంతే తారయంతి చ”. అని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో చెబుతున్నాడు. ఉదయం, సాయంకాలం ఎవరు సంధ్యావందనాన్ని చక్కగా ప్రతి దినం చేస్తున్నారో, వారు వేదనావ మూలంగా తాము పాపాలను దాటడమే కాక, ఇతరులను కూడా పాపాల నుండి విముక్తులను చేస్తున్నారు–. అని శ్రీకృష్ణుడు అంటున్నాడు

ఇందులో చెప్పబడిన వేద మహిమలు నాలుగు. వేద విహిత కర్మలు చాలా గొప్పవి. సంధ్యావందనంలో ప్రోక్షణ మంత్రం, ప్రాశన మంత్రం ఆర్ఘ్యప్రదాన మంత్రం, ప్రదక్షిణ మంత్రం, జపించే గాయత్రి, ఉపస్థాన మంత్రం—అన్నీ వేదమంత్రాలే. అందుచేత సంధ్యావందనం వైదికమైన కర్మ. దానిని ప్రతి దినం చక్కగా, శ్రద్ధలో చేయాలి. ఏ కారణం చేతకూడా వదిలిపెట్టకూడదు. ఈ విధంగా ప్రతి దినం చక్కగా సంధ్యావందనం చేసినవానికి వేదం నావవలే సహాయపడుతుంది, రక్షిస్తుంది. ఆ విధంగా శ్రద్ధగా చేసేవారికి వేదమయమైన నావ లభిస్తుంది. వేదకర్మలను చేస్తే, వేదం మనకు ఆవశ్యక సమయాలలో సహాయపడి రక్షిస్తుంది. —అనే వేద మహిమ ఇక్కడ వ్యక్తమవుతున్నది. వేదం సహాయంతో వేద కర్మలను తెలిసినవారు పాపాన్ని దాటగలరు అంతే కాదు, వారు తమకు చెందినవారిని కూడా వేదం సహాయంతో దాటించగలరు. అందుచేత వైదికులను ఆశ్రయిస్తే మంచిది —అనే ఒక విధమైన వేద మహిమకూడా ఇక్కడ తెలుస్తున్నది.

ఇక్కడ ఒక చమత్కారమైన విషయం ఉన్నది. తమిళంలో నావకు "నావాయ్ "అని పేరు. వేదానికి కూడా ఇదే పేరు తమిళంలో ఉన్నది. ఏ విధంగా అంటే, వేదం కేవలం శ్రుతి పరంపర గానే కొనసాగుతూ వస్తున్నది తప్ప, గ్రంథస్థం చేయబడడం వల్ల కాదు. ద్రావిడంలో "నా" అంటే —నాలుక జిహ్వ. జిహ్వ ఆధారంగా వేదం తరతరాలుగా ఉచ్చరింపబడి పరిరక్షింపబడుతున్నందున వేదం కూడా "నావాయ్" – "మౌఖికంగా కొనసాగుతూ వస్తున్నది "అని చెప్పదగినది. ఇది కూడా ఒక వేదమహిమే. వేదానికి, నావకు మధ్య ఉండే నామసామ్యం.

చివరిగా, యమక రత్నాకర గ్రంథంలోని ఒక శ్లోకాన్ని గమనిద్దాం. ఆ శ్లోకంలో చెప్పబడిన వేద మహిమలను మాత్రం ఇక్కడ గమనిద్దాం. వేదమనే నావ మనలను పెద్ద పెద్ద తమస్సులనుండి దాటిస్తున్నది—అని అక్కడ చెప్పబడింది. ఇక్కడ తమస్సు అంటే, అజ్ఞానం అని, చెడ్డ గుణం అని అర్థం. వీటి నుండి వేదం మనలను రక్షిస్తున్నది. వేదంలో ప్రతిపాదింపబడినవాడు భగవంతుడే. వేదాన్ని ప్రణవంపూర్వకంగానే అధ్యయనం చేయాలి. వేదాధ్యయనారంభంలో విధిగా ప్రణవాన్ని జపించి, ఆ

తరువాతనే వేదాన్ని చెప్పడం ప్రారంభించాలి. అందులో చెప్పబడిన ఇంకొక విషయం ఏమంటే, భగవంతుని మనం స్తుతించాలి అంటే, వేదమంత్రాలతో స్తుతించడమే శ్రేష్ఠమైనది. ఇక్కడ చెప్పబడిన చివరి అంశం ఏమంటే, మనకు ఏర్పడే అన్ని విధాలైన క్లేశాలు వేదం ద్వారా తొలగిపోతాయి. అందుచేత, వేదం సహాయంతో మనం భగవంతుని ఆశ్రయించవచ్చు– అని.

ఇంతవరకు మనం "వేదం నావ వంటిది" అనే సామ్యాన్ని ఆధారంగా చేసికొని కొన్ని ముఖ్యమైన వేద మహిమలను తెలిసికొనగలిగాము. వేదనావను సహాయంగా చేసికొని, సంసార సముద్రాన్ని మనం దాటవచ్చు. అందుకోసం ప్రయత్నం చేద్దాం. స్వస్తి.

# వేదంలో దివ్యదంపతుల వైభవమ్

(ఉ. వే. శ్రీమాన్ వాసుదేవాచార్యస్వామివారి తమిళప్రసంగం ఆధారంగా)
సమర్పణ— ఈ. ఏ. శింగరాచార్య దాసుడు

నవరాత్రి శుభవేళలో అందరికీ దాసుని హృదయపూర్వక శుభాకాంక్షలు. ఈ శుభసందర్భంగా దివ్య దంపతులైన లక్ష్మీనారాయణులే మనకు సమాశ్రయణీయులు, వారి సేవే పరమార్థం అనే విషయాన్ని తెలియజేసే ఒక వైదికమైన గాథను అనుసంధిద్దాం.

భగవానుడైన శ్రీమన్నారాయణుడు, ఆ స్వామికి ప్రధానమహిషి అయిన లక్ష్మీదేవి– అనే దివ్య దంపతులు ఇద్దరు కలిసి మనలను రక్షిస్తున్నారు. ఈ విషయం వేదంలో పలుచోట్ల ప్రస్తావింపబడింది. భగవంతుని చెప్పేటప్పుడు "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" అని భగవంతుని లక్ష్మీదేవి పత్ని అని వేదం నిర్దేశించింది. ఆ విధంగానే, లక్ష్మీదేవిని గురించి స్తుతించేటప్పుడు శ్రీ సూక్తం "శ్రియమ్ లోకే దేవజుష్టామ్ ఉదారామ్" అని అంటూ ఆమె భగవంతునకు మిక్కిలి ప్రీతికరమైనదని, ఆ భగవంతుని ప్రీతికి పాత్రమైనదని తెలియజేసినది. ఆ వేదంమే ఇంకొక చోట "సుమజ్ఞానయే విష్ణవే" అని లక్ష్మీదేవి భగవంతుని ధర్మపత్ని అని చెప్పింది. ఈ విధంగా వేదం వీరిద్దరి సంబంధాన్ని, నిత్యయోగాన్ని పలుచోట్ల సంభావించింది. ఈ విషయాన్ని మనకు వేదం ఒక అందమైన ఉపాఖ్యానం ద్వారా తెలియజేస్తున్నది.

విదేహదేశంలో జనకుడు అని ఒక మహారాజు ఉండేవాడు. అతడు గొప్ప జ్ఞాని. అతడు, తన దగ్గరకు వచ్చేవారిని కలవడం కోసం ఒక సమయాన్ని నిర్దేశించాడు. ఒకనాడు ఆ సమయంలో యాజ్ఞవల్క్యుడు అనే ఒక మహర్షి జనకుని దగ్గరకు వచ్చాడు. ఈ మహర్షి గొప్ప జ్ఞాని. జనకునకు ఆ మహర్షి ని చూసి చాలా సంతోషం

కలిగింది. ఒక జ్ఞానికి ఇంకొక జ్ఞానిని చూస్తే చాలా ఆనందం కలుగుతుంది కదా. జనకుడు సాదరంగా ఆ మహర్షిని ఆహ్వానించి, అతిథిసపర్యలను చేశాడు. తరువాత, "ఓ మహర్షీ! మీరు వచ్చిన కార్యమేమి?" అని ప్రశ్నించాడు. "గోదానాన్ని స్వీకరించడానికి వచ్చారా? నాకు ఏదైనా ఒక ఉపదేశాన్ని చేయడం కోసం వచ్చారా?" అని జనకుడు అన్నాడు. అప్పుడు ఆ మహర్షి "రాజా! నేను ఈ రెండిటి కోసం వచ్చానని భావించు. నీకు మంచి విషయాన్ని ఉపదేశం చేస్తాను. నీవు ఇచ్చే గోవులను తీసుకుని వెళతాను" అని అన్నాడు. జనకుడు అంగీకరించి, "సరే ఉపదేశం చేయండి" అని అన్నాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు "రాజా! నీవు కూడా జ్ఞానివి కదా, నీకు తెలిసిన విషయమేమో చెప్పు. నీకు ఎవరైనా ఇంతకుముందు ఏమి ఉపదేశించారో తెలియజేస్తే, అప్పుడు నీకు తెలియవలసిన ఉపదేశాన్ని చేస్తాను" అని అన్నాడు.

అప్పుడు జనకుడు ఆ మహర్షితో ఒకానొక సమయంలో నా దగ్గరకు ద్విత్వ అనే ఒక మహర్షి వచ్చారు. ఆయన నాకు ఒక ఉపదేశం చేశారు. ఆయన వాస్తవంగా చాలా గొప్ప జ్ఞాని. వారిని నేను "మీరు ఎవరి దగ్గర విద్యను నేర్చారు?" అని అడిగాను. అప్పుడు ఆ మహర్షి "తల్లి, తండ్రి, గురువు అనే ముగ్గురి దగ్గర నేను విద్యను నేర్చుకున్నాను" అని అన్నారు. చిన్నతనంలో మనకు నడక, మాటలాడడం మొదలైన ఎన్నో తెలియని విషయాలను తల్లి నేర్పిస్తుంది. తరువాత, ఉపనయన సమయంలో తండ్రి గురువు అవుతాడు. ఆ తరువాత, ఆచార్యుని దగ్గర విద్య అభ్యసించడం జరుగుతుందికదా. అందువల్ల ఆ మహర్షి ఆ విధంగా చెప్పారు. మళ్లీ ఆ మహర్షి "వాక్ అనేది బ్రహ్మం, అదే ఉన్నతమైనది. దానివల్ల మనం అన్ని కార్యాలను సాధించగలుగుతున్నాము. ఈ విషయాన్ని గ్రహించి దానిని ఉపాసించు— అని నాకు ఆ మహర్షి ఉపదేశించారు" అని జనకుడు అన్నాడు.

యాజ్ఞవల్క్యుడు అప్పుడు "ఆ మహర్షి ఉపదేశించినది మంచిదే. కానీ ఆ ఉపదేశం సంపూర్ణం కాలేదు. ఇంతకంటే తెలియవలసినది వేరొకటి ఉన్నది. అయితే. ఆ వాక్కు అనేది ఏదో ముందుగా గ్రహించాలి. సామాన్యంగా వాక్కు అంటే, మాట్లాడడానికి

పనికి వచ్చే వాగింద్రియం– అని భావిస్తాము. అయితే ఇది చాలదు. ఈ వాక్కుకు అధిదేవత ఒకరు ఉన్నారు. ఆ దేవత మూలంగానే ఈ వాక్కు ద్వారా మనం సకల కార్యాలను సాధించుకోగలుగుతున్నాము. ఆ వాగ్దేవతద్వారా మనకు వాగింద్రియం అనేక కార్యాలలో ఉపకరిస్తున్నది. ఈ వాక్కు ద్వారానే మనం వేదాన్ని అభ్యసించగలుగుతున్నాము. శాస్త్రాలను నేర్వగలుగుతున్నాము. లోకంలో సకలవ్యవహారాలను చేయగలుగుతున్నాము. యాగంగానీ, దానంగానీ, హోమంగాని, ఇక ఏ విధమైన సత్కార్యాలు గానీ, ఈ వాక్కు ద్వారానే సాధించగలుగుతున్నాము. స్వర్గం గానీ, మోక్షం గానీ ఈ వాక్కు మూలంగానే లభిస్తున్నవి. అందుచేత కేవలం వాక్కు మాత్రమే ఉపకరిస్తున్నదని భావించకుండా, వాగ్దేవత కూడా మనకు ఉపకరిస్తున్నది –అని భావించు" అని యాజ్ఞవల్క్యుడు అన్నాడు. జనకుడు కూడా సంతోషించి, "మహర్షీ! మీరు చేసిన ఈ ఉపదేశానికి మీకు నేను గురుదక్షిణగా వేయి గోవులను సమర్పిస్తాను, గ్రహించండి" అన్నాడు. కానీ, ఆ మహర్షి "స్వీకరించను" అని అన్నాడు. "నాఈ ఉపదేశం ఇంకా ముగియలేదు, ఇంకా చెప్పవలసినది ఉన్నది" అని అన్నాడు. జనకుడు "మధ్యలో ఈ దక్షిణను అంగీకరించండి" అని జనకుడు ప్రార్థించినా, ఆ మహర్షి గోవులను స్వీకరించడానికి అంగీకరించలేదు. అప్పుడు జనకుడు "సరే, మహర్షీ! ఉపదేశించండి" అని అన్నాడు.

తరువాత జనకుడు అంతకుముందు తనకు తెలిసిన విషయాలు ఏమీ ఉన్నాయో వాటిని అన్నిటిని యాజ్ఞవల్క్యునకు తెలియజేయగా, వాటిలో ఉండే లోటుపాట్లను అన్నిటినీ సరిదిద్దుతూ, ఆ మహర్షి ఎన్నో విషయాలను జనకునకు ఉపదేశించాడు. చివరగా జనకుడు మళ్ళీ గోదానాన్ని స్వీకరించమని ఆ మహర్షిని కోరాడు. కానీ, ఆ మహర్షి "నేను చేయవలసిన ఉపదేశం పూర్తికాలేదే! అది పూర్తి అయిన తర్వాత గాని స్వీకరించను" అని అన్నాడు. మళ్ళీ జనకుడు "సరే, మహర్షీ! మీరు చేయదలచిన ఉపదేశాన్ని చేయండి" అని చేతులను జోడించి నమస్కరిస్తూ అన్నాడు.

అప్పుడు యాజ్ఞ్యవల్క్యుడు “నీ కుడి కంటిలో ఒక దివ్య పురుషుడు ఉన్నాడు. ఆ పురుషునకు ఇంధః అని పేరు. (ఈ నామానికి ప్రకాశించేవాడు— అని అర్థం. ఇంకొక అర్థం ఏమంటే, నియమించేవాడు అని అర్థం. ఇంద్రుడు అనే పదమే ఈ విధంగా మార్చి నిర్దేశించబడింది. దేవతల పేర్లను ఒక్కొక్క సమయంలో కొంచెం మార్చి చెప్పే రీతి వేదంలో ఉన్నది) ఇతడే మనలను నియమించేవాడు. ఇంతే కాదు. ఇంకొక విషయం ఉన్నది నీ ఎడమ కంటిలో ఇంకొకరు ఉన్నారు. ఆమెకు ఇంద్రపత్ని అని పేరు. ఈ విధంగా వారు నేత్రాలలో ఉండడానికి కారణం ఏమంటే, నేత్రమే కదా మన హృదయానికి ద్వారం. నిజానికి వీరిద్దరూ మన హృదయంలో ఉన్నారు. మానవుల హృదయం చాలా చిన్నది. హృదయ కమలం అనే చోట వీరిద్దరూ ఉన్నారు. తామర పువ్వు లోపల ఏ విధంగా చాలా సూక్ష్మమైన ప్రదేశం ఉంటుందో, ఆ విధంగానే, మన హృదయ కమలంలో కూడా సూక్ష్మమైన ప్రదేశం ఉన్నది, ఈ అక్కడ ఇంద్రుడు, ఇంద్రపత్ని అనే ఇద్దరు ఉన్నారు. వీరిద్దరూ మనలను పరిపాలిస్తున్నారు. వీరే దివ్య దంపతులు. మన హృదయ కమలం వారికి చాలా ఇష్టమైనది. మన హృదయం మాంస పిండం అయినా, ఆ స్థానం వారికి చాలా అభిమతమైనది. ఆ హృదయంలో ఉండే చిన్న చిన్న పలు నాడులు వారికి పట్టువస్త్రాలవంటివి. వారు మనలను అనుగ్రహించడం కోసంగా మన హృదయ కమలంలో నిలిచి ఉన్నారు. ఎవరు వారిని ఉపాసిస్తారో, వారికి వారి యోగం సఫలం అయ్యేటట్టుగా అనుగ్రహిస్తారు. ఎవరు ఏ విధంగా భక్తితో వారిని ధ్యానిస్తారో, వారికి ఆ విధమైన ధ్యానం సఫలం అయ్యేటట్లు చేస్తారు. అన్నిటికంటే ముఖ్యంగా, అంతిమ కాలంలో, తన భక్తులను తాము నివసించే లోకానికి తీసుకొని పోవడం కోసం సిద్ధంగా ఉంటారు. అంతిమ సమయంలో భక్తునకు తమ లోకానికి చేర్చే మార్గాన్ని చూపి అనుగ్రహిస్తారు. (ఇదే విషయం బ్రహ్మసూత్రాలలో “హార్ధానుగృహీతః శతాధికయా” ఇత్యాదిగా చెప్పబడింది) సకల విధమైన క్షేమాన్ని కలిగించి, సకల విధమైన తగిన జ్ఞానాన్ని కలిగించి, తమలోకమైన శ్రీ వైకుంతం అనే ఉత్తమలోకానికి తీసుకొని పోయి, తమ నిత్య కైంకర్యాన్ని అనుగ్రహించడం కోసమే వారు మన హృదయంలో ఉన్నారు.

అందుచేత వారిని కూడా మనం తెలుసుకొని ధ్యానించాలి" అని యాజ్ఞవల్క్యుడు అన్నాడు.

ఇది జనకునకు ఒక అద్భుతమైన విషయం. పరమాత్మకు సంబంధించిన ఎన్నో విషయాలను ఇంతకు ముందు అతడు విన్నప్పటికీ, ఈ విధంగా దివ్యదంపతులైన శ్రీమన్నారాయణులు మన హృదయాలలో నిలిచి ఉంటారు –అనే విషయాన్ని అతడు వినలేదు. వారు సకల మంగళాలను ప్రసాదిస్తారు అని తెలుసుగాని, వారే మన హృదయకమలంలో మనకోసం నిలచి ఉన్నారు అనే సంగతి ఇంతవరకు ఆ ప్రభువుకు తెలియదు. యాజ్ఞవల్క్యుని వల్ల ఆవిషయాన్ని తెలిసికొన్న జనకుడు చాలా ఆనందించి, "అయితే మరి, వీరిద్దరూ మనకు ఈశ్వరులా? ఈశ్వరులు ఇద్దరు ఉన్నారా?" అని అడిగాడు. అప్పుడు ఆ మహర్షి "లేదు, ఈశ్వరులు ఇద్దరు లేరు. ఒకరే. లక్ష్మీ సహితుడైన నారాయణుడే. వీరు ఇద్దరూ కలసి మనలను అనుగ్రహిస్తున్నారు." అని అన్నాడు.

అప్పుడు ప్రభువు చాలా ఆనందంతో "మహర్షీ! మీకు ఎంత గురుదక్షిణ ఇచ్చినా సరిపోదు. ఎందుకంటే, నేను ఇంతవరకు తెలిసిన వేదాంతం ఈనాడే సంపూర్ణమైనది. ఇంతవరకు అసంపూర్తిగానే తెలిసినది. ఇప్పుడు అది పూర్తి అయినది. ఇప్పుడే దివ్యదంపతులకు సంబంధించి తెలుసుకోగలిగాను. వారే మనకు ఉపాయం, ఉపేయం. వారే మనకు శేషి. వారిద్దరు కలసి మన హృదయంలో అంతర్యామిగా ఉన్నారు. ఈ విషయాన్ని ఇప్పుడే మీ వల్ల తెలుసుకున్నాను. అందుచేత మీకు నా రాజ్యాన్ని అంతటినీ ఇస్తాను" అని అన్నాడు. తరువాత జనకుడు పుష్కలంగా గోవులను మహర్షికి సమర్పించగా, అతడు వాటిని స్వీకరించి వెళ్లిపోయాడు.

అద్భుతమైన ఈ వేదవృత్తాంతం మనకు దివ్యదంపతుల వైభవాన్ని తెలియజేస్తున్నది. ఇందులో తెలుపబడిన విధంగా దివ్య దంపతులైన, ఎల్లప్పుడూ

మన హృదయ కమలంలో నిలచి ఉండే లక్ష్మీనారాయణులను మనం భక్తితో ఆశ్రయించి. వారికి మన స్వరూపానికి తగిన సేవను చేసికొని, ఈ వైదిక వృత్తాంతాన్ని స్మరించి, ధన్యులం అవుదాం. స్వస్తి.

# వేదంలో ఆహార వ్యవస్థ

లోకంలో సకలప్రాణులకు చాలా ఆవశ్యకమైనది ఆహారం. మానవులకు, మృగాలకు, క్రిమికీటకాదులకు, వృక్షాదులకు అన్ని ప్రాణులకు కావలసినది అపేక్షించేది, ఆహారమే. ఇటువంటి ఆహారాన్ని భగవంతుడే సృష్టించాడు. భగవంతుడు ఈ జగత్తును సృష్టించాడు అంటే, ప్రాణులను సృష్టించడంతోపాటు, ఆయా ప్రాణులకు కావలసిన ఆహారాన్ని, దానిని తీసికొనే క్రమాన్ని కూడా సృష్టించాడు– అని అర్థం కదా. భగవంతుడు దయామయుడు. ఎవరికి ఏ విధమైన లోటును కలిగించడు. విచిత్రం ఏమి అంటే, ఒక్కొక్క ప్రాణులకోసం సృష్టించిన ఆహారం ఇంకొకరికి రుచించదు. ఆ యా ఆహారాలను ఆ యా ప్రాణులు భుజించే క్రమాన్ని కూడా భగవంతుడే వాటికి సహజంగానే ఏర్పాటు చేసి తెలియజేశాడు. అప్పుడే పుట్టిన బిడ్డకు తల్లి దగ్గర పాలు తాగాలని నేర్పినది ఎవరు? భగవంతుడే కదా.

కానీ, మానవులకు, మిగిలిన ప్రాణులకు ఒక తేడా ఉన్నది. ఈ ఆహారాన్ని స్వీకరించేటప్పుడు ఒక నిర్దిష్టమైన క్రమాన్ని, అంటే, "ఈ కాలంలో ఆహారాన్ని స్వీకరించాలి, ఇన్ని మార్లు స్వీకరించాలి, ఈ విధంగానే స్వీకరించాలి, ఇటువంటి నియమాలకు లోబడి స్వీకరించాలి" అనే ఒక వ్యవస్థ నిర్దిష్టంగా మానవులకు ఉన్నట్లు, మిగిలిన ప్రాణులకులేదు. ఎందుకు మానవులకు మాత్రం ఈ విధంగా నియతి భగవంతునిచే ఏర్పరచబడింది? మిగిలిన ప్రాణులకు ఆ విధంగా ఒక నియమం విధింపబడలేదు? అనే విషయాన్ని గురించి ఒక ఉపాఖ్యానం వేదంలో ఉన్నది

బ్రహ్మ జగత్తును సృష్టించడం ఆరంభించి, ఒక్కొక్క జీవరాశిని సృష్టించడం ఆరంభించాడు. అప్పుడు ఆ జీవులు బ్రహ్మ దగ్గరకు వెళ్లి మాకు ఏమి ఆహారం? అని అడిగాయి. ప్రతి ప్రాణి జన్మించగానే తనకు కావలసిన ఆహారాన్ని అన్వేషిస్తుంది కదా. ఆ క్రమంలో దేవతలు బ్రహ్మ దగ్గరకు పోయి తమకు ఏమి ఆహారం? అని ప్రశ్నించారు,

అయితే వారు ఎక్కువగా, క్రమాన్ని అనుసరించకుండా, అవినయంగా అడగలేదు. "మాకు ఏది ఆహారం? అది ఎప్పుడు లభిస్తుంది ?మాకు ఏది ప్రకాశం? బలం ఏది?" అని ఈ విధంగా వారు బ్రహ్మను అడిగారు. ఈ విధంగా వారు అడిగేటప్పుడు కూర్చొని, వినయంగా, యజ్ఞోపవీతాన్ని ఉపవీతిక్రమంలో ధరించి, తమకుడి చెవిని ముట్టుకొని ప్రశ్నించారు. అప్పుడు బ్రహ్మ "మీకు ఆహారం యాగంలో లభిస్తుంది. యాగంలో హోమం చేయబడే హవిస్సే మీకు ఆహారం. అయితే, మీకు మీ ఆహారం మాసానికి రెండు సార్లు మాత్రమే లభిస్తుంది. పౌర్ణమి, అమావాస్య కాలాలలో మరునాడు మాత్రమే మీకు ఆహారం లభిస్తుంది. మీకు ప్రకాశకుడుగా సూర్యుడు ఉంటాడు. మీకు బలాన్ని కలిగించేదిగా అమృతం లభిస్తుంది "అని బ్రహ్మ సమాధానం ఇచ్చాడు. ఆ మాట విని దేవతలు వెళ్లిపోయారు.

తరువాత పితృదేవతలు బ్రహ్మ దగ్గరకు వచ్చి ఆ విధంగానే తమకు ఏది ఆహారం అని అడిగారు. ఆ విధంగా అడిగేటప్పుడు వారు కూర్చుని ప్రాచీనావీతిక్రమంలో యజ్ఞోపవీతాన్ని ధరించి, కుడి చెవిని ముట్టుకొని ప్రశ్నించారు. "మీకు ఆహారం తర్పణం ద్వారా లభిస్తుంది. మీకు మీ సంతతికి చెందినవారు నువ్వులతో, జలంతో, పిండాలతో తర్పణం చేస్తారు. అవి మీకు ఆహారం కాగలదు. అయితే, మీకు ఆహారం నెలకు ఒకసారి మాత్రమే లభిస్తుంది. అది కూడా అమావాస్యనాడు మాత్రమే లభిస్తుంది. మీకు చంద్రుడు ప్రకాశాన్ని కలిగిస్తాడు. మీకు బలం స్వధా ద్వారా లభిస్తుంది". అని బ్రహ్మ చెప్పాడు. అప్పుడు పితృ దేవతలు తృప్తిపడి వెళ్లిపోయారు.

ఆ విధంగానే, తరువాత మానవులు వచ్చి బ్రహ్మను తమకు ఏది ఆహారం? ఎప్పుడు లభిస్తుంది? తమకు ఏది బలం ?ఏది ప్రకాశం? అని అడిగారు. వారు అడిగేటప్పుడు కూర్చొని మాత్రం అడిగారు. దేవతల వలె వినయంగా కుడిచెవిని కానీ, పితృదేవతల వలె ఎడమ చెవిని కానీ ముట్టుకొని అడగలేదు. అప్పుడు బ్రహ్మ వారితో "మీకు ఆహారం భూమి వల్ల లభిస్తుంది. భూమిలో ఫలించే అనేక విధాలైన పంటల

ద్వారా మీకు ఆహారం దొరుకుతుంది. మీకు ప్రతి దినం ఉదయం, సాయంకాలం రెండుసార్లు ఆహారం లభిస్తుంది. మీకు అగ్ని సహాయకుడుగా, ప్రకాశాన్ని కలిగించేవాడుగా ఉంటాడు. మీకు మీ శరీరం వల్లనే బలం లభిస్తుంది. మీరు దానివల్ల సంతానాన్ని పొందుతారు" అనిబ్రహ్మ చెప్పాడు.

ఈ విధంగా వారు వారు అడిగిన రీతినిబట్టి వారి వారికి తగిన ఆహారాన్ని, వ్యవస్థను బ్రహ్మ ఏర్పాటు చేశాడు. అందువల్లనే దేవతలకు వారి ఆహారాన్ని సమర్పించేటప్పుడు కూర్చొని, కుడిచెవిని తాకి, యజ్ఞోపవీతాన్ని ఉపవీతి క్రమంలో ధరించి సమర్పించాలి. పితృదేవతల కోసం అర్పించేటప్పుడు ప్రాచీనావీతిక్రమంగా యజ్ఞోపవీతాన్ని ధరించి తర్పణం, పిండ ప్రదానం మొదలైనవానిని సమర్పించాలి మానవులు కూర్చుని అడిగారు, కనుక, వారు ఆహారాన్ని స్వీకరించేటప్పుడు కూర్చొని ఉండే క్రమంలో స్వీకరించాలి" అనే ఈ క్రమం ఏర్పడింద్ి

అయితే, ఈ కథ ఇంతటితో ముగిసి పోలేదు. తరువాత, మృగాలు బ్రహ్మ దగ్గరకు వచ్చాయి. వాటికి దేవతలు మొదలైనవారు అడిగినట్లుగా కూర్చొని, నియమంతో నోరు తెరిచి అడిగే సామర్థ్యం లేదు. అందుచేత వాటిని చూడగానే బ్రహ్మకు జాలి కలిగింది. " ఇవి నా దగ్గరకు వచ్చి నిలుచున్నాయి అంటే, తమకు ఏది ఆహారం? అని అడగడం కోసమే కదా వచ్చాయి" అని బ్రహ్మ భావించాడు. అప్పుడు బ్రహ్మ వాటిని చూచి "మీరు బాధపడకండి. మీకు ఆహారం పుష్కలంగా లభిస్తుంది. మీరు ఎప్పుడైనా, మీరు కోరినప్పుడు ఆహారాన్ని భుజించవచ్చు. మీకు ఏ విధమైన నియమాలు లేవు. ఎప్పుడు మీకు ఆహార లభిస్తుందో, అప్పుడు అంతా మీరు భుజించవచ్చు. దినానికి రెండుసార్లు– అని కానీ, ఉదయం, రాత్రి అని కానీ, ఏ విధమైన నియమాలు లేవు" అని చెప్పి వాటిని పంపించి వేశాడు.

ఆ తరువాత అసురులు బ్రహ్మ దగ్గరకు తమకు ఏది ఆహారం అనే ప్రశ్నించడం కోసం వచ్చారు. అయితే వారు ఒకచోట నిలవకుండా పరిగెత్తుతూనే అవినయంగా ప్రశ్నించారు. అప్పుడు బ్రహ్మ వారిని చూచి, మీరు ఒక చోట నిలవకుండా పరిగెత్తుతూనే అడుగుతున్నారే! అందుచేత, మీరు రాత్రివేళ ఈ విధంగానే పరిగెత్తుతూనే ఆహారాన్ని భుజించండి. మీకు రాత్రివేళ బలం అధికంగా ఉంటుంది "అని చెప్పి వారిని పంపించి వేశాడు.

ఈ విధంగా బ్రహ్మ సృష్టికాలంలో ఆయా ప్రాణులకు తగిన ఆహారాన్ని, వారు దానిని స్వీకరించే క్రమాన్ని ఏర్పాటు చేశాడు. ఇక్కడ మనం గమనించవలసిన ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, ఈ వ్యవస్థ అందరిలో ఈనాటికీ కొనసాగుతూ ఉన్నది. ఈ క్రమాన్ని ఎవరూ అతిక్రమించలేదు. దేవతలు కాని, పితదేవతలు కానీ, ఎవరు నియమాన్ని దాటలేదు. మానవులు ఒక్కరూ మాత్రమే ఈ కాలంలో అతిక్రమించి వర్తిస్తున్నారు. ఆనాడు సృష్టికాలంలో బ్రహ్మ ఏర్పరచిన క్రమాన్ని మార్చి, వేరే విధంగా, తమకు ఇష్టం వచ్చిన రీతిలో ఆహారాన్ని స్వీకరిస్తున్నారు. ప్రతి దినం రెండుసార్లు మాత్రమే భుజించాలి– అనే క్రమాన్ని మీరి స్వీకరిస్తున్నారు "సాయం ప్రాతః ద్విజాతీనా మశనం శ్రుతి చోదితమ్" అని ఉన్నది. దేవతలకు పూర్వాహ్నంలో ఆహారం, పితృదేవతలకు అపరాహ్నంలో ఆహారం అనే క్రమాన్ని కూడా బ్రహ్మ ఏర్పరిచాడు. మానవులకు మధ్యాహ్న సమయంలో, రాత్రి వేళ అనే క్రమాన్ని బ్రహ్మ ఏర్పాటు చేశారడు. దీనిని మనం మీరి, ఈనాడు మనకు తోచిన సమయంలో ఇష్టంగా భుజిస్తున్నాము. రెండుసార్లు అనే నియమాన్ని కూడా దాటి మూడుమార్లు, నాలుగు మార్లు కూడా ఆహారాన్ని స్వీకరిస్తున్నాము. ఆ విధంగా కాకుండా ఆహారాన్ని మితంగా, చెప్పబడిన సమయంలో భుజించడం అనేది ఒక తపస్సు. మితాహారం ఒక తపస్సు అని కదా శాస్త్రాలు చెబుతున్నాయి. ఆహారం ఈ విధంగా నియతంగా, రెండు మార్లు భుజించినవానికి ఆరోగ్యం సిద్ధిస్తుంది, మానసికమైన స్థితి కూడా బాగుంటుంది. అతని మాట, స్వభావం సాత్వికంగా ఉంటుంది. అతడు తపస్వి అవుతాడు, యోగి

అవుతాడు, అనుష్ఠానపరుడు అవుతాడు, అతనికి ఏకాగ్రత ఉంటుంది, భక్తి సిద్ధిస్తుంది– అని ఈ విధంగా అని కూడా శాస్త్రాలు మనకు తెలియజేస్తున్నాయి. లోకంలో కూడా "ప్రతి దినం ఒకసారి మాత్రం భుజించేవాడు యోగి, రెండుసార్లు భుజించేవాడు భోగి, మూడు మార్లు భుజించేవాడు రోగి, అంతకుమించి, నాలుగు సార్లు, ఐదుసార్లు భుజించేవాడు ద్రోహి, అంటే, ఇంకొకరు భుజించవలసిన ఆహారాన్ని తానే స్వీకరిస్తున్నాడు కనుక ద్రోహి" అనే సూక్తి ఉన్నది కదా.

ఈ విధంగా వేదంలో విధింపబడిన ఆహారవ్యవస్థను మనం అనుసరించి, ఆహారాన్ని స్వీకరించి, మన ఆరోగ్యాన్ని కాపాడుకుందాం. మనలను, సమాజాన్ని ఆరోగ్యవంతంగా చేసికొందాం. స్వస్తి.

# ఋషులు – మంత్రాలు

(ఉ. వే. శ్రీమాన్ దేవనాథాచార్యస్వామివారి తమిళ ఉపన్యాసం మూలంగా)

అపౌరుషేయాలు అని, వేదాలు అని, శ్రుతులని, నిగమాలని, త్రయీ అని, ఈ విధంగా పలు విధాలైన నామాలతో వ్యవహరింపబడుతూ ఉన్నప్పటికీ, వేదాలు అనే పేరే లోకంలో వేదాలకు ప్రచురంగా వ్యవహరింపబడుతున్నది. ఈ వేదం అనే శబ్దానికి ఏమి అర్థం? అనే సంగతిని గమనించినప్పుడు, ప్రత్యక్షప్రమాణం ద్వారా ఇంద్రియాలతో కానీ, లేక, ప్రత్యక్షజ్ఞాన సహకృతమైన అనుమాన ప్రమాణద్వారా కానీ, తెలియడానికి వీలు కాని విషయాన్ని తెలియజేసే శబ్దరూపమైన ప్రమాణమే వేదం "ప్రత్యక్షేణేనుమిత్యా వా యస్తూపాయో న బుద్ధ్యతే, ఏనం విదంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా" అనే ప్రసిద్ధమైన ప్రమాణం పై వేదశబ్ద నిరుక్తిని తెలుపుతున్నది.

ఇతర ప్రమాణాల ద్వారా తెలియడానికి సాధ్యం కాని విషయాన్ని వేదం తెలియజేస్తున్నది –అని అంటే, ఏ విధంగా తెలియజేస్తున్నది? అనే ప్రశ్న వెంటనే కలుగుతున్నది. వేదాలు మంత్రాల ద్వారా మనకు ఇతర ప్రమాణాల ద్వారా తెలియని అతీంద్రియవిషయాలను తెలియజేస్తాయి. వెంటనే, మంత్రాలు అంటే ఏమి? ఎందుకు అవి మంత్రాలని చెప్పబడుతున్నాయి? వాటి మహిమకు ఎవరు కారణం? అనే ప్రశ్నలు మళ్ళీ వెంటనే కలుగుతాయి. ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకొనే క్రమంలో వాటిని దర్శించిన వైభవంకూడా మనకు గోచరమవుతుంది.

వేదాలు అంటే శబ్దరాశి. శబ్దసమూహం. అది అంతరిక్షంలో శబ్దతరంగాల రూపంలో నిత్యం సంచరిస్తూ ఉంటుంది. ప్రస్తుత కాలంలో రేడియోలో కానీ, దూరదర్శన్ లో కానీ, ఒక విషయాన్ని మనం వినడం కానీ, లేక చూడడం కానీ చేయగలుగుతున్నాం అంటే, దానికి సరి అయిన యాంటీనా ఆవశ్యకమవుతుంది కదా. సరి అయిన సమయంలో, సరి అయిన చోట, సరి అయిన రీతిలో నిలుపబడిన యాంటీనా

మూలంగా మనం ఎక్కడెక్కడో, దూర దూర ప్రదేశాలలో జరుగుతున్న విషయాలను గూర్చి వింటున్నాము, చూస్తున్నాము కూడా. అంతరిక్షంలో అంతటా వ్యాపించి సంచరిస్తున్న, ఆ యా విషయాలకు సంబంధించిన శబ్దకాంతితరంగాలను మనం ఆకర్షించగలిగినప్పుడు ఆయా విషయాలను మనం చూస్తున్నాము, వింటున్నాము.

సుమారు 20, 30 సంవత్సరాల క్రితం వరకు మనం రేడియోలో శబ్దతరంగాలను వినడానికి కానీ, దూరదర్శన్ లో దృశ్యాలను చూడడానికి కానీ, బయట యాంటీనా అనే సాధనాన్ని ఏర్పాటు చేసుకునేవారం. కాని, ఇప్పుడు ఆ సాధనం రేడియోలలోనే దూరదర్శన్ లోనే అమర్చబడి ఉంటున్నది. యాంటినా అనే ఆ సాధనం ఇప్పుడు ఇన్బిల్ట్ యాంటినా అనే పేరుతో లోపలే అమర్చబడి ఉంటుంది. అయితే, ఇది భౌతికమైన, బయటకు కనిపించే సాధనం. దీని శక్తి పరిమితమైనది భౌతికమైన తరంగాలను మాత్రమే ఆకర్షించగలిగినది.

ఈ విధంగానే పూర్వకాలంలో మన మహర్షులు అందరూ తమలోనే ఒక ఇన్ బిల్ట్ యాంటినావంటి ఒక సాధనాన్ని ఏర్పాటు చేసుకోగలిగారు. అయితే, ఇది అంతరమైన, అలౌకికమైన సాధనం. ఈ సాధనంతో వారు అంతరిక్షంలో సదా సంచరించే మంత్రరూపాలైన, అలౌకికాలయిన శబ్దతరంగాలను తాకి, అందుకొని, ఆకర్షించుకోగలిగారు. ఆ సాధనం ఏమి? అంటే, మరేమీ లేదు, మనం ప్రసిద్ధంగా చెప్పుకునే వారి తపఃశక్తియే. దానిని ఆ మహర్షులు తమ ఇంద్రియ నిగ్రహంతో, నిరంతరమైన మననంతో, ఒక విషయం పైన మనస్సును కేంద్రీకరించి, సదా అభ్యాసం చేయడం ద్వారా తపస్సును పెంపొందించుకోగలిగారు. ఆ తపఃశక్తి అంతరిక్షంలోని మంత్రాత్మకాలైన అలౌకికశబ్దతరంగాలను గ్రహించగా, ఆ తరంగాలను ఋషులు మంత్రాల రూపంలో దర్శించారు. ఇతరుచే దర్శించడానికి వీలు కాని, ఇతరులచే వినడానికి వీలు కాని, ఇతరులచే తెలుసుకోవడానికి వీలు కాని విషయాలను ఆ

మంత్రాలు మహర్షులకు తెలియజేశాయి. ఈ విధంగా మహర్షులు అలౌకికశబ్దతరంగాల ప్రతిధ్వనులను మంత్రాల రూపంలో దర్శించగలుగుతున్నారు.

ఇక్కడ మళ్ళీ ఇంకొక ప్రశ్న కలుగుతుంది. మహర్షులు తాము తమ అమూల్యమైన, తపఃశక్తితో దర్శించగలిగిన, పరమమైన, తమ తపస్సుకు ఫలమైన మంత్రాలవల్ల ఏర్పడే ప్రయోజనాలను తామే అనుభవించకుండా, ఎందుకు లోకానికి వ్యక్తం చేయాలి? ఎంతో కష్టపడి దర్శించిన, ఎంతో మహిమ కలిగిన ఆ మంత్రాలను ఎందుకు అందరికీ అందజేయాలి? అని అంటే, ఇక్కడే ఆ మహనీయుల స్వార్థరాహిత్యం, పరోపకారపరత్వం వ్యక్తమవుతున్నది. లోకసంరక్షణకోసం వారు తమ అమూల్యతపఃఫలంగా తాము దర్శించి, సంపాదించిన మంత్రాలను లోకానికి ఉదారభావంతో అనుగ్రహిస్తున్నారు.

ఈ రీతిలో మహర్షులు తమ తపఃశక్తి ద్వారా అలౌకికశబ్దతరంగాల ప్రతిధ్వనుల రూపాలైన మంత్రాలను దర్శిస్తున్నందుకే వారికి మంత్రద్రష్టలు అనే పేరు వచ్చింది. తమ తపస్సుయొక్క ఫలంతో, బలంతో చాలా గొప్పవి అయిన, మహిమ కలిగిన మంత్రాలను ఎవరు దర్శించగలిగారో, అంటే, వినగలిగారో, అంటే, తెలియగలిగిన సామర్థ్యం కలవారో, వారే, మన శాస్త్రాలలో ఋషులు అని చెప్పబడుతున్నారు. ఋషిశబ్దానికి భగవద్రామానుజులు మొదలైన మన పూర్వాచార్యులు అందరూ మంత్రద్రష్టలు అనే అర్థాన్నే తెలియజేశారు. అందుచేత, ఆ ఋషుల తపఃఫలమే లోకక్షేమం కోసం మంత్రాల రూపంలోఆ ఋషులద్వారా మనకు అందుతున్నది. "ఋషిభిః పరిగీతాని" అనే చోట, " ఋషిభిః బహుధా గీతమ్" అనే చోట, " తస్మై నమో మునివరాయ పరాశరాయ" అనే చోట వ్యాఖ్యానం చేసేటప్పుడు మన పూర్వాచార్యులు ఋషిశబ్దానికి, మునిశబ్దానికి "మంత్రాలను దర్శించినవారు, మననం చేసినవారు" అనే అర్థాన్నే చెప్పారు. "ఋషిభిః పరిగీతాని" అనే సూక్తిని వివరిస్తూ భట్టర్ " ఆశేషవేదార్థదర్శిభిః సనకసనత్కుమారనారద ప్రభృతిభిః" అని వివరించారు.

"మునివరాయ" అనే పదాన్ని వివరించే దేశికులు "పరబ్రహ్మమననశీలేషు శ్రేష్ఠాయ పరాశరాయ " – పరబ్రహ్మను ధ్యానించడం స్వభావంగా కలవారై, అందుచేత ఆ స్వామిని దర్శించగలిగిన మునులలో గొప్పవారైన పరాశరులు– అని అన్నారు.

అందుచేత వేదం మంత్రమయమైనది. మంత్రాలు ఋషుల తపఃఫలాలు. ఋషులు తమ తపస్సుల పరమఫలంగా వాటిని పొందుతున్నారు. అందువల్ల ఋషులు లేకపోతే మంత్రాలు లేవు. మంత్రాలు లేకపోతే వేదం లేదు. వేదం లేకపోతే వైదికమైన కర్మలు లేవు. అవి లేకపోతే ఆ కర్మల వల్ల సిద్ధించే లౌకికమైన, అలౌకికమైన ప్రయోజనాలు సిద్ధించవు. అందుచేత జగద్వ్యాపారం అంతా ఋషిమూలం, మంత్రమూలం.

మంత్రం అంటే ఏమి? అనే ప్రశ్న మళ్ళీ కలుగుతుంది. తనను మననం చేసేవారిని రక్షించేది మంత్రం. "మంతారం త్రాయతే ఇతి మంత్రః" అనేది మంత్ర శబ్దవ్యుత్పత్తి. ఈ విధంగా, పరమోపకారకులై, స్వార్థం ఏమాత్రం లేనివారై, లోకం అంతాకూడా తాము పొందిన ఆనందాన్ని, జ్ఞానాన్ని, అనుభవాన్ని పొందాలనే విశాలమైన హృదయం కలవారై, తాము ఎంతో కష్టపడి సంపాదించిన ఫలాలైన మంత్రాలను లోకానికి అంతటికి అందించిన ఋషుల విషయంలో లోకం ఎంతో ఋణపడి ఉన్నది– అనే విషయంలో ఏ మాత్రం సందేహం లేదు. అందువల్లనే వైదికులు అందరూ దేవర్షికాండర్షిపితృ తర్పణాలను చేస్తున్నారు. ఋషులు, వారి తపస్సు, దాని ఫలరూపమైన మంత్రాలు, ఆ మంత్రాలను లోకానికి అనుగ్రహించిన ఆ ఋషుల ఔదార్యం, అందువల్ల లోకానికి సిద్ధించిన పరమహితం, విలక్షణమైన ఆ మహర్షుల సమయాచారాలు, వారి మంగళకరమైన చరిత్రలు అన్నీ సదా స్మరణీయాలు కదా. వారి విషయంలో మనం కృతజ్ఞత ప్రకటించుకోవడం మన పరమధర్మం, మన కర్తవ్యం. ఆ మంత్రాలను అధ్యయనం చేసే వైదికోత్తములను గౌరవించడం మన విధి. మనకు మంచిది కలిగించే విషయం. స్వస్తి.

# అధికారప్రాప్తి భగవదనుగ్రహఫలమే

ఈ లోకంలో ప్రతి వ్యక్తి పదవిని, పట్టాన్ని, అధికారాన్ని, కీర్తిని కోరడం సహజం. అయితే, ఆ విధంగా ఆశించిన పదవి, కీర్తి గౌరవం ఎవరికి లభించినా, అది కేవలం భగవంతుని సహజమైన కరుణ వల్ల లభించిస్తుంది, ఆ సర్వేశ్వరుని అనుగ్రహం లేకపోతే, ఎవరికి ఏ విధమైన గౌరవం లభించదు —అనే విషయాన్ని, ఆ పదవి, అధికారం కీర్తి, పట్టం లభించిన తరువాత ఒకడు ఏ విధంగా వర్తించాలి? అనే విషయాన్ని మనకు ఒక వైదికమైన ఉపాఖ్యానం ఉపదేశిస్తున్నది. ఇంద్రలోకంలో దేవేంద్రునకు ఇంద్రపదవిని అనుగ్రహించినవాడు సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే అనే విషయాన్ని ఈ కథ మనకు తెలియజేస్తున్నది.

సృష్టి ప్రారంభంలో భగవంతుడు దేవతలను అందరినీ సృష్టించాడు. అగ్ని, వరుణుడు, యముడు, మొదలైన పదవులు పలువురు దేవతలను సృష్టి చేశాడు. తరువాత ఇంద్రుని సృష్టించాడు. ఇంద్రుని సృష్టించిన తరువాత, అతనిని పిలచి, " నీవు పోయి, దేవతలకు పాలించు. నిన్ను దేవతలకు అధిపతిగా చేస్తున్నాను. నీవు దేవతల దగ్గరకు పోయి, నేనే మీకు ప్రభువును— అని చెప్పు. దేవలోకంలో ఉంటూ వారిని పాలిస్తూ ఉండు" అని అన్నాడు. ఇంద్రుడు అంటే —పాలించేవాడు —అని అర్థం.

భగవంతుని ఆజ్ఞను అనుసరించి ఇంద్రుడు దేవలోకానికి పోయి, దేవతలతో " ఓ దేవతలారా! నన్ను మీకు ప్రభువుగా చేసి భగవంతుడు నన్ను మీ దగ్గరకు పంపించాడు. అందుచేత ఇకపై మీకు నేను ప్రభువును "అని అన్నాడు. కానీ దేవతలు అతనిని ఎంత మాత్రం పట్టించుకోలేదు. వారికి ఇంద్రుని చూస్తే వేళాకోళంగా కూడా అనిపించింది. " నీవు మాకు ప్రభువా! నిన్ను చూస్తే ఆ విధంగా అనిపించడం లేదే! నీవు నన్ను మమ్ములను పాలిస్తావా! మీ వల్ల మాకు హితం కలగాలా! నిన్ను చూస్తే నవ్వు వస్తున్నది" అని అంటూ దేవతలు ఇంద్రుని పరిహాసం చేయడం ప్రారంభించారు. వారు

ఆ విధంగా ఎందుకు చేశారు? అంటే, ఇంద్రుని రూపంలో పరిపాలకునకు ఉండవలసిన తేజస్సు ఏమాత్రం వారికి కనిపించలేదు. ఇంద్రుని రూపం చాలా సాధారణంగా కనిపించింది. అటువంటి రూపం కలిగిన ఇంద్రుని వారు తమ పరిపాలకునిగా అంగీకరించదు కదా !అందుచేత వారు అతనిని పరిహాసం చేశారు.

అప్పుడు ఇంద్రుడు మళ్ళీ భగవంతుని దగ్గరకు వచ్చి "స్వామీ! నన్ను దేవతలు పట్టించుకోవడం లేదు. నన్ను వారికి తమ ప్రభువుగా అంగీకరించడం లేదు. నన్ను చూస్తే వారికి తమ పరిపాలకునిగా తోచడం లేదు. పైగా వారికిపరిహాసంగా కూడా ఉన్నది. నన్ను వారు ఏ మాత్రం లెక్కబెట్టడం లేదు. నాలో ప్రభువుకు ఉండదగిన తేజస్సు లేదు. అందుచేత వారు నన్ను తక్కువ చేస్తున్నారు. నీకు కల తేజస్సులో కొంత తేజస్సును మాకు అనుగ్రహించు. అప్పుడు వారు నన్ను ప్రభువుగా అంగీకరిస్తారు" అని అన్నాడు.

భగవంతుడు అంతు లేని దివ్యమైన తేజస్సు కలవాడు కదా! లోకంలోని తేజఃపదార్థాలు అన్ని భగవంతుని తేజస్సు యొక్క ప్రభావం చేతనే ప్రకాశిస్తున్నాయి. ఆ తేజస్సులోని చాలా అచల్పమైన అంశ చేతనే కదా అవి ప్రకాశిస్తున్నాయి. ఎంతో గొప్పగా వెలిగే సూర్యుని తేజస్సు కూడా భగవంతుని తేజస్సులోని చాలా అల్పమైన అంశమే కదా. "తస్య భాసా సర్వమిదం విభాతి" అని కదా వేదం తెలియజేస్తున్నది. సూర్యుని సృష్టించినవాడు కూడా పరమాత్మయే. అందుచేత, భగవంతుడు తన దగ్గర ఉండే తేజస్సును కొంత అనుగ్రహించి సూర్యుని సృష్టించాడు. "సూర్యునకు నీవు తేజస్సును అనుగ్రహించి సృష్టించావు. కానీ, నాకు అంత తేజస్సు అనుగ్రహించవలసిన పనిలేదు. నీకున్న తేజస్సులో చాలా అల్పమైన తేజస్సు ఇస్తే చాలు. అప్పుడు దేవతలు నన్ను వారికి ప్రభువుగా గుర్తిస్తారు. నేను దేవతలకు ప్రభువును కాగలను" అని ఇంద్రుడు భగవంతుని అర్థించాడు.

అప్పుడు భగవానుడు "ఇంద్రా! ఈ విధంగా అందరికీ నా తేజస్సును పంచి ఇస్తే, నా తేజస్సు సంగతి ఏమి కావాలి? నా తేజస్సులో కొంత భాగం సూర్యునకు ఇచ్చాను. ఆ విధంగానే చంద్రునకు, అగ్నికి, నక్షత్రాలకు కూడా ఇచ్చాను. అందరికీ నా తేజస్సును ఇచ్చి వేసి తరిగిపోతే, నన్ను చూచి అందరూ ఏమంటారు? నేను ఎటువంటివాడను ఔతాను? " అన్నాడు. అప్పుడు ఇంద్రుడు "స్వామి! నీ తేజస్సుకు ఏమి కొరత! ఎవరికి ఎంత ఇచ్చినా నీ తేజస్సు నిత్యం పూర్ణంగా కదా ఉంటుంది. దానికి ఏనాడు ఎటువంటి కొరత ఉండదుకదా!. నీది సహజసిద్ధమైన నిరుపాధికమైన తేజస్సు. నేను ఎటువంటివాడను అవుతాను? "కః" అని అన్నావు. కనుక, ఆ పదం నీకు నామం కాగలదు. ( శ్రీవిష్ణు సహస్రనామాలలో ఉండే భగవంతుని నామాలలో "ఏకో నైకః సవః కః కమ్ " అని "కః" అనేది కూడా ఒక నామమై పఠింపబడడం గమనించవచ్చు).

భగవంతుడు తన స్వరూపాన్ని అతడు సరిగా అర్థం చేసుకున్నందుకు సంతోషించి, తన తేజస్సులో కొంత భాగాన్ని అతనికి అనుగ్రహించాడు. బంగారంతో ఒక పట్టాన్ని నిర్మించి, అతని తలకు అలంకరించాడు. అప్పటినుండే ప్రభువులకు అధికారం పొందే సమయంలో అతని తలకు పట్టాన్ని అలంకరించడం అనే పట్టాభిషేకమహోత్సవం ప్రారంభం అయింది. ఈ విధంగా ఇంద్రుని అనుగ్రహించిన తరువాత, భగవంతుడు అతనితో " ఇక నీవు నీ లోకానికి పో. నిన్ను దేవతలు అందరూ తప్పక ప్రభువుగా గుర్తిస్తారు. వారిని నీవు పాలించు"అని అన్నాడు. ఇంద్రుడు చాలా ఉత్సాహంతో వేగంగా దేవలోకానికి వెళ్ళాడు.

దేవతలు అపుడు ఇంద్రునిలో అంతకు ముందు లేని గొప్ప తేజస్సును చూశారు. అంతేకాక, అతని తలకు ఒక దివ్యమైన పట్టం అలంకరింపబడి ఉండడం కూడా గమనించారు. వెంటనే వారు ఇంద్రుని దగ్గరకు స్వయంగానే వచ్చి, " నీవే మాకు ప్రభువు" అని అంటూ అతనిని తమకు ప్రభువుగా అంగీకరించారు. అప్పటి నుండి ఇంద్రుడు దేవేంద్రుడయ్యాడు. కానీ, ఇంద్రుని తీవ్రమైన, సూర్యుని వంటి తేజస్సును

చూసి వారు అతని దగ్గరకు రావడానికి జంకి దూరంగా వెళ్లిపోవడం ఆరంభించారు. ఈ సంగతిని ఇంద్రుడు కూడా గమనించాడు.

ఇంతలో భగవంతుడు "ఇంద్రునకు ఇంకా ఏమి చేయవచ్చు? "అని ఆలోచిస్తూ ఉండగా, దేవేంద్రుడు భగవంతుని దగ్గరకు వచ్చి, " స్వామీ! నీవు నాకు తేజస్సును ఇచ్చావు బాగున్నది! కానీ, ఈ తేజస్సును చూచి, దేవతలు అందరూ నాకు భయపడి దూరంగా తొలగిపోతున్నారే! నేను ఏమి చేయాలి? నా దగ్గరకు వారు వచ్చేటట్లుగా కూడా నాకు ఒక చల్లని తేజస్సు అనుగ్రహించు. లేకపోతే వారిని నేను ఏ విధంగా పాలించాలి?"అని అన్నాడు.

భగవంతుడు అన్ని విధాలైన తేజస్సులను కలవాడు. సూర్యుని తేజస్సు వంటి తీవ్రమైన తేజస్సును, చంద్రుని తేజస్సు వంటి చల్లని తేజస్సును రెండిటినీ కలిగినవాడు అనే విషయాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధం ఆరంభంలో "కదిర్ మదియమ్ పోల్ ముకత్తాన్"— సూర్యునివంటి చంద్రునివంటి ముఖం కలవాడు— అని తెలియజేసింది. "తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎళుందాఱ్పోల్ అంగణ్ ఇరండుమ్ కొండు" — సూర్యుడు, చంద్రుడు ఉదయించినట్లుగా ఉండే నీ అందమైన నేత్రాలతో మమ్ములను కటాక్షించు— అని ఆ ప్రబంధంలోని 22వ పాశురంలో అన్నది.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. పాలకునకు తేజస్సు ఉండవలసినదే కానీ, ఆ తేజస్సు సూచి ప్రజలు భయపడేటట్లు ఉండకూడదు. వారు అతని దగ్గరకు చేరడానికికూడా అది ఉపకరించాలి. ప్రభువు తేజస్సును చూసి ప్రజలు గౌరవించాలి, కానీ, ఆ తేజస్సు వారికి అతని దగ్గరకు చేరడానికి వీలుగా ఉండాలి. ఈ రెండు విధాలయిన స్వభావాలను ప్రభువు కలిగి ఉండాలి. "అధృష్యశ్చాభిగమ్యశ్చ యాదోరత్నైరివార్ణవః" —ప్రభువు సముద్రంవలె ఉండాలి. సముద్రం ఏ విధంగా భయం కలిగించేది అయినా, ఆకర్షణీయంగా దగ్గరకు చేరాలని అనిపించేటట్లు ఉంటుందో,

ప్రభువు కూడా ఆ విధంగానే ఉండాలి– అని కాళిదాసు అన్నాడు కదా. ప్రభువును చూస్తే భయమూ ఉండాలి. చనువూ ఉండాలి.

భగవంతుడు ఇంద్రుని మనసును అర్థం చేసుకున్నాడు ఆ స్వామిలో తీవ్రమైన, సూర్యుని తేజస్సు వంటి తేజస్సు ఉన్నట్లే, చంద్రుని కాంతివంటి చల్లని కాంతి కూడా ఉన్నది. అందుచేత. భగవంతుడు ఇంద్రుని ప్రార్థనను అంగీకరించి, తన చల్లని తేజస్సులో కొంత భాగాన్ని ఇంద్రునకు ఇచ్చాడు.

ఈ విధంగా ఇంద్రుడు సూర్యుని తేజస్సు వంటి తేజస్సును, చంద్రుని తేజస్సు వంటి తేజస్సును, రెండిటిని కలిగినవాడయ్యాడు. అప్పుడు దేవతలు అందరూ ఇంద్రుని చూసి, అతనిని తమకు ప్రభువుగా అంగీకరించడమే కాక, అతని దగ్గరకు రావడం కూడా ఆరంభించారు అందరినీ సంతోషపెట్టే, సమర్థవంతంగా పాలించగలిగిన అధిపతిగా ఇంద్రుడు అయ్యాడు.

సూర్యుడంటే సువీర్యుడు – గొప్ప వీర్యాన్ని కలవాడు– అని అర్థం. అంటే, తన తేజస్సుతో ఇతరులను నియమించగలిగి, వారిని సక్రమమైన మార్గంలో పెట్టగలిగి, తగిన రీతిలో సంచరించేటట్లు వారిని ప్రేరేపించేవాడు– అని అర్థం. ఆ విధంగానే, చంద్రుడు అంటే– చల్లదనాన్ని కలిగించేవాడు, ఆహ్లాదాన్ని కలిగించేవాడు, చూడగానే మనస్సుకు ఆనందాన్ని కలిగించేవాడు –అని అర్థం. నిజానికి ఈ రెండు స్వభావాలు భగవంతునిలోనే సహజంగా ఉన్నాయి. భగవంతునిలో ఉండే తీవ్రమైన తేజస్సును, ఇతరులను సక్రమమైన మార్గంలో నడిపించగలిగిన శక్తిని పొందిన కారణంచేతనే సూర్యుడు సూర్యుడు అయ్యాడు. ఆ విధంగానే, ఇతరులను ఆనందింపజేయగలిగిన, మనసును చల్లబరచగలిగిన తేజస్సును భగవంతుని వలన పొందిన చంద్రుడు చంద్రుడు అయ్యాడు.

ఇక్కడ ఆ రెండు స్వభావాలను భగవంతుడు ఇంద్రునకు అనుగ్రహించడం చేత ఇంద్రుడు కూడా సమర్థుడైన పాలకుడు అయ్యాడు. ఈ విధంగా "ప్రభువు ఈ రెండు విధాలైన స్వభావాలను కలిగి ఉండాలి", అని ఇక్కడ మనకు తెలుపబడినది. భగవంతుడు అనుగ్రహిస్తేనే ఇటువంటి రెండు విధాలయిన సామర్థ్యాలను లోకంలోని ఏ పాలకుడు అయినా పొందగలడు –అనే విషయం కూడా ఇక్కడ సూచింపబడింది. ఈ విధంగా సూర్యుడైనా చంద్రుడైనా, ఇంద్రుడైనా తమకు తమకు గల స్వభావాలను, సామర్థ్యాలను, పదవులను భగవంతునివల్లనే పొంది ప్రకాశించగలుగుతున్నారు అనికూడా మనకు తెలుస్తున్నది. " ప్రజాపతి రింద్ర మసృజత" అని ఆరంభించి వేదంలో ఈ ఉపాఖ్యానం తెలుపబడింది.

అందుచేత మనకు ఏ అధికారం, కీర్తి, పట్టం లభించినా, అది భగవంతుని నిరవధికమైన, సహజమైన అనుగ్రహంచేతనే లభించిందని గ్రహించాలి, అంతే కాదు, మన అధికారాన్ని ఇతరులకు ఆనందాన్ని, హితాన్ని కలిగించే విధంగా ఉపయోగించాలి– అనే ఉపదేశాన్ని ఈ ఉపాఖ్యానం ద్వారా వేదం మనకు బోధిస్తున్నది.

***

